# భారతి

సాహిత్య మాసపత్రిక

ఆగస్టు 1988

వెల: 5 రూపాయలు



● అచ్చమైన అధివాస్తవిక
త్రినేత్ర కవి శ్రీరంగం నారాయణబాబు
-శ్రీ గూడ శ్రీరాములు

● కాలపరిష్వంగం- శ్రీ నిఖిలేశ్వర్

● పాలకవీడు శిలాశాసనము
-శ్రీ బి. ఎన్. శాస్త్రి

● తాపవిద్యుత్తు, జ్యోతిర్గీతాలు
-శ్రీ గడియారం శేషఫణిశర్మ



వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

సంపుటము : (          ఆగస్టు 1988

విడిపతి

---

## విషయానుక్రమణి

ఆగస్టు - 1988

# స్వవిషయం

శ్రీ బి. ఎన్. శాస్త్రిగారు మళ్ళీ భారతికి ఒక శాసనాన్ని పరిష్కరించి పంపారు. పాలకవీడు శిలా శాసనం వివరాలు ఆయన వ్యాసం చదివి తెలుసుకోవచ్చు !

శ్రీరంగం నారాయణబాబు కవిత్వంలో అధివాస్తవికతని గురించి శ్రీ గూడ శ్రీరాములు రాసిన వ్యాసంలో ఆసక్తి కలిగించే అంశాలు ఎవరికయినా చాలా కనపడతాయి. కొంతకాలంగా శ్రీరంగం నారాయణబాబు కవిత్వాన్ని గురించి ఆలోచించే వారి సంఖ్య పెరుగుతోందని అనిపిస్తుంది...

ఈ నెల భారతిలో శాసనాలకి సంబంధించిన మరొక వ్యాసం కూడా ఉన్నది. భారతిలో మొదటినుంచీ శాసనాల ప్రచురణకి ప్రాముఖ్యం ఉంటూ వచ్చింది. [అశోకుడి శాసనాలలో ఒకటి మొదటిసారిగా భారతిలోనే ప్రచురించబడింది !] డా॥ సి. ఎ. పద్మనాభశాస్త్రిగారు నాగవంశి చిందుల రెండు తామ్ర శాసనాలని పరిశీలించి పంపిన వ్యాసం కూడా చరిత్ర పట్ల ఆసక్తికలవారికి హర్షదాయకంగా ఉండగలదు !

ఆల్కహాల్ ( ఆల్‌జిబ్రా, కెమిస్ట్రి మాటల లాగే ) అరబ్బు భాష నుంచి ఇంగ్లీషుకి సంక్రమించినది అంటారు. శ్రీ వే. వేమూరిగారు ఈ సంచికలో ఆల్కహాలుని గురించి ఇంకా సమాచారాన్ని ఇస్తూ రాసిన వ్యాసం ఎటువంటి పఠితని అయినా చదివింప చెయ్యగలదనిపిస్తుంది...

ఒక "ఇంజనీరు"గా శ్రీ గడియారం శేషఫణిశర్మ "ఉష్ణగతిక" శాస్త్రదృష్టితో రాసిన పద్యాలు ఆలోచింపచేసేట్లుగా ఉంటాయి !

శ్రీ నిఖిలేశ్వర్, ప్రభంజనః, రఫీ, సుబ్బారావు, లీలామోహనరావు, కవితాప్రసాద్, రామకృష్ణమూర్తి, వెంకటరత్నమ్, సౌభాగ్య, లింగమూర్తి – వీరి రచనలు ఈనెల భారతిలో కవిత్వం సుష్టుగా ఉన్నాయనిపింప చేస్తున్నాయి...

అమరావతిలో ఇంకా తెలుసుకోవలసిన విశేషాలు ఉన్నాయనటానికి శ్రీ పురాణం రాధాకృష్ణప్రసాద్‌గారి వ్యాసమే నిదర్శనం !



# ధ్వని ధున్యః

## ప్రభంజనః

**విహగీ :**

పక్షౌ కిం విహగీ ప్రసారయతి నేతి వ్యర్థ మాక్రంద సే
సోద్వేగం మృదులాం యది త్వరయసే తాం కామ సంచారిణీమ్
యత్నైః పంథతి నిష్ఫలం; తదఖిలం తథ్యం శవోద్వర్తనం
ప్రోత్పశ్యేర్దివసాని భద్రమనసా మాసాశ్చ వర్షాణి వా ॥

**స్వర్గ నరకౌ :**

"స్వర్గో వా నరకోఽస్తివాఽతి విపులో బ్రూహీ" త్య పృచ్ఛ త్ప్రభుః
"స్వర్గో భూవర! నాస్తి పంశయ" ఇతి బ్రూతే స్మ విద్వద్వరః
"నిశ్శంకం సహసా కథం కథయసే లోకజ్ఞ తా వద్దృఢం"
"లోకేఽస్మిన్ ద్రవిణేత రే ఖలు ధనేశేభ్యశ్చ సంఖ్యాధికాః ॥

**కుటుంబ సంక్షేమః :**

"దిష్ట్యా చూతోయది వరయతే మాలతే ముగ్ధవల్లీం
ఏకో ద్వౌ వా యది పరభృతా గాయత స్తస్య మధ్యాత్
సర్వం భాగ్యం కృతమిహ తయోః కిం పునర్వాంఛ నీయం"
పౌనః పున్య స్మరణ రుచిరం ప్రేయసీ నర్మ వాక్యమ్ ॥

"సత్యం, త్వం ప్రియ! రూప వానితి మయైవాఽసాంప్రతం ముష్యసే
జ్ఞాత్వా మాం కృపయా సహస్వ కతిచిన్మాసాన్మనో గోపితం
త్వాం దాస్యామి తవైవ ఖల్వితి" ముదం సంభాషమాణాం ప్రియః
సంతోషాతిశయేన 'భాగ్యమి'తి తాం జాయాం ముహుశ్చుంబతి ॥

**సౌందర్య ప్రమాణమ్:**

దృష్ట్వా సీతాం దశముఖ వధానంతరం మందభాగ్యాం
"ఏషా సీతా భువన రమణీ త్యాహు రార్చాటు పూర్వమ్
శంకేఽయం నస్తుదతి బత। కిం నాస్తి వాలో ప్యముష్యాః
ఇత్యన్యోన్య శ్రణవివరం పూర్యతే కీశ యూథైః ॥

**అహమపి:**

జాయేఽహం మహతాం సుధామయ శిరా జాలాత్కపీనాం పురా
సంవర్ధే, స్మ మనోజ్ఞ భావ కవితోత్సంగేఽను రాగాన్వితమ్
కుర్వే స్నేహ మకల్మషం ప్రగతి భావోద్విగ్నవాణీసుతైః
తావన్మాం ప్రతినోచితం చ్యుత మనో వా వాయసాలోకనమ్॥

---

డా॥ సి. ఎ. నాభశాస్త్రి

# నాగవంశి చిందుల రెండు తామ్రశాసనములు

ఆంధ్రదేశమునకు, అటు ఇటు ఉన్న మహారాష్ట్ర, మధ్య ప్రదేశ్, ఒరిస్సా, కర్ణాటక, తమిళనాడు రాష్ట్రములకు ఉన్న సంబంధ బాంధవ్యములు చారిత్రక కాలములనుండి కలవన్న వాదము నిర్వివాదాంశములే. ఈ సాంస్కృతిక, రాజకీయ సంబంధములు దాదాపు శాతవాహనుల ప్రారంభమయి ప్రస్తుతకాలములో కూడ కొనసాగింప బడుతున్నవి. ఈ రాష్ట్రములలో మనకింతవరకు ప్రాకృత శాసనములతో బాటు, స్వచ్ఛమైన తెలుగు శాసనములు లభించుట కానవచ్చును. ముఖ్యముగా మధ్యప్రదేశ్ రాష్ట్రములో బస్తర్ జిల్లాలో కొన్ని తెలుగు శిలాశాసనములు లభ్యమగుట, వాటిని ప్రొఫెసర్ హరాలాల్ గారు పరిష్కరించి, సుమారుగ 30 సంవత్సరాల క్రిందట ప్రచురించుట జరిగింది. అయితే, తామ్ర శాసనములు, ముఖ్యముగా తెలుగున లిఖింపబడిన తామ్రశాసనములు, 1971-72 సంవత్సరమున దొరికినవి. ఈ తామ్రశాసనముల ప్రతులు మైసూరునందు మా కార్యాలయమునందు భద్రపరుపబడినవి.

ఇవి మూడు తామ్రశాసన పట్టికలు. నాగవంశి చిందు కులమునకు చెందినవి. ఇవి 'ఆర్కియాలజికల్ సర్వే ఆఫ్ ఇండియా' వారి 1971-1972 సంవత్సరపు 'అన్యువల్ రిపోర్టు ఆఫ్ ఇండియన్ ఎపిగ్రఫీ'యందు 'బి4-6 నంబర్లుగా' నమోదు చేయబడినవి. ఈ మూడు తామ్రశాసనములలో, ప్రస్తుతము రెండు తామ్రశాసనములు మాత్రము, పరిష్కరించుచున్నాను. మూడవ తామ్రశాసనములో దాన గ్రహీతల పేర్లు మాత్రము గలవు. ఈ వ్యాసమును, నేను జబల్‌పూర్‌లో జరిగిన 'ఎపిగ్రాఫికల్ సొసైటి ఆఫ్ ఇండియా'వారి 13వ సమావేశమునకు పంపిన ఆంగ్ల వ్యాసమునకు తెలుగు ప్రతిక. దీనిని ప్రచురించుటకు అనుమతినిడిన మా కార్యాలయ నిర్దేశకులకు, 'ఛీఫ్ ఎపిగ్రఫిస్ట్' లకు, కృతజ్ఞతలు.

## మొదటి తామ్రశాసనము

ఈ తామ్రపట్టికయందు మూడు రాగిరేకులు కలవు. ఈ మూడు రేకులు సుమారు ఒకే 'సైజున' కలవు. ఇవి జతగ ఒక రాగికడియమునకు చేర్చియున్నవి. ఈ కడియముచేరి ఈ తామ్ర శాసనము మొత్తము సుమారుగా 1260 గ్రాముల బరువు కలవు. మొదటి రేకు రెండవప్రక్కను, రెండవ రేకుకి రెండువైపులను, మూడవరేకు లోపలవైపునను, స్పుటముగా అక్షరములు తెలుగున చెక్కబడియున్నవి. రాగి కడియముమీద వ్యాఘ్రలాంఛనము పొందికగా చెక్కబడినది. దానితోబాటు గోవు, అర్ధచంద్రుడు, సూర్యుడు కలవు. ముద్రికమీద ఎటువంటి అక్షరములు లేవు.

శాసనమంతయు గద్యభాగము. అక్షరపొందిక అంతగా లేకపోయినను, సులువుగ చదువవచ్చును.

ఈ శాసనము శకసంవత్సరము 985, శుభకృత్సంవత్సరమున, మాఘమాసము శుక్ల పంచమి, గురువారము నందీయబడినది. శ్రీ ఎస్. కె. పిళ్లెగారి 'ఇండియన్ ఎఫిమరిస్' ననుసరించి శాసనకాలము క్రీ.శ. 1064 సంవత్సరము, జనవరి 26వ తేదికి సరిపోవుచున్నది.

శాసనప్రదాత నాగవంశోద్భవుడును, భోగావతీపుర పరేశ్వరుడును, ధేనువ్యాఘ్ర లాంఛనధారుడును, చిందకుల కమలభాసురుడును, మహామహేశ్వర చరణ కమల సేవితుడునైన శ్రీ మజ్జగదేక భూషణ మహారాజు దత్తవాడ 'నెలవీటి'నుంచి పై శాసనము దానము చేసెను. తన మహారాణియైన గుండమదేవియందు సోమేశ్వరదేవుడుద్భవించిన సందర్భములో ఈ శాసనమిచ్చుట గమనార్హము. అనగా సోమేశ్వరుడు క్రీ॥శ॥ 1064 సంవత్సరమున జనించెనని తెలియవచ్చును. బొడ్డక చెరువనెడి గ్రామమును పిండదాన మర్యాద ధర్మముగాను, సర్వబాధ పరిహారముగాను, మానభట్టు అనెడి బ్రాహ్మణునికి ధారాదత్తము చేసెను.

ప్రధాని నాగతిరాజు, రాజగురువులు రుద్రపండితులు, గుమ్మలనాంటి పెద్దనాయకులు, శ్రీకరణము దారెనాయకుడు, రేకన పెగ్గడ, దండనాయకుడైన గుండ నాయకుడు, కరణము రేచమ నాయకుడు అనుమతితో జగదేక మహారాజు ఈ దానమును చేసెను. బాలనారాయణ గుండాచారి శాసనకర్త. శాసనము వ్యాసగీతి శ్లోకములతో నంతమయినది.

## రెండవ తామ్రశాసనము

ఇదికూడ పైదానివలెనే మూడు తామ్రశాసనముల పట్టిక. శాసనము మొదటిరేకు రెండవవైపునను, రెండవరేకు రెండువైపులను, మూడవరేకు మొదటివైపునను చెక్కబడియున్నది. ఈ రేకులు మూడును రాగి కడియమునకు తొడగబడియున్నవి. రాగి కడియము చివరలు చిన్న ముద్రికకు జతచేయబడి యున్నవి. ముద్రికమీద చిహ్నములు అంతగా కనిపించుటలేదు కాని సూక్ష్మపరిశీలనమున కనిపించెడి చిహ్నములను, సూర్య, చంద్ర, వ్యాఘ్ర, ధేనువులుగా గుర్తించుటకు అవకాశము గలదు. చిందకులస్థులు ధేను, వ్యాఘ్ర లాంఛనములు వాడుట సమంజసనీయమే కదా.

శాసనమంతయు గద్యభాగమే. శాసనము 40 పంక్తులలో రాసియున్నది. కాని వాటిలో కొన్ని పంక్తులు (6, 8, 9, 10) పూర్తిగా అరిగిపోయి ఉండుటవలన, చదువుటకు వీలుపడలేదు. మొదటి అయిదు పంక్తులయందు చిందకుల వర్ణన అయిన 'సహస్ర ఫణా కిరణ...'లతో ప్రారంభింపబడినది. అటుపైన శ్రీ మజ్జగదేవ భూషణ మహారాజుల పేరును, సోమేశ్వరదేవుల పేరును, ఆయన పుత్రులు (పేరు చదువుటకు వీలుగా లేదు) అయిన రాజభూషణ (మహారాజు) పేరు మాత్రము కనిపించుచున్నది. బహుశ ఈ మహారాజు, శక సంవత్సరము 1057, మాఘమాసమున, శుక్లపక్ష భృగు వారమునాడు ఈశ్వరనాయకుని గుమ్మలనాండును సర్వబాధాపరిహారముగ దానము చేసినాడు.

మిగిలిన శాసనమంతయు సాక్షుల పేర్లతో నింపబడియున్నది. శ్రీ కరణము పోతమ శాసనరచన చేసినాడు. 36నుండి 40వ సూక్తి వరకు వ్యాసగీతి శ్లోకముతో నిండియున్నది.

మూడవ తామ్రశాసనమంతయు సాక్షుల పేర్లతోనే నింపబడియుండుట గమనార్హము. బహుశ ఈ రెండవ తామ్రశాసనముయొక్క పూర్తి పాతము కావచ్చును.

నాగవంశి చిందకుల వంశస్థుల శిలా, తామ్రశాసనములు సుమారు 22 ఇంతవరకు దొరికినవి. ఈ క్రింద ఇచ్చిన జాబితావలన వీరి శాసనముల గురించి తెలుసుకోవచ్చును.

| సంఖ్య | దొరికిన ప్రదేశము | శకవర్షములు | రాజు పేరు |
|---|---|---|---|
| 1. | జగదల్‌పూర్ | శకసంవత్సరం 945, వైశాఖ | భూషణ మహారాజు[1] |
| 2. | బార్‌సూర్ మొదటి శాసనం | 962, శార్వరి కార్తిక | జగదేక భూషణ మహారాజు[2] |
| 3. | బైరాంఘర్ | 982 | డిటో[3] |
| 4. | పోతినార్ | 983 | డిటో[4] |
| 5. | దంతేశ్వరం | 984 | డిటో[5] |
| 6. | బైరాంఘర్ తామ్రశాసనం | 985 | డిటో[6] |
| 7. | రాజపుర తామ్రశాసనం | 987 | మధురాంతకదేవ[7] |
| 8. | కురుసుపాల్ మొదటి శాసనం | 991 | సోమేశ్వరదేవుని[8] మహారాణి ధరణీదేవి |
| 9. | కురుసుపాల్ రెండవ శాసనం | — | డిటో[9] |
| 10. | గదియా | 1019 | సోమేశ్వర దేవుడు[10] |
| 11. | కురుసుపాల్ మూడవ శాసనం | 1019 | రాజభూషణ మహారాజు[11] |
| 12. | బారసూర్ రెండవ శాసనం | 1130 (1030) | సోమేశ్వరదేవుని రాణి గంగ మహాదేవి[12] |
| 13. | నారాయణపాల్ శాసనం | 1033 | ధరావర్ష మహారాజు[13] |
| 14. | భాయ్ కురుసుపాల్ | ... | సోమేశ్వర రాజభూషణ మహారాజు[14] |
| 15. | బైరాంఘర్ తామ్రశాసనం | 1057 | సోమేశ్వర[15] |
| 16. | జతన్‌పాల్ శాసనం | 1140 | నరసింహదేవ[16] |
| 17. | రెండవ దంతేశ్వర శాసనం | 1147 | నరసింహదేవ,[17] తల్లి గంగాదేవి |
| 18. | ఇత్‌పాల్ మొదటి తామ్రశాసనం | 1168 | నరసింహదేవ[18] |
| 19. | ఇత్‌పాల్ రెండవ తామ్రశాసనం | ... | పల్లవ మహాదేవి నరసింహదేవుని తల్లి[19] |
| 20. | బారాసూర్ మూడవ శాసనం | 1242 | రాజు పేరు లేదు[20] |
| 21. | తిమరశిలా శాసనం | 1246 | హరిశ్చంద్ర[21] |
| 22. | సునర్‌పాల్ శాసనం | ... | శ్రీ జయసింహదేవ[22] |

ఇంతవరకు దొరికిన తామ్ర, శిలాశాసనములబట్టి, నాగవంశి చిందకుల వంశస్థుల వంశక్రమము నిర్ణయించుటకు సాధ్యమవుతున్నది. శ్రీ కీ॥ శే॥ హిరాలాల్‌గారు గాని, మరే ఇతర చారిత్రకులు గాని, నాకు తెలిసినంతవరకు ఇదమిత్థముగా చిందకుల వంశస్థుల జాబితా తయారుచేయలేదు.

పైన ఇచ్చిన శాసనములవల్ల, కొంతలో కొంత వంశజాబితా తయారు చేయవచ్చు. ఇది తయారుచేసేముందు కొన్ని విషయాలను గురించి తెలుసుకోవటం ఉత్తమము.

(1) శకవర్షము 985లో ఇచ్చిన బైరాంఘర్ (మొదటి) తామ్రశాసనం వలన జగదేకభూషణ మహారాజు, అతని రాణి గుండమ

దేవులు, కుమారుడు సోమేశ్వరదేవులు, తెలియవచ్చుచున్నారు. ఇతర శాసనములలో విడివిడిగా తెలియవచ్చుచున్నారుగాని, వారి బంధుత్వం తెలియవచ్చుటలేదు. అంతేకాక సోమేశ్వరదేవుని 'జన్మదిన' సందర్భములో (శ్రీమత్సోమేశ్వర దేవోదయంబునం బుత్రోత్సాహంబు నిమిత్తంబున — 15-16 పంక్తులు) నిచ్చిన తామ్రశాసనము.

(2) శకవర్షము 1033తో నిచ్చిన నారాయణపాల్ శిలా శాసనములో ధరావర్ష మహారాజు, అతని భార్య గుండమదేవి, కుమారుడు సోమేశ్వరదేవు, మనుమడు కన్నరదేవుడు తెలియవచ్చుచున్నారు. ఇందులో పై శాసనములో తెలియపరిచిన ముగ్గురుకాక, మరియొక వంశస్థుడు కానవచ్చుట గమనార్హము. మామూలుగా 25 సంవత్సరములు, రాజ్య పరిపాలనా వర్షములుగా తీసుకుంటే, ఈ శాసనములో కల ధరావర్షుడును జగదేకభూషణ మహారాజుగా గుర్తింపవచ్చును.

(3) బైరాంఘర్ రెండవ తామ్రశాసనములో చెప్పబడిన జగదేక భూషణ మహారాజు, సోమేశ్వరదేవుడు, సోమేశ్వర రాజ భూషణ మహారాజులను పైదాని ప్రకారం గుర్తించుటకు వీలవుతుంది.

(4) నాగపూర్ శిలాశాసనంలోను, భాయ్‌కురుసుపాలో (నెం. 14) శాసనంలోను సోమేశ్వర దేవుని భార్యలుగా జగదేకమాతలు సోమలదేవి, ధారణిదేవి, గంగమదేవి చెప్పబడ్డారు. ఈ సోమేశ్వర దేవుని, బైరాంఘర్ రెండవ తామ్రశాసనంలోగల రెండవ సోమేశ్వరునిగా గుర్తింపవచ్చు.

(5) శకవర్షము 1147లో నిచ్చిన దంతేశ్వర శాసనంలోను, జతన్‌పాల్, సుర్నపాన్, ఇత్‌పాల్ తామ్రశాసనం (శకవర్షము 1168)లోను, మనకు శ్రీ నరసింహదేవ మహారాజు, శ్రీ జయసింహ దేవుడు, హరిశ్చంద్రదేవుడు పేర్లు కనిపిస్తూ ఉంటాయి. వీరందరూ కూడ నాగవంశి చిందకుల వంశవర్ణనను వారి వారి శాసనములలో ఉపయోగించారు. అందువల్ల, వీరినిగూడ చిందవంశీకులగానే గుర్తింపవచ్చును. ఇటీవల కాలంలో బయటపడ్డ బాపట్ల శిలాశాసనం[23]లో గూడ మణనాగపుర పరేశ్వరుడయిన మహామండలేశ్వర తొండయ చోడ మహారాజు పేరు తెలియవస్తుంది. ఇతనికి, చిందకుల వంశస్థులకి గల సంబంధము తెలియటంలేదు.

పైన చెప్పినట్లుగా ఇంతవరకు దొరికిన శాసన సామగ్రినిబట్టి, నాగవంశి చిందకులస్థుల వంశక్రమము ఈ క్రిందివిధముగా నిర్ణయించటానికి వీలవుతుంది.




మొదటి శాసనం చెప్పిన దత్తవాడను ప్రస్తుతము బస్తర్ జిల్లాలోనున్న దంతేశ్వర్‌గా గుర్తింపబడవచ్చును. దానగ్రామమని బోడకచెరును, గుమ్మలునాండును గుర్తించటానికి వీలపటంలేదు.

## మొదటి తామ్రశాసనము

## శాసన పాఠము[24]

### మొదటిరేకు, రెండవవైపు

1. స్వస్తి [11*] సహస్ర ఫణి మణి [కిరణ*] నికరావభాసుర నాగ- 2. వంశోద్భవ భోగావతీ పురవరేశ్వర నికర జయపటు పటాహ గాం- 3. భీర్య వ్యా (ద్వా) నాలంకృత దశదిశాంత రాళ ధేను వ్యాఘ్ర లాంచ (ఛ) న చిందకుల కమ- 4. లభాసుర మహామహేశ్వర చరణ కమలసేవిత కి[ం*]జల్క- పుంజ పి[ం*]జరిత 5. భ్రమరాయమానం సమస్త జగదాశ్రయం పార్థివ ధనంజయం బాలనా- 6. రాయణ సౌ (శౌ) ర్య నారాయణి (ణ) పరచంద్రదం (ప్రచండం) విభవ మహేంద్రం కొండండ [స]- 7. [హో]దర విక్రయ గథా(దా)ధరం బిరుదంక మల్లం అభిమా- 8. నధరం లోకైక సుందర[ం] సత్య విఖ్యాంతం భూప యదాంతం క్షత్రియ పవిత్ర 9. సమర త్రినేతం శ్రీమజ్జగదేక బూ(భూ)షణ మహార(రా)జులు రా, ద్ధి-

రెండవరేకు, మొదటివైపు

10. ప్రవర్ధమానా(న) మా చంద్రాక్కాము ప్రవిత్తి (ప్రవృద్ధి)ల్లింగా ద త్తవాడ నెల- 11. వీట సుఖసంకథా వినోద[ం*]బుల రాజ్యా(జ్య)ంబున్సేయ్యుంచు [ండ]శక- 12. కాలాతీత సంవత్సరంబులు 985 నేంటి శుభకృత్ శరంబు (సంవత్సరంబు) 13. మాఘ శుద్ధ పంచమి బృహస్పతి వారము నాండు దమకు 14. శ్రీ మద్గుండ మహాదేవులుకు ఖిం(చిం)ద కులాస్నరద (కులాన్న్ర ప్రహూన్న (పూన్న్ర) చంద్రు- 15. శ్రీమత్సోమేశ్వర దేవో దయంబ(బు)నం బుత్రోత్సాహ నిమిత్త[ం*]బున 16. న మాన భట్టుకు బోడకచెరు ధారా పు(పూ)ర్వ్వకంబగ్రహారం-

రెండవరేకు, రెండవవైపు

17. యిచ్చిన తాంబ్ర సా(శా)సన[ం*]బు[11*] దీనికిం బిండదాన మర్యాడ(ద) ద(ధ)మ్మన్ శా- 18. సనము [11*] వషర్ ప్రత నల్పది గుడులు వ(ప)హింది యార్చి యాచంద్రాక్కా- 19. ము సుఖముండడం గలవారుం బదుక మాదిగా దాంకిన బట్ట- 20. ఆయ[ం*]బు లాల్ప సవ్వ్ర కా(క)ర పరిహారము[11*] దీని కం(కిం) బ్రథానినా- 21. గతిరాజును రాజగురులు రుద్రపండితులు గుమ్మలనాలు 22. ట్టి పెద్దె (ద)నాయకులు శ్రీ కిరణము దారెనాయ కుండు రేకన పెగ్గడ 23. యు దండ నాయక గుండన నాయకుడు కరణ[ం*] రేవమా[మ] నా[యకు]డు

మూడవరేకు, మొదటివైపు

24. రాజాన మతంబున బాలనారాయణ గొండాచారి కండిసిన [11*] 25. స్వదత్తమ్(ం) పరదత్త(త్తం) వ (వా) మీహా(హ)రేతి వసుంధరాం(1*) షష్ఠింవ్వషా సహా(హ)స్రా[ణి*] 26. విష్టాయాం జాయతే క్రిమి[ః*] [11*] బహుభిర్వ్విన్ వ్వసుధాదత్తా రాజనుస్సా- 27. గరాధిభిః యస్య యస్య యధా భూవిం స్తస్యతస్య తధా ఫలమ్ [11*]

## రెండవ తామ్రశాసనం[25]

మొదటిరేకు, రెండవవైపు

1. స్వస్తి[11*] సహస్ర ఫణా [కిరణ నికరావ] భాసుర నాగవంశోద్భవ భో- 2. గావతీ పురవరేశ్వర [శ్రీ]వత్స వ్యాఘ్ర [లాంఛన] కాస్యప గోత్ర ప్ర- 3. క టికృత విజయఘోషణ [విశ్వ విశ్వంభర పరమే]శ్వర పరమ 4. భట్టారక మహేశ్వర [చరణ సరోరుహ] కింజల్క- పింజరితభ్ర- 5. మరాయ మానసు లైన [శ్రీమజ్జగదేక] భూషణ మహారాజుల... 6. ............ అభిమానవ సోమే- 7. శ్వరదేవ మహారాజుల పుత్రులు రాజ (భూషణ) 8. మహారాజు............ 9. ............ 10.

రెండవరేకు, మొదటివైపు

11. ........ఆక్కాము........సకలాతీత సంవత్స 12. రంబులు 1057 నేంటి మాఘమాసమున శుక్లపక్షము- 13. న భ్యస వారముంబుం నాండు ఇ(ఈ)శ్వర నాయకునికి గుమ్మల 14. నాండు సన(సర్వ్వ)బాధా పరిహారముగా నిల్పితిమి[11*]శాస- 15. నాలు[11*] దీనికి సాక్షి ప్రధాని సోమరాజు పురుషోత్త— 16. మ నాయకుండు మోగు లతండు గుండమ నాయకుండు సుండి- 17. పెగ్గడ చామనాయకుండు సాహిణిం అప్పన నాయకుండు సోమన- 18. దండనాయకుండు కక్కరాతి మండలీకుండు బీరి(భౌరి) సటొ (సెట్టి)కొ- 19. డుకు సోమ(నా)థ నాయకుండు యెటిదిలి సోమ రాజు మండ[లీ]- 20. కుండు లోయజ పోతమేలు దామము కొఅమ నాయకుండు

రెండవరేకు, రెండవవైపు

21. లెంక ల లూరంపు గోమ్మినాయకుండు మాటువెలి రేచ- 22. మ నాయకుండు బ్రాహ్మణ నాయకులు కరంజి గాన వె- 23. న్న మ దండనాయకులు అయితన పెగ్గడలు గుల్మతమనాయ- 24. కులు మయిలమ నాయకుండు కన్నమ నాయకుంతు పాచుర 25. నాయకుండు అగ్రహారపు నాయకులు నానుంగూరు పోతమ నా. 26. యకులు జమ్మవాడ అప్పన నాయకులు పరకోటి- 27. ఓః నాయకులు ధరాముఠమున ప్రోలమ నాయకులు అడ- 28. వోలి కుందమనాయకులు ద(ధ)మ్మ (మ్మా) సనమువాని కారంజి- 29. మ అప్పనభట్టు ఈశ్వరభట్టు నకరము...... 30. పెద్దిసెటి గిదల పోత......

మూడవరేకు, మొదటివైపు

31. .........సొమరడి నాయకులతో గుండ మండలీకుండు సచ్చిమండ- 32. నాయక కత్తిరడి గంగ్గవోలి బ్రమ్మిరండి[కొ]లేటి కుప్పిరడి పిన్నమఋగులూరి 33. మున్నవ్వరడియ బందేఋవుల [ము] యుఱవప్రోలిపట్టియ లోకమానిక 34. సెట్టియ మాంకోట మయిలింసెట్టియు కావలి గొబ్బిసెట్టియు ఆమకి కోమిసెట్టియు(11*) 35. మద్వంశజా పరమహీపతి వంశజావా పాపపేత మనసా(సో)భూ- 36. వి భావి భూపాః [ః*]యే పాలయంతి మ మద (ధమ్మ)ము మిదం సమస్తమే- 37. షా[ం*] మయా విరిచితోంజలి రేషమూర్ధ్ని [11*] స్వదత్తం పరదత్తం వా యోహ- 38. రేతి(త) వసుంధరాం। షష్టిం వష సహ్రాణ విష్టాయాం జాయతె క్రిమిః॥ [11*] 39. ......ముదిసో(స)లి సూరపరాజులు 40. శ్రీకరణము పోతమ ప్రాలు. 41. కండకించిన వాండు మ్మ......

## అథోజ్ఞాపికలు

* జబల్‌పూర్‌లో జరిగిన 'ఎపిగ్రాఫికల్ సొసైటి ఆఫ్ ఇండియా'వారి 13వ వార్షిక సమావేశమునకు, రచయిత పంపిన ఆంగ్లవ్యాసమునకు తెనుగుసేత. (1) ద॥భా॥శా॥ నెం. 10; శాసనం నెం. 643; హీరాలాల్, నెం. 214 (2) ద॥భా॥శా॥ నెం. 10, శాసనం నెం. 644; ఎమ్. ఆర్. ఇ. 1908-09. 111 పేజీలు. (3) ద॥భా॥శా॥ నెం. 10, శాసనం నెం. 645 (4) హీరాలాల్ డిస్క్రిప్టివ్‌లిస్ట్ ఆఫ్ ఇన్‌స్క్రిప్షన్స్ ఆఫ్ సెంట్రల్ ప్రొవిన్సెస్ అండ్ బిరార్ నెం. 199, (5) డిటో నెం. 212 ద॥భా॥శా॥ డిటో. నెం. 646 (6) ప్రస్తుత సమీక్షలో నున్నది. (7) ఎ.ఇం. వాల్యూం నెం. 9, పే. 174. (8) డిటో వాల్యుం. పే. 31, పే. 162. (9) డిటో వాల్యుం పే. 36 (10) ద॥భా॥శా॥ డిటో, నెం. 647; హీరాలాల్-డిటో-నెం. 206, పే. 150 (11) ఎ.ఇం. వాల్యూం, నెం. 10, పే. 37 (12) ఎ.ఇం. వాల్యూం. పే 164; వాల్యుం 9, పే. 162. (13, డిటో వాల్యుం. నెం. 9, పేజి 311 (14) డిటో, పే. 160 (15) సమీక్షలోనున్న రెండవ తామ్రశాసనం (16)ఎ.ఇం. వాల్యూం నెం. 10, పే. 40 (17) డిటో వాల్యుం, హీరాలాల్ పే. 208. (18) కె. ఎ. ఎస్. శాస్త్రి, స్టడీస్ ఇన్ సౌత్ ఏసియా, పే. 711 (19) డిటో (20) హీరాలాల్ పే. 157 (21) డిటో. నెం. 211 (22) ఎ. ఇం. వాల్యూం 10, పే. 40 (23) ఈ శాసనం లోని సారాంశాన్ని ఉపయోగించుకునేందుకు అనుమతించిన మా డైరక్టరుగారికిని, ఛీఫ్ ఎపిగ్రఫిస్ట్‌గారికిని కృతజ్ఞతలు. ఈ శాసనం నాచే కాపీ చేయబడింది. (24) మా కార్యాలయములోగల శాసన ప్రతిబింబముల ద్వారా తయారు చేయబడిన పాఠము. ప్రతిబింబాలు 1971-72 శాసన నివేదికలో ప్రచురితమయినవి. 25. డిటో

# అడవి

## రఫి

పర్వత శిఖరంలో దాక్కున్నాడు సూర్యుడు
పచ్చని అడవి అప్పుడే నిద్రలేచింది
ఉత్తుంగ శిఖరగర్భంలోంచి - ఉవ్వెత్తున
ఎగసిపడుతోంది నీటిధార
అంచెలంచెలుగా నేలను తాకుతోందది
అది పాములా కీకారణ్యాల్లోకి అదృశ్యమవుతోంది
స్వేచ్ఛాగాలి కొమ్మల్లో కదలాడుతోంది
జ్ఞాన చక్రంలా అగుపించే పర్వతశిఖరాన్ని
వదిలేసి వచ్చాడు సూర్యుడు
రాత్రి కురిసిన మంచు - కొమ్మల ఆకుల్ని
పూ మొగ్గల్ని - పచ్చగడ్డిపోచలను స్పృశిస్తోంటే
ఆ హిమబిందువుల్లో వజ్రమై వెలుగుతున్నాడు సూర్యుడు
స్వేచ్ఛాగానానికి సాకార రూపం కల్పిస్తోంది అడవి
అడవి ఎంతటి అద్భుత భావం
స్పందనాభరిత చైతన్యరాగం
కళాత్మక చిత్రకారుడి కుంచెలోనుండి జారిన
కమనీయ చిత్రంలా ఉంది అడవి!
ఊహాకందనంత ఎత్తుకు ఎదిగిపోయింది అడవి
అడవి ఎంత గొప్పది!
అవును. మనుషులకు దూరంగా వుంటోందది!!

శ్రీగూడ శ్రీరాములు

# అచ్చమైన అధివాస్తవిక నేత్ర కవి శ్రీరంగం నారాయణబాబు

తెలుగు కవిత్వంలో అధివాస్తవికతని ప్రవేశపెట్టిన వారు శ్రీశ్రీ, నారాయణ బాబులు. ఆదిలో పెట్టబడిన 'అతివాస్తవికత' పేరుకి 'అధివాస్తవికత'గా సవరణ ప్రతిపాదించినవాడు నారాయణ బాబుగా చెప్పబడుతున్నాడు.

"వ్యక్తావ్యక్తంలో వెలుగునీడలమధ్య ఊతకొట్టే కవి"గా నా. బా. తనను సంభావించుకున్నాడు "వ్యక్తావ్యక్తంలో నా గీతం" అంటూ తన కవిత్వాన్ని నిర్వచించుకున్నాడు. "వ్యక్తావ్యక్తంలోంచి వెలుగుబాటలు చూపించే నీవెవరే" అంటూ తన కవితా చోదకశక్తిని సంబోధించుకున్నాడు.

మొదటి ప్రపంచయుద్ధ కాలంనాటికి కలకత్తా దాకా వెళ్ళి ప్రదర్శన లిచ్చే తెలుగు నాటక కంపెనీల్లో నా. బా. స్త్రీ పాత్రలు ధరించే అంతంత కుర్రాడు. సుదూర పాశ్చాత్యదేశాల్లో పేలిన మర ఫిరంగుల పేలుళ్ళు నా.బాకి వినపడ్డవీ, బోధపడ్డవీ కాకపోయినా ఆ తరవాత విశాఖ కవితా సమితి సభ్యుడయి, ఆ తరవాత కొన్నాళ్ళకి భావకవితారంగు "గాగుల్సు" విసిరికొట్టాక అప్పటికి రాబోతున్న రెండవప్రపంచయుద్ధానికి రాజుకుంటున్న ప్రపంచ మొక "గ్రీష్మం"లో ఉడుకు దేరుతున్న సహారా ఎడారి అనిపించసాగింది. హృదయంలో సెగలు, పొగలు, సంచలనం, ఉద్వేగం చెలరేగసాగాయి. "రాక్షస సంఘం"లోని జీవిత వేసంగుల కాగుళ్ళు "మసకమసక"గానే కావొచ్చు కనిపించసాగాయి. ఇంకా ఇంకా తను చూడదలచినవాటిని చూడదలిచిన రీతిలో చూట్టానికి నా.బాకి మరోకన్ను అవసరమొచ్చింది అది విప్పారింది. ముష్టివాళ్ళు, కుష్టురోగులు, పడిపోతున్న కొంపల్లోని పాతివ్రత్యాల కంపు బట్టలు, రంకు సెంటు వాసనలు, ముసలి మొగుళ్ల - పడుచు పెళ్లాలు, మొగ్గతొడగని మొలక వయస్సులో పాలులేని చూలాళ్ళు కాబడ్డ పున్నె మెరగని కన్నెపిల్లలు, పసితనమున పెండ్లి - భర్త పరమ పదాలు, గుల్లగాళ్ళు, విధవకానుపు తల్లి చంపిన పురిటి పిల్లలు, కడుపు చెరువై భిక్షాపాత్రికతో నేలకొరిగిన మానం కప్పుకోలేని నెలత - ఇలా ఎటుచూసినా "దేవుడి వితంతువులు" నా.బాకి కనిపించ సాగినాయి. ఆ విప్పారిన నా.బా మూడవ కన్ను - ఆ మనోనేత్రం, ఆ అంతఃచక్షువు అచ్చమైన అధివాస్తవిక త్రినేత్రం కాగలిగింది. ఆ నేత్రంతో నా.బా మాలిన్యాన్ని గాలించ దలిచాడు. దానికి బీభత్సత, అరాచకత, అసంబద్ధతలనించి ప్రేరణ ఎంచుకున్నాడు. ఒక పునఃసృష్టికి సంసిద్ధుడయినాడు. ఒక కొత్త పద్ధతిలో ఒకకొత్త తాజమహలు నిర్మాణానికి ఉద్యుక్తుడయినాడు.

అయితే ఆ పునఃసృష్టి, ఆ నవ్యసృష్టి ఈ వాస్తవిక ప్రపంచం బలవంతపెట్టిన, అప్పగించిన బరువు బాధ్యతలవల్ల నా.బా చేపట్టింది కాదనబడింది. "ఒక కొత్తరకపు మంత్రశక్తి, భూతాలను పారద్రోలి పంచభూతాల్ని ప్రజ్వలింప జేయగల మంత్రయుత బీజాక్షర పటిమ చూపించేశక్తి, అర్థంకాని అవ్యవస్థలో మంత్రించిన అక్షతల మాదిరి ఏదో శక్తివచ్చి తాకగా, పూనగా, అదేదో రాయించగా" ఆ పర్డ్సు వర్తీయ "స్వార్గిక ప్రేరణ"లో, ఆ రిల్కేయ "అనిర్వచనీయ తుఫాను"లో కవిత్వాన్ని "సెల్ఫ్ - ఈస్ట్ ఆఫ్ స్పిరిట్" చేసుకుని ఆంద్రే బ్రెతాఁ ఆదేశించిన "అంబుక్ రికార్డింగ్ ఇన్స్ట్రుమెంట్" కాదలచాడు నా.బా. ఎంచుకున్న ప్రేరణలు, చెలరేగిన అంతర్గత తాడనల ప్రతిఫలనగా ఒక వింత విభ్రాంత సృష్టి, ఒక సృష్టి విధ్వంసన విలక్షణ సృష్టికి పూనుకున్నాడు. సఫలుడయినాడు.

"సాహిత్య జగత్తుని గంగవెర్రులెత్తించు రోజులివి. స్వర్ణయుగం అన్నారు వాళ్ళు. యథార్థయుగం అంటున్నాము మేము" అనిన నా.బా అంతలోనే మళ్ళీ "యథార్థాన్ని గుర్తించం" అంటాడు. "ఈ జగత్తుతో మాకు పనిలేదంటాడు. ఈ పరస్పర విరుద్ధ ప్రకటనలవల్ల నా.బా నిలకడలేనివాడు, ద్విధామనస్కుడు కానక్కర లేదు. అది నా.బా ఎదుగుదల, పరిణామం అవుతుంది.

పాశ్చాత్య సాహిత్యలోకంలో కాల్పనిక, వాస్తవికతా వాదాల మధ్య చెలరేగుతూ వచ్చిన ప్రతిస్పర్థలో ఒకదాన్ని ఇంకోటి తాత్కాలికంగా నిర్వీర్యపరుస్తూవచ్చిన క్రమంలో చివరికి కాల్పనిక వాదం ఎప్పటికోసం తొలిపట్టు తప్పి ప్రతీకవాదం, అటుపిమ్మట అధివాస్తవికవాదం మొదలయిన రూపాంతరాలలోకి మారిన చరిత్ర వుంది.

కాల్పనికవాదం ఓడిపోయిన ఇంచుమించు ఒకశతాబ్ది తరవాత తెలుగు కవిత్వంలో తలెత్తిన భావకవిత్వాన్ని ఎదుర్కుంటూ వచ్చిన నవ్యధోరణులు యథార్థవాద కవిత్వంగా భావించబడటంలో అప్పటి కది తప్పుడు సమీకరణకాదు. (పాశ్చాత్య కాల్పనికవాదాన్ని ఓడించ టంలో అక్కడి ఆధునికతావాదానికీ కొంత పాత్రవుంది). నా.బా అలాంటి భావకవితా వ్యతిరేక కవిత్వాన్ని యథార్థయుగ కవిత అను కోటం తప్పుకాదు. అయితే భావకవితా వ్యతిరేకతలో తప్ప మరెందు లోనూ పోలికలు లేకపోవటంవల్ల ఆ నవ్యధోరణికి సామాన్య స్వభావ నిర్ణయం సాధ్యపడలేక పోయింది. పఠాభిది "అహంభావ కవిత్వం", శిష్ట్లాది "ప్రాహ్లాదకవిత్వం", నా.బాది "వ్యక్తంలోని అనుభూతులు వ్యక్తావ్యక్తంగా మారే" అధివాస్తవికత, శ్రీశ్రీది 'మహాప్రస్థాన' మిశ్రకవిత్వం అయినాయి.

అధివాస్తవికుల్ని ఈ యథార్థ వాస్తవిక ప్రపంచం ఆపలేక పోయింది. నా.బా యథార్థాన్ని గుర్తించనన్నాడు. ఈ జగత్తుతోనే పనిలేదన్నాడు. గతం ఒకర్నొకరు కాల్చుకుతిన్న ఆటవిక విన్యాసం. ప్రస్తుతమొక భయంకర బాధల భీతుల పాటల పల్లవి. అధివాస్త వికులు ఆనాటి, నేటినించి దాటిపోటానికి ఈ వాస్తవ ప్రపంచంకంటె తప్పివుంటున్న అతివాస్తవిక ప్రపంచమొకటి ఉందని దానికోసం అన్వేషించబూనారు. ఆ అన్వేషణలో తెలిసిన, కళ్ళెదుట కనిపిస్తున్న యథార్థ జగత్తుని పోల్చుకోలేనంత వింత, విరూప జగత్తులోకి మార్చుకోగలిగారు. ఆ అధివాస్తవిక స్వప్న (దుస్స్వప్న) జగత్తులో ఒక "ఘోస్ట్లీ యాస్పెక్ట్ ఆఫ్ రియాలిటీ"ని పట్టుకోదలిచారు. అధి వాస్తవిక అతఃచక్షువుతో వ్యక్తావ్యక్తం అనే గవాక్షంలోంచి వీక్షించగా ..బాకి యథార్థ జగతుకి బదులు మనోజగత్తులోని అధివాస్తవిక "పచ్చిక బయళ్లూ, వృక్షచ్ఛాయలూ, సెలయేళ్ళ గానమూ, ఇంకా మీదికి సముద్రపు కెరటాల హోరు – అంటే అవ్యక్తం" – ఇలా ఒక సుందర సుస్వప్న అధివాస్తవికలోకం వినిపించి కనిపించసాగింది.

వ్యక్తావ్యక్తాన్ని అవగతం చేసుకోవాలంటే సంప్రదాయం, నీతి, తర్కం, హేతువు మొదలయిన పాతకట్టుబాట్లు విసర్జించబడా లన్నారు అధివాస్తవికులు. కార్యకారణ సంబంధ శృంఖలాలు తెంపేయాలన్నారు. ఆ కట్టుబాట్లని తెంచేయగలిగినప్పుడే వస్తు స్వరూపాలు ఆశించిన వింత సౌందర్యమయాలయ్యే వీలుంటుంది. సృష్టి ఒక అపసృష్టి కాగలుగుతుంది. "మోడర్న్ రియాలిటీ ఈజ్ ఎ రియాలిటీ ఆఫ్ డిక్రియేషన్" అనగలుగుతుంది. కావ్యతత్వం అనిర్వచనీయతకి సమీపించగలుగుతుంది. కవిత్వంలో అకథ్యత, ఒక నిశ్శబ్దత ఆవహించగలుగుతుంది. ఆ నిశ్శబ్దతలో చీకటి కోణాలు ఏర్పడగలుగుతాయి. నా.బా కవిత్వంలో అలాంటి చీకటి పట్టులు బాగానే చోటు చేసుకోగలిగాయి.

యథార్థాన్ని గుర్తించనని నా.బా అన్నప్పటికీ ఫ్రెంచి సర్రియలిస్టులు దాన్ని గుర్తించనివారు కారు. అయితే కలకూడా వాస్తవికతలోని విడదీయరాని అంశంగా భావించారు. కల ఉపేక్షింప బడేది, తిరస్కరించబడేది కాదన్నారు. యథార్థానికి కలకీ మధ్య వైరుధ్యాన్ని సహించలేకపోయారు. ఆ రెండూ ఒకానొకచోట కలిసి పోయి వాస్తవికతకంటె మరీ ఉత్కృష్టమయిన అతివాస్తవికత స్థితిని ఏర్పరచగలుగుతాయన్నారు. ఆహేతువుని, అతి స్వచ్ఛందతని అనుసరించినప్పటికీ వాస్తవిక ప్రపంచానికీ ఆత్మాశ్రయకల్పనల అతీంద్రియప్రపంచానికీ మధ్య వైరుధ్యాన్ని చెరిపేసే తమ అకుంఠిత సంకల్పాన్ని చాటుకున్నారు సర్రియలిస్టులు. కలని వాస్తవంతో కలప ప్రయత్నించారు. అలా చేసినపుడు వాస్తవం ఒక మంత్ర యుత స్వప్న సదృశ స్వభావం వ్యక్తంచేయ గలుగుతుందన్నారు. అపుడది సాల్వెడార్ డాలీ ఆశించిన బుద్ధ్యున్మాద జనితక్రియ (పెరనొయిక్ క్రిటికల్ యాక్టివిటి) అనబడే సుగుణంగా పరిగణించ బడుతుందన్నారు

యథార్థం. కలల మధ్య సఖ్యతా (రికాన్సిలేషన్) ప్రయత్నం వల్ల సర్రియలిస్ట్ లకి కల్పనలకి విస్తృతావకాశం లభించింది. అయితే కళలో వాస్తవికత కుంటుపడి కల ప్రాధాన్యత వహించింది. అహేతు, అతి స్వచ్ఛంద సృజన విధానానికి చేరువకాగలిగింది. యథార్థ వాస్తవికతనించి దూరంగా జరిగిపోయిన పలాయనత్వాన్ని మాత్రమే చివరికి చాటగలిగిందనే విమర్శలకి గురికావలసి వచ్చింది.

యథార్థం, కలల మధ్య సర్రియలిస్టుల సఖ్యతా ప్రయత్నా నికి గల చారిత్రక నేపథ్యం ఈ సందర్భంలో గమనించతగ్గ దవు తుంది. మార్క్సిజంలోని సైద్ధాంతిక సగభాగానికి సోవియట్ రష్యాలో ఆచరణ అర్ధభాగం జోడపటంతో మార్క్సిస్టు తత్వశాస్త్రానికి పరి పూర్ణత సిద్ధించినదయింది. ప్రపంచ శ్రామిక, మేధావి వర్గాల్లో ఒక నూత్న సంచలనం రేగగలిగింది. అదే కాలంలో (1916-17) ఫ్రాయిడ్ రచనలు ప్రపంచం మీద ప్రసరించి మంచీ చెడుల మాన సికతలమధ్య ఊగులాడే మధ్యతరగతి మర్మాలపై ఆమోదముద్రవేసి మరో విపరీత సంచలనాన్ని సృష్టించ గలిగింది. ఈ రెండు పరస్పర విరుద్ధ దిశా సశక్త సంచలనాల తుఫానుల్లో ఏ ఒక్కదాన్లోనో కాక

ఆ రెండూ కలిసిన సుడిగాలిలో ఆనాటి ఫ్రెంచి మధ్యతరగతి అశాంత ఆధునిక యువకులు చుట్టబడి ఇష్టపడ్డారు.

వైరుధ్యాలమధ్య తప్పనిసరి వైరుధ్యం సంశ్లేషణలో పరిష్కరించ బడుతుందని మార్క్సు మరీ నిర్దిష్టంగా పునరుద్ఘాటించాడు. (పునః అనుకునేమో స్యురియలిస్ట్‌లు హెగెల్‌ని వాళ్ళ పూర్వీకుల్లో జోడించారు) పరస్పర విరుద్ధాలనిపించే వ్యక్తం (సచేతన), అవ్యక్తం (అవచేతన) మనిషి మానసిక మహాసముద్రంలో పొత్తుగా కలిసి వుంటాయని ఫ్రాయిడ్ ప్రతిపాదించాడు. మార్క్సు వైరుధ్యాలు, ఫ్రాయిడ్ పొత్తులు అనే ప్రతిపాదనలు ఫ్రెంచి స్యురియాలిజం ఆవిర్భావానికి తాత్విక ప్రోద్బలాలయినాయి (1924). అయితే స్యురియలిస్టులు ఈ పట్టున ఫ్రాయిడ్ "యూజ్ ఆఫ్ అపోజిట్స్"కే మొగ్గిన వారయ్యారు. స్యురియలిస్ట్‌ల ధ్యేయానికి మార్క్సుకంటె ఫ్రాయిడ్ ఎక్కువగా ఉపకరించే వాడయ్యాడు.

ఆ విధంగా సాహిత్య కళారంగాల్లో పరస్పరం పొసగని అపరిష్కృత శిరోభారాలై మిగుల్తున్న యథార్థం - కల, భౌతికం - ఆత్మికం, ఆత్మాశ్రయం - వస్త్వాశ్రయం, కమ్యూనిజం - ఫ్రాయిడిజం మొ॥ వాటిమధ్య వైరుధ్యాలు తమ మధ్యవర్తిత్వం ద్వారా శాశ్వతంగా పరిష్కృతాలు కాగలవని ఆశించారు స్యురియలిస్టులు.

"వైరుధ్యాలమధ్య ఏ వైరుధ్యమూలేదు. భిన్నాలమధ్య అభిన్నత అంతర్వాహిని. అన్నిటిమధ్య సమన్వయం వుంటుంది" మొ॥ భావాలు స్యురియలిస్టుల్ని ఆకర్షించాయి. 1 + 1 = 1 (ఇది బూలెన్ ఆల్జీబ్రా సూత్రం) అన్నారు (శ్రీశ్రీ). "ఆలోచిస్తే దుఃఖానికీ సౌఖ్యానికి మధ్యవున్న సన్ననిసరళరేఖ కరిగిపోయి కరిగిపోయి అంతా అనంత వైశాల్యంగా కనిపిస్తుంద"న్నారు. స్వర్గం నరకం అన్నది ఒకే స్థితికి రెండు పేర్లన్నారు. "స్వర్గం/నరకం/చావు/బ్రతుకు / గొప్ప / బీద/ వ్యత్యాసం /తెలివితక్కువ/చదువెక్కువ / తారతమ్యం" అంటాడు నా.బా. "గగనమ్మును భూమి భూమిని గగనమ్ము/ఒకటేగాఢ పరిరంభమున/ కలుసుకోకపోవు" అంటాడు.

ఈ 'వైరుధ్యాలమధ్య సఖ్యత'(రికొన్సిలేషన్ ఆఫ్ అపోజిట్స్) సూత్రాన్ని స్యురియలిస్టులు ఒక శిల్పంగా చేపట్టారు కొన్నిపదాలు, వస్తువులు వాటికి భిన్నమనిపించే ఇతర పదాలు, వస్తువుల్తో చేర్చినప్పుడు ఆ కలయికలో ఒకవింత సామ్యం, సౌందర్యం సాక్షాత్కరిస్తుందన్నారు. శస్త్రచికిత్సకుడి చికిత్స బల్లమీద ఆ శస్త్రచికిత్సా పరికరాల్తోపాటు ఒక కుట్టు మెషీను, గొడుగూ అమర్చివుంచినపుడు ఆ అసంబంధ వస్తు సముదాయంలోంచి ఓ వింత సాంగత్య శోభ పుడుతుందంటాడు కాంత్ ద లోత్రేమోం (ఈయన్ని తమ పూర్వీకుడుగా చెప్పుకున్నారు స్యురియలిస్టులు). ఇదే అభిప్రాయాన్ని ఫ్రెడ్రిక్ నొవాలిస్ వ్యక్తం చేసివున్నాడు. రాంబో "సరస్సు నడుమ వసతిగతి" గమనించతగ్గదవుతుంది. వీటికి అనుసరణగా ఆంద్రే బ్రెతాం తోడేళ్ళకి మంచుటద్దాలు తొడిగించగలిగాడు. శ్రీశ్రీ జీబ్రాకి ఆల్జీబ్రా చిహ్నాల లాంకోట్ పాంకోట్ తొడిగించాడు. (ఆల్జీబ్రాకి జీబ్రా చిహ్నాల అనివుంటే మరీ స్యురియలిస్ట్‌గా వుండేది). తురాయి - అకురాయి-హిమాంశురాయి పక్కపక్కన అమర్చబడగలిగాయి. "మా కవిత్వంలో ఉండకూడని వస్తువంటూలేదు" అంటాడు నా. బా. ఈ మాటలో విశేషతేమీ లేదు. ఆధునిక సాహిత్యంలో దేనికి వెలిలేనిదశ అంతకు మునుపే మొదలయివుంది. ఎటొచ్చీ ఆ వస్తువుల కూడికలో అధివాస్తవికులకొక ప్రత్యేకతవుంది. పిల్లి - పుల్లి - బిళ్ళ ఆధునిక కవిత్వంలో నిషేధాలుకావు. వాట్ని ఒకచోట నిలబెట్టటంలో అపురూపతుంది. నా.బా కవిత్వంలో ఈ అపురూప వింత సాంగత్యాలు బాగా కనిపిస్తాయి. అరటిపండు-అరిసె, టమాటాపండు-మాంసంముక్క, సిరాబుడ్డీలో సాలెపట్టు- ఆ పట్టులో గెండు మక్షికాలు, కాకాతువ్వా-కోయిల, వైతరణిలో ఫినైలు వర్షం, గోవుల తోకలు తెగకోసి పాలు పితికి కాఫీ మొ॥ చేరికలు, అమరికలు అగుపడతాయి. మృత్యు వాసంగే మాతృకరమ్ముల విధవ కానుపు పెదిమల నలుపుతో సంధ్య ఉపమించబడుతుంది. తారలు నల్లని త్రాచుకోరలకీ, తెల్లని మహూచి కుండలకీ పోలికలవుతాయి. కాశ్మీర సుందర సరస్సులో ఉబ్బిన కలరా శవాలు, మరఫిరంగి పక్కన మహతి, జలదాంతర శశి చేరువలో సమాధిలోని మృత శిశువు, శరన్మేఘములతోపాటు శ్యామల శ్మశానవాటుల వ్రాలిన రాబందులు, రుధిరంతో జ్యోతి, వెన్నెలతో కత్తి అమర్చి ఆ అమరికలో "అధివాస్తవిక అనుభూతి"అనుభవించ గలిగాడు. ఒక అపూర్వత, ఆశ్చర్యజనకత సాధించగలిగాడు. "ఈ ప్రపంచంలో సౌందర్యమంటూ ఏదీలేదు. ఒకవేళవుంటే అది సంక్షుబ్ధ రూపంలో మాత్రమే వుంటుంది" అంటాడు బ్రెతాం. నా.బా కవిత్వంలో ఈ సంక్షుబ్ధ సౌందర్యం కనిపిస్తుంది. బోద్లేర్ విద్యుదాఘాత స్పర్శ కనిపిస్తుంది. భయోత్పాదం, బీభత్సం, జుగుప్స కలిగించే భావనాసామర్థ్యం కవికి అత్యవసరాలనే భావాన్ని నా.బా ఆదరించినవాడయ్యాడు. ఉగ్రప్రచండ విషయవస్తువుని చేపట్టాడు.

'వైరుధ్యాలమధ్య సఖ్యత' అనుసరించిన స్యురియలిస్టులు తమధ్యేయానికి అనుకూలించిన ప్రతీకవాదుల (బోద్లేర్, రాంబో) 'జ్ఞానేంద్రియ ఐక్యత' (సినెస్థీసియా*-శ్రీశ్రీ:'రసన', ఇస్మాయిల్: 'జ్ఞానలక్షణం ప్రత్యక్షం')ని సాహిత్యంలో ఒక విధానంగా పెంపొందించారు. "ఏక కాలంలో నవ్వు, ఏడుపు, భయం, కోపం, అసహ్యం,

---

* "ది మిక్సింగ్ అప్ ఆఫ్ సెన్సేషన్స్, ది కన్‌కరంట్ అప్పీల్ టు మోర్ దేన్ వన్ సెన్స్ - హియరింగ్, కలర్, సీయింగ్ అండ్ స్మెల్"

ఆవేశం - ఇంకా ఎన్నివుంటే అన్నీ కలిగించేదైన" (శ్రీశ్రీ) ఈ రసైక్యత/జ్ఞానేంద్రియ ఐక్యత (విపర్యత అనికూడా అనవచ్చేమో!) అధివాస్తవిక కవిత్వంలో బాగా కపిస్తుంది. "పదాలు పలకలుతీర్చిన స్ఫటికపురాళ్ళలా ఎన్నెన్నో ముఖాలతో ఎన్నెన్నో జీవితానుభవాలు సాక్షాత్కరింపజేసే గతిభేదపు గర్భగుళ్ళు" అంటాడు నా.బా.

నా.బా 'రుధిరజ్యోతి'లో ఈ రసైక్యతా పదచిత్రాలు మనం చూడవచ్చు.

1. విశ్వరూపమే వినిపిస్తుంది (దృశ్యం శ్రవణేంద్రియం ద్వారా అనుభవం
2. కంచు గంట/ఒంటి గంట / వాసన రేగింది (శ్రవణం ఘ్రాణంగా)
3. తెల్లని రుచి (దృశ్య - జిహ్వగా)
4. మసాలా వేసిన కూర వాసన ఘాటుగ గాలిరేగితే నా శ్రవణ శంఖద్వయంలో ఆకలి 'ఓం కారం'
5. రజత రావం
6. అగ్నికిరీటం / అగ్నివీణ
7. వెన్నెల పడగ / వెన్నెల కత్తి
8. చర్మం గోడ
9. దరిద్ర సంగీతం
10. నీలి తావులు (తావులు=వాసనలు అర్థంలో)
11. ఓంకారం హుంకరించింది
12. మధుర గీతికాల్లహరి [శ్రవ్య→గతిబోధక (కినెస్థెటిక్)]

ఈ రసైక్యతా విధానంతోనే కాక ఆక్సీమొరాన్, పారడాక్స్, గ్రోటెస్క్ పదచిత్రాలద్వారాకూడా వైరుధ్యాలమధ్య రాజీప్రయత్నం చేశారు నా. బా.

1. కమ్మని మృత్యుపరీమళం
2. బ్రతుకంటే / చీకటిలో! దీర్ఘమైన చావు/ చచ్చిబ్రతుకు/ మృత్యువులో వెలుగున్నది.
3. నీలితావుల చావు పూవులే మొలిపిస్తాను
4. స్వర్గం నరకం సురభిళించి కంపు కొడతాయి
5. చావుబ్రతుకు అత్తాకోడళ్ళలా అభిమానించుకుంటూ కాట్లాడు కుంటారు.
6. నోరులేని తారలచే కీలాలం కక్కిస్తాను
7. నిత్య పునిస్త్రీ శూన్యం పాదాలు చూపుడువేలు

స్త్రియాలిజంకి మునుపటిదైన భవిష్యవాదం (ఫ్యూచరిజం-1919) 'మానసిక స్థితిగతుల యౌగపద్యత' (సైమల్టేనియస్‌స్టేట్ ఆఫ్ మైండ్) అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించగా, దాదాయిస్టులు యౌగపద్య కవితని (సైమల్టేనియస్ పొయిట్రీ - అనేకులు ఒకేసారి వాళ్ళ వాళ్ళ కవితలు చదవటం) వ్యాప్తిలోకి తెచ్చారు. ఆధునిక మానవుడి జీవిత తర్కసంగతం, క్రమిక సంఘటనమయం కాక వైకల్యం, అవ్యవస్థితాల యౌగపద్యమనీ, ఒకేకాలంలో మనిషి మస్తిష్కంమీద అనేక సంఘటనలు, అనుభవాలు ఆరోపితాలనీ, ఆ సమస్తమూ ఉన్నదున్నట్టుగా వ్యక్తం కాబడాలన్నారు. అలానే "విభిన్న సమయాల దృశ్యభాగాలు ఒకేసారి చిత్రించబడాలి. కిటికీ తెరిచీ తెర వటంతోనే బండి, రోడ్డు, అన్ని రకాల శబ్దాలు, గతి విధులు, వస్తు సమూహం, మొత్తం అంతా గదిలోకి ఒకేసారి చొచ్చుకురావాలి. ఇది రచన కెక్కాలి" (శ్రీశ్రీ) అపుడా రచన బహుపరిమాణం (మల్టీడైమెన్షనల్) అవుతుంది. ఆధునిక కళ సాంప్రదాయిక రేఖీయ స్థితిదాటి యౌగపద్య, బహుపరిమాణ స్థితి చేరగలుగుతుందని భావించటం జరిగింది.

పైన పేర్కొనబడ్డ వైరుధ్యాలమధ్య సఖ్యత, జ్ఞానేంద్రియాల మధ్య ఐక్యత, యౌగపద్యత, బహుపరిమాణత సిద్ధాంతాలకి తెలుగులో ప్రయోగశాలగా 'రుధిరజ్యోతి' ఒక ఉత్తమ ఉదాహరణ కాగలుగుతుందనటంలో అతిశయోక్తి వుండదు. అలాంటి కావ్యతత్వ పరిపుష్టికి వీలున్నచోట్ల నా. బా అధివాస్తవికుల అప్రయత్నకృత రచన (ఆటోమాటిక్ రైటింగ్) ని అనుసరించాడు.

"ప్రకృతి పెట్టిన/ వేసవి గాన పాఠశాల
తుమ్మెదల తంబుర శ్రుతి/కోయిల ఒజ్జ
శాపంలో కుశలవులు/ వాల్మీకం/ శంకరాభరణం" లాంటివి

కొన్ని ఉదాహరణలవుతాయి.

* * *

నారాయణబాబు కవిత్వంలోని పదచిత్ర విశిష్టత విమర్శకులు, అభిమానులచేత కొనియాడబడింది. నా. బా వాడిన పదచిత్ర పరిశీలనకి ముందు అధివాస్తవికతని అనుసరించిన నా. బా పదచిత్రవాదం (ఇమేజిజం) పట్ల మొగ్గుచూపటానికిగల కారణాల్ని మనం చూడ వచ్చు.

ఫ్రెంచి ప్రతీకవాదానికి లండన్ కేంద్ర కళారూపంగా భావించ బడుతున్న పదచిత్రవాద ఉద్యమం పాశ్చాత్య కవిత్వాన్ని చుట్టేయ గలిగిన కాలంలో అధివాస్తవికులు దానిపై దృష్టి మళ్ళించిన వారయ్యారు. నవ్యరీతులను అంత తేలిగ్గా చలించనీ నైష్ఠిక లండన్ సాహిత్య వర్గాలపై కోపపడి 1921లో ఎజ్రాపౌండ్ లండన్ విడిచి పారిస్ చేరుకున్నాడు. కళ-లైంగికాలమధ్య సంయోజనని బాహాటంగా, ఉద్రేకంగా సమర్థించాడు. పౌండ్ ఈ సంయోజన సమర్థన అధివాస్త వికులకి నచ్చిన అంశమయింది. అంతేకాక ఫ్రెంచి కవిత్వంలో

బోద్లేర్, మలార్మేలు ప్రవేశపెట్టిన 'శుద్ధకవిత' (ప్యూర్ పొయిట్రీ) సంప్రదాయాన్ని కొనసాగించటానికి కొత్త సృజన పద్ధతుల్ని వెతుకుతున్న అప్పటి సర్రియలిస్టులకి పౌండ్ ఒక ఆశాజ్యోతిగా కనిపించాడు. అయితే అక్కడికి కొన్నాళ్ళలోనే జా( కాక్టో కారణంగా పౌండ్‌ని చంపేదాకా సర్రియలిస్టులు పోయినా పౌండ్ పదచిత్రవాద దోరణుల్నీ, పదచిత్రవాదులు మరీ ప్రాచుర్యానికి తెచ్చిన ఫ్రీవెర్స్‌నీ వీడలేకపోయారు. సరిగ్గా తెలుగుదేశంలోని నా. బా లోకూడా అదే జరిగింది. అధివాస్తవికతని అనుసరించిన నా.బా పదచిత్రాల్నీ, వచన కవితని అనుసరించాడు.

కవిత్వానికి సంగీతత ఎంత ముఖ్యమో దృశ్యమానతకూడా అంతేగా భావించారు పదచిత్రవాదులు. సమస్త భావాలు చిత్రాకృతుల్లో ప్రదర్శితాలవాలన్నారు. అపుడవి సంకేతాలుగా భాసించగలుగుతాయన్నాడు పౌండ్.

ప్రతి పదం దాని తొలినాళ్ళలో ఒక దీప్తిమంతమయిన చిత్రఫలకానికి సంకేతంగా ఆవర్భవించింది. "చెట్టు" అనే పదం ఒక సజీవ వాస్తవ రూపంలోని చెట్టుకి వ్యక్తీకరణ ప్రతిరూపంగా, ఆబ్జెక్టివ్ ఈక్వివలెంట్‌గా వాడబడింది. కాలాంతరంలో పదాలు తొలినాటి సత్తువని పోగొట్టుకొని సాధారణాలవుతాయి. చిన్నప్పుడు మొదటసారిగా మనం విన్న పదాలకి ప్రతిరూపాలు హత్తుకునేలా ఆ తరవాత హత్తుకోవు. "శైశవావస్థలో మనకందరికీ పదాలు వింత రంగులతోనే కనిపిస్తాయి" అంటాడు నా. బా. పదాలు పేగొట్టుకున్న ఆ తొలినాటి అర్థవివరణ, పటుత్వం కవి తిరిగి కల్పించాలి. అదెలా వీలవుతుందో పదచిత్రవాదులు చెప్ప ప్రయత్నించారు. పదాలు వేటికి సంకేతాలవుతున్నాయో వాటిని బొమ్మకట్టించాలి. కవిత్వంలో పదాల్తో పదచిత్రాలు గీయాలి. గ్రాఫిక్ క్వాలిటీ తీసుకరావాలి.

పదచిత్రవాదానికిముందు కవిత్వంలో ఈ గ్రాఫిక్ గుణం లేకుండా వుండిందా అంటే ఉండేదని చెప్పాల్సివుంటుంది. ఉపమ, రూపక, సాదృశాలతో అది సాధించబడుతూవచ్చింది. కాని పదచిత్రవాదం రాకతో అది కవిత్వానికి ప్రధాన గుణం కాబడింది. ఒక కవితా సిద్ధాంతమయింది.

'చంద్రముఖి' అనే సమాసంలో చంద్రుడు, ముఖం రెండు సమర్థవంతమయిన పదాలే అయినా పరస్పర ఆధారితాలు. ముఖానికి చంద్రకాంతితో సాదృశత్వం కల్పించబడింది. చంద్రుని ప్రకాశ గుణం ఆరోపించబడింది. అయితే పదచిత్రవాదులు చంద్రుడు, ముఖం అనే పదాల (లేక పదచిత్రాల) మధ్య సాదృశత్వస్థాపన అనరు. ఆ పదచిత్రాల్ని ఒకదానిమీద ఇంకోదాన్ని ఆశ్రితపరచరు. వాటిని స్వతంత్రంగా నిలబెడతారు. సాంప్రదాయిక ఉపమానాలస్థానే కొత్తవాటిని ఎంచుకుంటారు. దేన్ని దేంతో పోలుస్తున్నారు చెప్పరు. సాదృశత్వం అనక ఒకదాని వెలుగులో రెండోదాన్ని ఫోకస్ చేయటం అంటారు. ఎట్టి పొంతనలేని రెండు వాస్తవికతలమధ్య తులనకంటె వాటిని చేరువపరచటం అంటారు. (ద ఇమేజ్ ఈజ్ ఎ ప్యూర్ క్రియేషన్ ఆఫ్ స్పిరిట్. ఇట్ కెనాట్ బి బోర్న్ ఆఫ్ ఎ కంపేరిజన్ బట్ ఆఫ్ ధ బ్రింగింగ్ టు గెదర్ టూ రియాలిటీజ్ విచ్ ఆర్ మోర్ ఆర్ లెస్ రిమోట్).

"ఐరావతపు పంది అర్ధచంద్రుడు" పదచిత్రంలో ఐరావతం, పంది, చంద్రుడు అనేవి మళ్ళీ మూడు పదచిత్రాలు (ఆబ్జెక్టివ్ ఈక్వివలెంట్స్). "ఐరావతపు పంది" (బాగా బలిసి గుండ్రందేరిన తెల్లపంది!) అనే సంయుక్త పదచిత్రంలో సాంప్రదాయక కర్మధారయ, ఉపమేయోపమాన ఆరోపిత సాదృశగుణానికి బదులు విస్మయకరం, ఆలోచింపజేసే గుణాన్ని తెచ్చిపెట్టాడు కవి. ఐరావతం వెలుగులో పందిని, పంది దరిలో ఐరావతాన్ని పెట్టి ఆ రెండు పదాల్ని (పదచిత్రాల్ని) సరికొత్త రీతిలో మనచేత గుర్తింపజేయటం కవి లక్ష్యం. అలా పొసగని ఆ రెండు పదాల్ని సామీప్యంలో పెట్టటంవల్ల కొత్తదనంతోపాటు ఆరెండు పదాలకి వాటి తొలి సత్తువ తేబడుతుందని భావించబడింది. అలానే " ఐరావతపు పంది అర్ధచంద్రుడు" సంయుక్త పదచిత్రంలో "ఐరావతపు పంది" పదచిత్రాన్నీ, "అర్ధ చంద్రుడు" పదచిత్రాన్నీ ఒకదానిపై ఇంకోటి ఆశ్రితాలు కానట్టుగా వాటిని స్వతంత్రాలుగా నిలిపి (పదచిత్రాలు స్వతంత్రాలు అనే గుణాన్ని స్థాపింపజేసి) ఒకదాని వెలుగులో రెండోదాన్ని గుర్తింపజేయటం లక్ష్యం. పదచిత్రాలు స్వతంత్రాలు కనుక వాటిమధ్య సముచ్చయ సంబంధకారకాలు, విభక్తిప్రత్యయాలు, సామాన్యవాచకాలు ఉండనవసరం లేకపోవడంతో నామవాచక పదాల్ని యథాతథంగా వాడుకునే వీలుంటుంది. ఉదాహరణలుగా:.... పంది అర్ధచంద్రుడు, పాము కాటు ఎండ, చీకటి లాఠీదెబ్బ, కాలం, నాగు మొ॥ వాటిని చూపవచ్చు. పదచిత్రవాదులు ఇక్కడ చూపింది ఉపమ, రూపకాల వల్ల సాదృశగుణం కాదు.

"రక్తపతాకం/ శక్తినాలుక/ అగ్నికిరీటం/ఆకాశమ్మున/ ముని మాపు/ కేకలువేస్తూ/ పిలిచింది."

"పై అతులనాత్మక విశుద్ధ పదచిత్ర పద్ధతిలో "రక్తపతాకం, శక్తినాలుక, అగ్నికిరీటం" అనే మూడు తులనాత్మక పదచిత్రాలు పొదగబడ్డాయి. "పిలిచింది" అనే ఏకవచన సమాపక క్రియకి ఈ మూడింటిలో ఏదో ఒకటి (ఒకసారి ఒకటి మాత్రమే) కర్తృవాచకం అవాలి. రక్తపతాకం పిలిచింది, శక్తినాలుక పిలిచింది, అగ్నికిరీ పిలిచింది" అనే మూడు వాక్యాల్ని పదచిత్రవాద క్లుప్తతకోసం నా. బా కుదించాడనలేం. ఈ మూడు పదచిత్రాలు ఒకచోట వాడినప్పుడు వాటిలో రెంటిని ఉపమానాలుగా వాడవలసివసుంది. అయితే శక్తి

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన ఆముదము




శుద్ధి చేసినది, వాసన లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited**



నాలుకలా రక్తపతాకంలా అగ్నికిరీటం వుందని చెప్పటం నమంజన మనిపించదు. అలానే రక్తపతాకంలా అగ్నికిరీటంలా శక్తినాలుక వుందని చెప్పటం పొసగదు. శక్తి నాలుకల [తో], అగ్నికిరీటంలా [తో] రక్తపతాకం అనిచెప్పడం కవి భావన అయివుండాలి. పదచిత్ర స్వతంత్రతవల్ల, సంబంధ సూచకాల లుప్తాలవల్ల కవి దేన్ని దేంతో పోలుస్తున్నాడు గుర్తించటం కొంత కష్టమే అవుతుంది. ఇలాంటి పద చిత్రాల్ని అనుసరించటం అధివాస్తవికులకి ఉపకరించింది. దీనిద్వారా అసంబంధాల్ని సంబంధించవచ్చు. వైరుధ్యాలమధ్య రాజీ సాధించవచ్చు.

పై రకమయిన అసంబంధాత్మక పదచిత్రాలు నా.బా. కవిత్వంలో తక్కువే అయినా విశుద్ధ పదచిత్రాలు ["శిరసున రతనము, కాగితం కంపించింది మొ॥], ఉపమాశ్రిత పదచిత్రాలు ["చచ్చిన తల్లి శవం మెళ్ళో గజ్జెల పట్టెడతో ఉల్లాసంగా ఆడుకునే పిల్లాడులా గాలి, సమాధిలో మృతశిశువట్టుల జలదాంతర శశి" మొ॥] బాగా కనిపిస్తాయి.

పదచిత్ర స్వభావాన్ని పౌండ్ "...దట్ విచ్ ప్రెజెంట్స్ ఎన్ ఇంటెలెక్చువల్ అండ్ ఇమోషనల్ కంప్లెక్స్ ఇన్ ఎన్ ఇన్‌స్టంట్ ఆఫ్ టైం"గా నిర్వచించాడు. బౌద్ధిక, భావోద్వేగ గ్రంథులు తృటికాలంలో పదచిత్రాలద్వారా ఉద్భాసితాలవాలి. దానికి కవి"ఇట్ ఈజ్ నెయిదర్ స్టార్‌నార్ పెర్ల్ బట్ ఇన్‌స్టంటేని అస్ లైక్ ఫ్లాష్" అయిన వెర్-లిబ్ర్ [ముక్త ఛందం]ని చేపట్టవలసివచ్చింది. పై గ్రంథుల్ని తత్‌క్షణంలో తాత్క్షణిక జీవపదార్థం వంటి ముక్త ఛందంలోకి అనువదించవలసి రావటంవల్ల కవి అప్పటి కప్పుడు కవితా రూపాన్ని నిర్మించుకుంటూ పోవలసి రావటంవల్ల కవిత్వంలో పదాలకి బదులుగా ఒక నిస్తబ్దతకి చోటిచ్చి తననిస్సహాయతని చాటుకుంటాడు. కవి చెప్పదలచిన భావసమగ్రం భాషలో ఇమడలేదనీ, అది భాషా సీమిత హద్దులు దాటిపోతుందని భావించడం కూడావుంది. ఆ భాషా ప్రాకారాన్ని బద్దలుకొట్టినప్పుడే దివ్యానుభూతి లభిస్తుందనబడింది. "ప్రాకారాలు బద్దలుకొడితే భిత్తిక కవతలనున్న పచ్చికబయళ్ళ రమణీయ శ్యామల ప్రదేశాలు కనబడతాయి" [నా.బా].

ఒక సత్యాన్ని, అనుభవాన్ని, భావాన్ని పూర్తిగా చెప్పగలిగే సామర్థ్యం భాషకు లేదని కవి భావిస్తాడు. కవితలో మధ్య మధ్య అవాచ్యత, అనిర్వచనీయత, శూన్యత స్థాపించుకుంటూ పోతాడు. [...]న్ని పదహీనతకి పర్యాయపదం చేసుకుంటాడు. సంక్షిప్తత, క్లుప్త[...]ల సాధనాలుగా భావించుకుంటాడు. ఆ క్లుప్తతా సాధనకి అదనపు సాధనాలుగా కవి సముచ్చయ, సంబంధ, ప్రత్యయ, విభక్తి, క్రియా [...]దాల్ని కూడా విడిచిపెట్టాడు. "ఎన్ ఎక్స్‌ప్లిసిట్ గ్రామర్ ఈజ్ [...]న్ యాక్సెప్టెన్స్ ఆఫ్ ఆర్డర్"గా భావిస్తాడు. అసంబంధాత్మక శైలి [...ఎ]సిండెటిక్ స్టయిల్] అనుసరిస్తాడు.

నా.బా కవిత్వంలో ఈ అసంబంధాత్మక శైలికి ఉదాహరణలు కొన్ని చూడవచ్చు.

1. సకల రోగ నివారిణి/సాని/దొరసాని/నరసమ్మ
2. రజకునిచే రట్టు/పురమంతా/రాతిరంత/తిరగడం/కాగితాల శిజనం.
3. మృతశరీర/ఆక్రమణ/ఘటాకాశ/అరుణారుణ / రక్తసిక్త మోము.
4. నా చేతిని గడియారం/కనిపించని/కాలం గుర్రం/డెక్కల చప్పుడు / టిక్కు ! టిక్కు !
5. అనర్థం/స్వార్థం/నాకం!/పదార్థం/యథార్థం/నరకం!

ఇమేజిస్టు క్లుప్తతలో కవి మధ్యమధ్య ఏర్పరచుకుంటూ పోయిన నిశ్శబ్దాన్ని పాఠకుడు తన ఊహా సామర్థ్యంతో పూరించు కోవాలని కవి పాఠకుడికి విడిచిపెట్టాడు. అలాంటి "సందేహాలను పెంపొందించే మూగకేకలు" నా.బా కవిత్వంలో మనకి బాగా ఎదురౌ తాయి. ప్రశ్నార్థక ఆశ్చర్యార్థకాలు, రిక్తస్థానాలు, రెండు కవితా భాగాలమధ్య విడిచిపెట్టిన చుక్కలద్వారా నా.బా ఆ నిశ్శబ్దాన్ని స్వయంగా మనకి సూచిస్తాడు. ఉదాహరణకి :

"అనుభవమే నగ్నంగా / ఆలాపన చేస్తానంటే / మూగవాని నాల్కంటాం/ఏం/ఏమంటావు?/గాలికి గలగల మోగే పండుటాక!.... ............తెగిపోయిన/వీరుని తలకాయ/ఖండించిన కోడిబుర్ర..."

-పై రిక్తస్థాన శూన్యంలో మరిన్ని పరుష, నిందావాచకాలు పలకకుండా పోయాయి.

ఇలాంటి నిశ్శబ్ద కథనాన్నే 'వేశ్య!' కవిత మధ్యలో నా.బా ఏర్పరచాడు.

'మౌనశంఖం' కవితలో :

"ఆకాశం పలకమీద/ప్రకృతి వేస్తుంది/బ్రహ్మాండమైన/రెండు ప్రశ్నార్థక గుర్తులు/నీవెవరూ? నీవెవరని/??" పాదం చివర ప్రశ్నార్థ కాల్లో మరిన్ని "నీ వెవరూ? నీ వెవరని" ప్రతిధ్వని పరంపరలు శూన్యంలో లీనమై ప్రకంపిస్తాయి.

సంక్షిప్తతని సాధించిపెట్టిన నా.బా అకథ్య కథనానికి ఈ క్రిందివి ఉదాహరణలవుతాయి.

1. నను ముట్టకు నా చక్కని స్వామి !!!
2. పాటే / గ్రహపాటా ?
3. మోడు చెట్ల జంటపొత్తు
4. రజకునిచే రట్టు
5. సకల రోగ నివారిణి సాని దొరసాని నరసమ్మ

6. మార్కులొస్తే మహామహోపాధ్యాయ
7. ఒకటే చీకటి? జీవరహస్యం !!!
8. లెండోయి ఋషులు / లెండి! లెండి!
9. వాత్తేరు వక్షోజం ధనవంతుల ధనుష్కోటి

ఈ నిశ్శబ్దపు మసకల్లో "వ్యోమమార్గముల ఊహాతీతంబగు శక్తినీ దృగంచలములకు దొరకని ఉక్తిని సంచరింపజేశాడు" సంచలింపజేశాడు. నా.బా. "నిశ్శబ్దం నీలినీలి అంచులని మోగించాడు" ఆ నిశ్శబ్దతలోని "జటిల సుబోధకాన్ని" ధ్వనిగా, ఉక్తి వైభవంగా సంభావించుకునే వీలు మనకి కలగజేశాడు. సంక్షిప్త సాధనలో అవశిష్ట అస్పష్టతనించి బయట పడలేకపోయాడు.

*

వాస్తవికతకీ పౌరాణికాలకీ మధ్య సంబంధాన్ని జోడించే ప్రయత్నం చేశారు సర్రియలిస్టులు. మిత్‌లతో వాస్తవికతా వివరణ చేయబూనారు. దీనివల్ల కవిత్వంలో వాస్తవికత కొన్నిచోట్ల అడుగునపడి పురాణ సంకేత ప్రాబల్యం కవిత్వం ఉపరితలాన తేల సాగింది. వాస్తవికతని పురాణ ఐతిహ్యాలు మింగేయగలిగాయి. నా.బా కవిత్వమంతా చోటుచేసుకున్న పురాణ, ఇతిహాస, ప్రాగ్రూప సంకేతాల వ్యాప్తత నా.బా కవితలోని వాస్తవికతని పూర్తిగ మింగేసింది కాకపోయినా దానిమీద స్వారిచేసి అధివాస్తవిక వికృతీకరణ చేయగలిగింది.

ఆధునిక కవిత్వంలో దేశవిదేశ పురాణ సంకేతాలు బాగానే కనిపిస్తాయి. పౌండ్, ఎలియట్‌ల్లో ఇవి మరీ పెరిగాయి.

ఒకజాతి సంస్కృతి, సభ్యతల పురాతన స్మృతులు నేటికాల బోధల్లో ఒకక్షణం వెలిగించి ఆ పాతకాలాన్ని ప్రస్తుతంతో జోడించటం మిత్ వాడకాల ఒకధ్యేయం. "జీవితకాలమంతా జగత్తులో సమస్త విషయాలనూ వ్యక్తంగానూ (కాన్షస్), వ్యక్తావ్యక్తంగానూ (సబ్-కాన్షస్) సేకరించుకున్న అనుభూతి శకలాలు మెట్లుపేర్చి మేడకట్టుకున్నట్టుగా ఉంటాయి. ఆ అనుభూతులన్నిటిని కిన్నెర మీటినట్టుగా ఒకేమారు కదల్చాలి" అంటాడు నా.బా.

మిత్‌లు సాహిత్య వ్యాపక నిర్మాణానికి ఆగారాలు అన్నాడు మార్క్స్. జాతి జీవితంతో ముడిపడివున్న పురాణ ఐతిహ్యాలు ఆధునిక వాస్తవికతల శక్తిమంతమయిన మూల్యాంకనలకి వాడుకున్న ఉదాహరణలున్నాయి. ('శ్రీశ్రీ : పురాణప్రతీకలు' అనే ఈ రచయిత ముద్రిత వ్యాసంలో చర్చితాలు).

మిత్‌ల వాడకానికి మరో కారణం క్లుప్తత సాధించటం. అయితే మిత్‌లవల్ల కవిత్వంలో కొంత క్లిష్టత ఏర్పడుతుంది. ఈ క్లిష్టగుణం నా.బాకి తెలియకుండా చోటు చేసుకుందనుకున్నా చకిత పరచటం, సంక్షిప్తత సాధించటం నా.బా మిత్‌వాడకానికి కారణాలుగా చెప్పొచ్చు.

మిత్ సంకేతల్తో నా.బా సాధించిన కవితా సంక్షిప్తత మనం గుర్తించవచ్చు.

> "మిన్ను విప్పిన/రక్తపతాకం/మన్ను సత్తువె తెలిసింది!
> ప్రాభాత పశ్చిమానిలము/పాడిన పాట/కాకాసురుని కథ/
> జ్ఞాపకం తెచ్చింది/నన్నునే తెలుసుకున్నాను" (గడ్డిపరక).

ఎర్రజెండా ఆకాశంలో రెపరెపలాడింది. అది నేల సత్తువని చాటింది. కోడికూత వేళ ఒక పడమటి గాలి పాటపాడింది. కాకాసురుడి కథ గుర్తుచేసింది.

కాలం మారింది. గాలి మళ్ళింది. గడ్డిపరగ్గా భావించబడుతూ వచ్చి సామాన్యుడు సామాన్యుడు కాడు. అసామాన్యుడు. సాధించలేనిదంటూ ఏదీలేదు. కాకాసురుడు అరిభయంకర వీరుడిగా ప్రతీతుడు. శ్రీరాముడే ఓటమి చవిచూశాడు. చివరికి గడ్డిపరక సాయంతో గెలుపొందాడు. ఇంతటి వివరణ "కాకాసురుడి కథ" అనే మాటలో ఇమిడ్చాడు. సంక్షిప్తత సాధించగలిగాడు.

నా.బా కవిత్వంలోని మిత్ సంకేతాల బాహుళ్యాన్ని చూసి "సంప్రదాయం నా.బా కవిత్వంలో చక్కగా జాలువారుతూ వుంటుంద"నీ, భారతీయ పౌరాణిక దృష్టి నా.బాకి బలమిచ్చింద"ని, పౌరాణిక ఇతివృత్తాల్తో సంప్రదాయపు మెలకువలను ఆకళించుకుని పఠితకు ఆస్వాదయోగ్యం కావిస్తాడ"ని నా.బాని కొనియాడటం జరిగింది.

నా.బాకి గరుడపురాణం ఎప్పుడు చదువుతారో తెలుసు. ఉపనయవేళ చెవిలో చదపబడ్డ మంత్రం గురించి తెలుసు. నాగుమయ్యా-చవితి చిమ్మిలి గురించి తెలుసు. పితృకార్యం నాడు పారణమీద చేతి మరకత అంగుళీకం గురించి తెలుసు. పిల్లలు రోదిస్తే మరిపించటానికి అత్తయ్యలు చెప్పే కాశీమజిలీ కథలు ఎరుగును. నా.బాకి సంప్రదాయం తెలుసు. సంప్రదాయ కట్టుబాట్లూ తెలుసు. నా.బా కవిత్వానికి ఇవి ఉపకరించాయి. అంతమాత్రాన నా.బాది "పౌరాణిక దృష్టి" అనటం నా.బాని కవిగా నిలపటానికి దీనికి మించి మరేదీ లేదనుకునే శంకవల్ల కలిగిన అభిమానుల ఆత్మీయపాట్లు అనిపిస్తుంది.

నా.బా అక్షరాలా రూఢిభంజకుడు (ఐకొనోక్లాస్ట్), విధ్వంసకుడు [నైహిలిస్ట్] కాదనుకున్నా అధివాస్తవిక అరాచకుడు. అధివాస్తవిక ప్రవృత్తికి సంప్రదాయం, పారంపర్యతలపట్ల నిరసన వుంది. నా.బాది సంప్రదాయ దృష్టి, పౌరాణిక స్పృహగా భావించటం సరళీకృత నిష్కర్ష అవుతుంది. నా.బాది పౌరాణిక స్పృహ అనటం కంటె పౌరాణికాలపట్ల ఒక అపభ్రంశ స్పృహ అనటానికి ఈ కింది ఉదాహరణలు సాక్ష్యాలవుతాయి.

1. పార్వతి నగ్నంగా నిలబడి పూలుకోస్తున్నది....పార్వతి దర్శనమయ్యే సరికి నా బట్ట అంటుకున్నది.
2. మాసిన బట్టల మాటల మూటలు రేవులో తగులబెట్టుకొని ఏడుస్తూ ఎదురుగుండా తోచిన చాకలి సరస్వతిని చూసి కోపంతో శ్రీశ్రీ తన్నేందుకు కాలు ఎత్తి మూగయై నిల్చున్నాడు.
3. కుష్టురోగంతో కాళ్ళూ చేతులు పడిపోతే కిందపడి దొర్లుతూ ఏడుస్తున్న దేవేంద్రుడు
4. నా పౌత్రికడుపు హిమాచల తనయ తన చల్లని మంచు హస్తాలతో నిమిరింది
5. మృతించిన శేషుడు
6. గోవుల తోకలు తెగకోసి పాలు పితికి కాఫీ కలిపిస్తా
7. పాపాత్ములు పయనించేందుకు పడవలు
8. స్వాహా వల్లభు పూజించే సోమయాజుల మాటలు విని మోసపోయిన వనిత

పై ఉదాహృతాల్లో నా.బా పౌరాణిక దృష్టికంటె ఒకలక్ష్యం కోసం ఆ పౌరాణికాల వికృతీకరణ ప్రస్ఫుటమవుతుంది. దీనికి అనుగుణంగా నా.బా పూర్వ కవివాక్యాల్నీ, సామెతల్నీ, జనక శ్రుతుల్నీ వికృతపరచటం కూడా గమనించవచ్చు.

1. తెనుగు రాత్రి (ధాత్రికి బదులుగా)
2. గుండెలో పాలపాట (పోటుకి బదులుగా)
3. పుండుమీద చేయిలా (కారంకి బదులుగా)
4. శ్రమనివారణ పాట (దాన)
5. కళ్ళకు ముళ్ళబాధ (కాళ్ళకు)
6. మసక మసక మాలిన్యం (చీకటి)
7. శ్వనాథుడు (విశ్వనాథుడిలోని 'వి' లోపం)
8. కిటికీలో దీపం (గూటిలో)
9. రవిగాంచని కోడిపిల్ల (రవిగాంచనిది కవిగాంచును)
10. మృత్యు పరిమళము ("శ్రీలలిత వైజయంతీ పరిమళమ్ము")
11. మొండి రాత్రి ("శరద్రాత్రి")
12. కనురెప్పల సెజ్జ (కనురెప్ప రేకులు)
13. కాటకంపు తాటకి("క్షామదేవతా నిశ్వాస ధూమపటలి")

• • • •

నిరాశని "అమూల్యంగా"గా ఎంచుకున్నప్పుడు ("అమూల్య నిరాశ"-శ్రీశ్రీ), శాంతిలో అశాంతినీ, అశాంతిలోనే శాంతిని అనుభవించగలడు ఆధునిక కవి. "అశాంతిని ఆరాధిస్తాడు. కాంతిని వధిస్తాడు" (అజంతా). ఆ నిరాశలోంచి క్రమంగా విధ్వంసన, అరాచకత, స్వచ్ఛందత, విదూషకత్వాలకి చేరి అపస్మారక అలజడులకీ, పాశవిక కాంక్షలకీ, లైంగిక వైపరీత్యాలకి లోనయి శాడిజం, మాడిజంలోకి చివరికి చేరుతాడు. మాదక పదార్థాల శరణు ఆశ్రయిస్తాడు. అదీ చాలకపోతే తనను తాను అంతం చేసుకుంటాడు. సాహిత్య కళారంగాల్లో ఇలాంటి ఉదాహరణలు చాలానే వున్నాయి.

మైథున అసంతృప్తులవల్ల కలగగల మానసిక అసంతులనాల ప్రమాదకర ఫలితాల గురించి స్ట్రిండ్‌బెర్గ్, ఫ్రాయిడ్ మొ॥ వారు ఆవేదన వ్యక్తం చేసివున్నారు. మనిషిలోని దమన వాంఛల్ని ఉన్న దున్నట్టు బహిరంగపరచి ఈ ప్రపంచంలోకి వాటిని విముక్త పరచాలని భావించారు అధివా స్తవికులు.

నా.బా 'రుధిరజ్యోతి' కావ్యమంతటా లైంగిక ప్రతీకలు విరివిగా కనిపిస్తాయి. దీనివల్ల 'రుధిరజ్యోతి' లైంగిక ప్రాధాన్య కావ్యమనిపించే అవకాశం కలగవచ్చు. 'వేశ్య, జ్వలనా!, కిటికీలో దీపం, వీధి పాటకులు, లెండోయి బుషులు' లైంగికప్రతీక బాహుళ్య కవితలు. "స్త్రీపురుష కామహోమంలో పాణింధమం ప్రేమ" అంటాడు నా.బా.

ఫ్రాయిడ్ స్వప్నప్రతీకల వ్యాఖ్య (ఇంటర్ ప్రిటేషన్ ఆఫ్ డ్రీం సింబల్స్) ప్రకారం నా.బా కవితల్ని పరిశీలించినపుడు నా.బా ప్రతీకలు స్పష్టాలవుతాయి.

గడ్డిపోచ (ఉద్ధరిణి), దీపం (వత్తి), పొగగొట్టం, శవం, విమానం, దండం, స్తంభం, సర్పం (శేషుడు), చెయ్యి, పాదం, కలం, మూడు సంఖ్య మొ॥ పురుషాయన సంకేతాలంటాడు ఫ్రాయిడ్.

అలానే ప్రమిద, భాండం, చెంబు, కిటికీ, స్టీమరు, కాయగూరలు (టొమాటోపండు), డొప్ప, పూలు, సరస్సు, కాగితం, శంఖం (నత్త), ఆకాశం మొ॥ స్త్రీ జననాంగ సంకేతాలనబడ్డాయి.

నా.బా కవితల్లో ఈ ప్రతీకలు మనకి చాలాచోట్ల ఎదురవుతాయి.

1. ఆముదపు ప్రమిదలో/వెలిగే దీపాలు / హృదయంలో భావాలు/పండగట! పండగ !
2. ప్రజల పాపం హార్బరు చేసేందుకే / హార్బరు/థర్మామీటర్ల లాంటి కొయ్యలతో ఎనిమా డొక్కులలాంటి స్టీమర్లు/నగ్నంగా స్నానం చేసేటప్పుడు ఎదురుగుండా పరాయి మొగాడు ఏరాదకొండ
3. కంచెంబులో ఉద్ధరిణి/కమ్మవిల్లుని కేళిదేర!
4. అంతరోదిస్తే ఆవలిస్తూ ముగ్గురు ఆడపిల్లలు పుట్టారు తుమ్మితే మూడు ఎలక్ట్రిక్ దీపాలు వెలిగాయి
5. నట్టింట్లో చిల్లులుపడిన మజ్జిగ కుండ కవ్వం చీకటి తప్పే చేశాయి
6. కిటికీలో దీపం
7. కొండ లోయలో పూలతోట/చెట్లు లేవు! / అన్నీ పూలే

8. అరటిపండు – అరిసె
9. సిరాబుడ్డి – కలం
10. ఆకాశం చిరిగిపోయిన అరటి దొప్ప

ద్రవం, నీరు, సముద్రం, నురగలు ప్రసూతిద్రవానికి, వీర్యానికి, శుక్రానికి సంకేతాలు.

1. ఇంకిపోయిన అమృత భాండంలో/తడైనా తగులుందేమో నని వేళ్ళతో స్పృశిస్తున్న శచీదేవి

2. కాశ్మీర సరస్సులో పడవల్లాగు/కాలప్రవాహంలో కలరా శవాలు కొన్ని

3. రజకునిచే రట్టు/పురమంతా/రాతిరంతా/తిరగడం/కాగితాల భోజనం....పుక్కిట నెమరేసుకుంటూ గార్దభస్వామి(భర్త)

పెనుగాలి(వైల్డ్ విండ్) మనిషిలోని భావోద్వేగానికి, వాంఛకి సం . . . . . ది.

1. గాలివీస్తే గర్భవతులగు అనాథలు
2. గాలిలో విమానాల్లా

పైకెక్కటం, గాలిలో ఎగరటం, కిందపడి దొర్లటం మొ॥ (అపరితృప్త) కామవాంఛకి సంకేతమంటాడు ఫ్రాయిడ్. పక్షిని (మోకింగ్ బర్డ్) ప్రేమకి చిహ్నంగా వాడాడు విట్‌మన్.

1. ఇంతలో ఒక ఆడ గండభేరండ పక్షి వచ్చి శ్రీశ్రీని ముక్కుతో అంకించుకుని విమానంలా ఎగిరిపోయింది గరుడలోకానికి

2. రజతాచలం ఎక్కా! కొండలోయలో పూలతోట....

3. క్రిందపడి దొర్లుతూ ఏడుస్తున్న దేవేంద్రుడు

పళ్ళూడటం, కోరలు పెరకటం మొ॥ అపూర్ణ మైథునానికీ, హస్తప్రయోగానికీ, స్వవ్యభిచారానికీ, పుంస్త్వనాశనానికీ, వీర్యస్ఖలనానికి ప్రతీకలుగా చెప్పబడినాయి.

శేషుని కోరలు పెరికి

వాద్య విశేషాలు స్వావయవజనిత పరితృప్తికీ, వయసు మళ్ళాక గతయౌవన స్మృతుల నెమరులవల్ల తృప్తికి, అలానే బయలు ప్రదేశాలు (లాండ్ స్కేప్) స్త్రీ మర్మాంగానికి సంకేతాలవుతున్నాయి.

వీథులు ప్రమాదం, పరిగెడదాం పద/ఆ బయలులోకి అన్నాడు (శ్రీశ్రీ). పరిగెట్టాం ఇద్దరం / అక్కడ గాలి లేదు వెలుతురూ లేదు/శూన్యం లేదు / సప్త సముద్రాలు జట్టు కట్టుకొని / జల తరంగిణి వాయిస్తున్నాయి / ఆకాశం చిరిగిపోయిన అరటి దొప్పలా/ఒక మూలపడివుంది/భూగోళ పతంమీద/ఉల్లిపొర కాగితంలాగ మృతించిన శేషుడు/భూమిని చుట్టుకొని ఉన్నాడు/ వెలిసిన రంగుబట్టలు మంచీచెడ్డా/జండాలై ఎగురుతున్నాయి". వెలిసిన రంగుబట్టలు అనే పదాల్తో గత యవ్వనాన్ని ద్యోతకం చేస్తున్నాడు కవి.

క్షుద్రకీటకాలు అన్నదమ్ములు, అక్కాచెల్లెళ్ళకి కలల సంకేతాలు.

"సాలెపట్టులో సజీవంగా ఉన్న/రెండు మక్షికాలు..."

ఇక్కడ ఆ మక్షికాలు శ్రీశ్రీ, నా.బాబు అన్నదమ్ములని ద్యోతించేవిగా వాడబడినాయి.

♦ ♦ ♦

సమాజంలోని కపట నటన (హిపోక్రిసీ) ముసుగుని బట్ట బయలు పరచటానికి సర్రియలిస్టులు పరిహాసాన్ని ఆయుధంగా చేపట్టారు. "నిశితమైన సాంఘిక విమర్శ సోషల్ సెటైర్ చేయటానికి హాస్యరసానికి మించిన నాయకరసం మరొకటిలేదు. ఇది ఒకర్ని నొప్పించేదికాదు. పైగా ఇట్ డెలివర్స్ గుడ్. ఒక వందమంది సంఘ సంస్కర్తలు చేయలేనిపని ఒక హేళనకార్యం చేస్తుంది" అంటాడు శ్రీశ్రీ. షేక్స్పియర్ హ్యూమర్‌ని బాధకి పర్యాయ పదంగావాడాడు. థామస్ ఎడిసన్ విట్‌ని వర్గీకరించాడు. గ్రేవ్ హ్యూమర్, ఎల్లో హ్యూమర్ అనే విభజనవుంది. ఎలిఫెంటైన్ ఫన్, బ్లాక్ హ్యూమర్, సిక్ జోక్, కాస్టిక్ హ్యూమర్ మొ॥ రూపాలున్నాయి. అసంబద్ధత (ఎబ్సర్టిటీ) లోంచివచ్చిన బ్లాక్ కామిడీవుంది. లైట్ వెర్స్, సిక్ వెర్స్, నాన్సెన్స్ పొయిట్రీ, నేకెడ్ పొయిట్రీ (నా.బా 'నగ్నగీతాలు' అనటం గమనించతగ్గది) మొ॥ విధాలు వెలిశాయి.

'రుధిరజ్యోతి'లో అధివాస్తవిక కాస్టిక్ హ్యూమర్ పలుచోట్ల మనకి కనిపిస్తుంది. దీంతో నా.బా అధిక్షేపణ సాధించాడు.

1. ఖ్యాతి గడించే / గీతంవ్రాసి / ప్రేయసికంకిత / మీయాలంటూ మూతి బిగించి/చేతులు నులుముతు/కూచున్నార!!!

2. వెన్నెల విహారాలకూ/కన్నెగాలి కౌగిళ్ళకు / ఇది కాలం కాదండి/పాతాళమ్మున / పతితులు పలవరించే / మాటల జిలిబిలితేటల/జాలిపాట పాడమంది.

3. అంటీ అంటని/ఆమె శరీరపు/చాలీచాలని చీరను తొంగి చూచే మానం/ "ఉన్నాడా చిన్నికృష్ణుడు? అనసూయేదీ?/ అరుంధతేద"ని/ప్రశ్నించింది.

4. చదువుకొన్న ఎద్దు /సత్తరువులో పద్దు / వచ్చాడొకడు/ ప్రజమధ్యకు/విద్వాంసుని/కచ్చగట్టి

5. గాలికి గలగల మోగే పండుటాక....ఖండించిన కోడిబుర్ర

* * *

కొండలు, కోనలు, పూపొదలు, పుప్పొడులు, పైరగాలులు, వానకారు మబ్బులు, తలిరాకు జొంపములు, తెలిమబ్బు తెరచాటు చెలి చందమామ, నిరుపేద రెల్లులో నిదిరించు సెలయేరులాంటి నునులేత కాల్పనిక కవితా ప్రకృతి ఆధునిక కవితా ప్రవర్తకుడయిన బోద్లేర్‌తో వైభవం తగ్గిందయింది, ప్రకృతి (లాండ్ స్కేప్, నేచర్) స్వాభావికం. అది మానవ చైతన్య సృష్టికాదు. కవి సృష్టికర్త. నిరంతరం నూత్న సృష్టిచేస్తాడు. అపరబ్రహ్మ స్రష్ట అయిన కవి కృతం కావ్యం. అది ప్రకృతిలా స్వాభావికం, నైసర్గికం కాదు. కనక కావ్యంలో కవిత్వంలో ఆ నైసర్గిక ప్రకృతికి ఎట్టి గౌరవం లేదనబడింది. ప్రకృతికి విరుద్ధమయినది కళ (అర్ట్ ఈజ్ ఎ మువ్ మెంట్ కాంట్రరీ టు నేచర్) అంటాడు రిల్కే. ఆ విధంగా కాల్పనికతావాదం ఏ ప్రకృతినయితే ఆరాధిస్తూ (తల్లి ప్రకృతిగాకాక ప్రేయసి ప్రకృతిగా అయితే అవొచ్చుగాని), ఆలంబన చేసుకుంటూ వచ్చిందో ఆ ప్రాధాన్యత ఆధునికతకి ఆది ఉద్యమమయిన ప్రతీకవాదంతో సన్నగిలసాగింది.

అయితే అత్యాధునిక అధికవాస్తవిక కవితకి నా.బా అంగలేసినా కృష్ణశాస్త్రి మధుమాస సామ్రాజ్యంలో కళ్ళుతెరిచిన యువార్భకుడు. బలపడీపడని భావకవితా రెక్కల్తో వేళకానివేళ వేళనుకుని అతినవ్య అధివాస్తవిక అధిమాసంలోకి ఎగిరిపడినవాడు. కనక నా.బా కవిత్వంలో మధు, అధిల సామరస్యాలు అగుపడతాయి.

నా.బా కవిత్వంలోంచి వీడిపోలేని సెలయేటి కెరటాల చిరుపాట తరగల ప్రకృతి రామణీయకతల ఉదాహరణలు కొన్నింటిని చూడవచ్చు.

1. గ్రీష్మపు ఎండల / మండిన భూముల / తొలకరివేళల/ మాతృ మృత్తికా మధుర వాసనలు.
2. బ్రహ్మచెముడు/కంచెమధ్య/పూర్ణిమ సంధ్యల్లోన / ఘడియైనా ఉదయాద్రిని/రుధిరజ్యోతై వెలిగే జాబిలి (నా.బా కవిత్వంలోని ఈ విశిష్ట ప్రకృతి బింబానికి విశాలమయిన కాన్వాస్, వివిధరంగుల కలయికలు అవసరమొస్తాయి.)
3. వర్షాగమ వేలావేళ తూనీగ
4. నిశిరాతిరి నీలిమ
5. హేమంత శర్వరీ కురులు/ఇరులు

/ తుమ్మచెట్టుమీది 'తీ'యని 'తీ'యని ప్రేమగీతి

7. పాతబడ్డ సెలయేరు....గండశిల నీడ....ఏతచేత గీతబడ్డ తాటిచెట్టు

నా.బా 'విశాఖపట్నం' కవిత నా.బా శ్రేష్ఠ కవితల్లో ఒకటిగా, ఆధునిక స్థల పురాణంగా చెప్పబడింది. విజయనగరం, తగరపువలస, భీమునిపట్నం పరిసరాల పల్లెశోభ, పల్లె ఆచారాలు నమ్మకాలు తారు రోడ్లు, కారులు, కుళ్ళుకాలువల విశాఖపట్న నాగరికంలోకి మారుతున్న సంధి దశకి 'విశాఖపట్నం' ఒక మంచి ఉదాహరణ అవుతుంది. ఆకాశంలోకి చండకరుడు ఉదయం కాఫీ క్లబ్బులో దోస తిన్నాకగాని తోచడు. చంద్రుడు సాయంత్రం సినీమా చూశాకే వెన్నెల కాస్తాడు. కాఫీక్లబ్బే ఆధునిక గుడి. కాఫీ ఎల్లమ్మ ఆ గుడిలోని గ్రామదేవత, గెడ్డలు, పొలిమేర పొలాల్లోని కెరివిదెయ్యాలు టార్చిలైట్లల్లో బంధించబడతాయి. దేవలోక దేవేంద్రుడు, ఆశ్రమవాసి అస్ఖలిత బ్రహ్మచారి కె. జి. ఆస్పత్రిలో చేరారు. కలకత్తా కాళి కోర్టుబోను ఎక్కించబడింది. కొళాయిదగ్గర బిందెల దొంతులు గోవర్ధన పర్వతాలు. విశాఖపట్న ఆఫీసులు ఆశ్రమాలు. ఆఫీసర్లు ఋషులు. లంచాలకోసం తపస్సులు. రూపాయిలు అచ్చెరకన్యలు. చిత్రగుప్తుని చిట్టా గదులు స్కూళ్ళయినాయి (బాలికల).

ఇలా గ్రామీణ్యం నా.బా కవిత్వంలో నగరీయంలోకి మార్పు చెందటం గమనించవచ్చు. దీనితో నా.బా అధివాస్తకుల 'వైరుధ్యాల మధ్య కలయిక' కూడా సాధించాడనవచ్చు.

* * *

"ఏకాకి లోకానికి చెందడ"ని తెలిసికూడా ఆధునికతావాద (మోడర్నిస్ట్) కవి తన కల్పనా సామర్థ్య వికాసానికి అనుకూలతని ఏకాంతంలో వెతుక్కుంటాడు. [ఈ స్వారోపిత ఏకాకితనానికి మార్క్స్ 'పరాయీకరణ'కీ ఎట్టి సంబంధంలేదు]. ఆ ఏకాంతవాసంలో 'దివ్య, మహత్' కళారూపాన్ని సృజిస్తాడు.

ఈ "గదిలోపలి మేడమీది" ఏకాంతత చివరికి ఆ కవిని నిరాశకి, నిస్పృహకి, అస్తిత్వ అలజడికి, అక్కడ్నుంచి 'అసంబద్ధత'కి చేర్చిన ఉదాహరణలున్నాయి. కామూ మనిషిని తిరుగుబాటుదారుగా చూశాడు. నిరంతర విజేతలు, శోధకులు, సాహసికులుగా సంభావించుతున్న స్యూరియలిస్టులు మానసిక అస్తవ్యస్త మహాలోకాల్నించి అరాచక, అసంబద్ధ లోకాలదాకా చేరారు.

నా.బా కవిత్వంలో నిరాశ, భయం, అపనమ్మకం, ఆత్మహత్యా ప్రసక్తి, అసంబద్ధత అక్కడక్కడయినా అగుపడతాయి.

బ్రతుకొక దక్షయజ్ఞం. హృదయమొక మండిన కుంపటి. జీవితమొక హేమంత నిశ మంచుదెబ్బ. ఈ ప్రపంచమొక అసంబద్ధ రంగవేదికగా, పతితల పాతాళంగా, జీవితం విషభుజంగంగా తోచింది. జీవితంలో పూదోటలులేవు. వసంతాలు రావు. ఎటుచూసినా చలిచే

ఆకలిచే విలపించే అనాథలు. పచ్చిన చచ్చిన మోడుచెట్లు. బ్రహ్మ జెముళ్ళ కంటకాలు. బ్రతుకుల్లో అవిశ్వాసాలు. ఇసుక ఎడారిలో ఎక్కడోగాని కుసుమించని పసరిక నేలలు. ఎవరో బంధించిన ఎముకల పంజరంలో ఎగరాలని తాపత్రయపడే ఆత్మ. వెను తిరిగిచూస్తే వెంటాడే మృత్యువు. ఆ మృత్యు పరీమళం కమ్మనిది. రమ్మని పిలిచేది. దొంగ నిశ అమావాస్య అర్ధరాత్రి గాఢనిద్ర పెరట్లోను (బావిలోను) చప్పు డవుతే ఇరుగుపొరుగు పాముచెవుల లోకం వినబడలేదని వాడించి ఉదయాన శవాన్ని చూట్టానికి వస్తుంది. ఆ ఆత్మహత్యా ప్రయత్నం విరమించబడింది. "అనుకోకుండా హటాత్తుగా అమాంతంగా నా హృదయం పురాణ (ఈ పదాన్ని 'పాత' అనే అర్థంలో మూడుచోట్ల నా.బా వాడాడు)బౌద్ధస్తూపం మహాధ్యానంచేస్తూ కూలిపోతే!" అంటాడు నా.బా. మృత్యువొక మౌనప్రతిహారి.

అధివాస్తవిక కళ కొన్ని అంశాల్లో విమర్శలలో గురిఅయినా దాని దిగ్భ్రాంత నైపుణి, వర్ణ సంయోజన, నిశిత పునరుత్పత్తి కొనియాడబడింది. "పదాలు-గతిభేదపు గర్భగుళ్ళు. వర్ణక్రమమని పేరుపెట్టటంలోనే రంగుల స్ఫురణ తోస్తుంది ... ఒక పదాన్ని ఉచ్చరిస్తే వింత రంగులు జిలుగువెలుగులూ ద్యోతకం అవాలి" అంటాడు నా.బా. ఈ విషయంలో నా.బా సర్రియలిస్టుల "స్ఫాటికత" కంటె ఇమేజిస్టుల భాష, నిర్మాణపద్ధతుల శక్తిమంతమయిన నైశిత్య తని [ఖరన్ ప్రెసిజన్ ఆఫ్ లాంగ్వేజ్ అండ్ కన్‌స్ట్రక్షన్] అనుస రించాడని చెప్పవచ్చు. నా "ఇనుప గీతాలు" అని నా.బా ఏసందర్భం, అర్థంలో వాడినా ఇమేజిస్టు నిశితానికి దగ్గరనిపిస్తాయి.

పదచిత్రవాద కవితల్లో అంతర్దృష్టిపై అభిరుచి అగుపించినా విమర్శాత్మక [క్రిటికల్] వివరణకూడా కనిపిస్తుంది. నా.బా "అదేది రాయిస్తే అది" అన్నప్పటికి నా.బా కవిత్వంలో విమర్శాత్మకత చోటు చేసుకోగలిగింది. అయితే అది సాంఘిక సంస్కరణ పరిధికే సీమిత మయింది. "కార్మిక సహోదరుడు, సామాన్యుడు [గడ్డిపరక], సామ్యవాదం" అంతటితోనే ఆగిపోయాయి. నా.బా ఆగిపోయాడు.

భావకవితోత్తర తెలుగు కొత్తకవితా ప్రారంభక ప్రముఖుల్లో నా.బా ఒకడు. శ్రీశ్రీతో పేర్కొనబడ్డ సమజంట. ఒకేసారి భావ కవితనించి బయటికొచ్చి అధివాస్తవికత చేపట్టిన వారు.

ఫ్రెంచి సర్రియలిస్టుల్లో లూయీ అరగాఁ, పాల్ ఎలార్డ్ మొ॥ వాళ్ళు సర్రియలిజం నుంచి మార్క్సిజంలోకి చేరారు. సోపాల్ లాంటివాళ్ళు అందులోనే ఆగిపోయి చివరికి దాన్నీ విడిచిపెట్టారు అరగాఁ, ఎలార్డ్‌ల్లా శ్రీశ్రీ మార్క్సిస్టు అవగాహన పెంచుకుని చాలా ముందుకి సాగిపోగా నా.బా దిక్కుతోచక ఆగిపోయాడు. శ్రీశ్రీ ఆశాంతి చివరిదాకా శ్రీశ్రీని విప్లవ సమర్థకుణ్ని చేయగా నా.బా అశాంతి నా.బాని కామూ 'రెబెల్'గానే ఉంచగలిగింది. [దిరెబెల్ కన్సిడర్స్ 'థింగ్స్ ఇన్ పర్టిక్యులర్!, ఎ పర్టిక్యులర్ ఇంజస్టిస్, సమ్ పర్టిక్యులర్ ఎ వేర్ నెస్ ఆఫ్ సఫరింగ్] నా.బా కవిత్వంలో వివరణ వుంది. కోపముంది. అభిశంసనవుంది. అయితే 'అభ్యుదయ' కవిత్వంలో ఒక ఆర్గ్యుమెంట్‌కూడా వుంటుంది. ఈలోకం ఇలావుంది అని చెబుతుంది నా.బా కవిత్వం. ఈ సమాజం, ఈ వ్యవస్థ ఎందు కలా వుంది, ఎలావుండాలి మొ॥ ప్రశ్నలు అభ్యుదయ కవిత్వంలో వుంటాయి. ఆదిలో అపకతవకగా అన్ని అవగాహనలున్నా శ్రీశ్రీ తన కవిత్వాన్ని మార్చుకుంటూ వచ్చాడు. నా.బా కవిత్వం అక్కడితోనే ఆగిపోయింది. నా.బా కవిత్వంలో ఒకప్రయోగ విధానం కనిపిస్తుందే కనుక ఆదొక ప్రోసెస్ అవుతున్నదేగాని ప్రోడక్ట్ కాలేకపోయిం దనిపిస్తుంది.

అభ్యుదయ కవిత పూపు వికాస సందడిలో తగని రీతిలో తప్పిపోయిన [కొంత క్రూరంగానే] ఒక విలక్షణ కవిత్వం

# కాల పరిష్వంగం

## శ్రీ నిఖిలేశ్వర్

ఈ కాల పరిష్వంగంలోంచి
పరిగెత్తే ప్రయత్నంలో
మనోవేగ వాయువేగాల రెక్కలతో
ఎంత వడిగా విజయగర్వంగా
విర్రవీగే మనిషి
మళ్లీ అంతే ఙంగా
అయస్కాంత వేగంతో
కాలానికి అతుక్కుపోడం
ఏ కాలం చెబుతున్న సత్యం ?
జీవనరాగంలో లీనమయ్యేచోట
అన్నిరకాల వైరాగ్యాల కబుర్లు
సుఖదుఃఖాల సుడిగుండంలోకి,
ప్రతి పుట్టుక తర్వాత
రాగద్వేషాల కడలిలోనే మునకలేయడం
లేదా
ఈదుతూ ఆశించే అంచు చేరడం!

# వెర్రివాడు

## శ్రీ సుబ్బారావు

బహుశః మా వాడికి
వేపకాయంత వెర్రి!
కాక మరేమిటి ?
పిచ్చిగా పరుగులెత్తే
మబ్బుగుంపుల మత్తగజాల్ని
సూర్యుడి ఆచూకీ అడుగుతాడు.
ఊళపెట్టే తుఫాను గాలుల్ని
"పూరిళ్ళు కుశలమా?" అంటాడు.
తాడెత్తున లేచే సముద్రపు కెరటాల్ని
వేట పడవల క్షేమం-కనుక్కుంటాడు.
అయ్యా! కాస్త మీరైనా చెప్పండి.
తేమగాలిలా మబ్బులమేను రుద్దాలని
చెట్లలా గాలిపాటకు తలలూచాలని
కెరటాలను ఊయల లూపాలని
'మానవత్వం, మట్టిగడ్డ'ల గొడవమాని
మౌనంగా లోకంలో కలిసిపోవాలని
మా వెర్రి కవికి-కాస్త నచ్చజెప్పండి!

# నవశకం

## శ్రీ కొడవంటి లీలా మోహనరావు

పెద్ద పుట్టుక పుట్టిన కన్నె వాన
పతనమై పతనమై
మురుగు కాలవలోకి దిగజారింది
రైలింజను జైలునుండి తప్పించుకున్న నిప్పురవ్వ
పిల్ల తెమ్మెరపై తేలిపోయి తేలిపోయి
పెంటకుప్పపై భగ్గుమంది

బఠాలుమని పగిలిన బూరంగు పింజ
తిరిగి తిరిగి వేయి గొంతుకలతో
తన వునికిని చాటింది.
ఆకాశం ఎర్రబడ్డ సమయాన
నేలపై ఏం మార్పు నూహించిందో గాని
కడలి కెరటం మెడసాచి చూసింది.

# ఫా న్సీ

## ౹ పాలడుగు వెంకటేశ్వరరావు

వెస్టర్న్ అవెన్యూ, పసిఫిక్ కోస్ట్ హైవేల, ఆ ఇంటర్ సెక్షన్ దగ్గర, రోడ్ క్రాస్ చెయ్యటం కోసమని నిలబడి వున్నాడు. రెమీ. ఇంకా సిగ్నల్ రాలేదు. రెమీ అసలుపేరు రమేశ్. నోరు తిర గని అమెరికన్లు రెమీ అని పిలవటం సాగించి ఆ పేరే స్థిరపరచారు. రమేశ్ ఇండియా నుండి 'ఇమిగ్రెంట్'గా అమెరికా వచ్చి మూడునెల లయింది. రమేశ్‌ని తీసుకువచ్చిన అతని అన్న అవినాశ్, ఈస్ట్‌కోస్ట్‌లో వున్న బోస్టన్‌కి మూవ్ అయిపోయాడు.

'ఇండియా'లో బీటెక్ పూర్తిచేసి, అమెరికా అంటే భూతల స్వర్గమనీ, అక్కడ అవకాశాలు ఎన్నోవుంటాయనీ, రెండు చేతుల తోనూ పుష్కలంగా డాలర్సు సంపాదించవచ్చుననీ విని, వచ్చిన రమేశ్ ఇంకా సెటిల్ కాలేదు. క్వాలిఫికేషన్‌కి తగిన ఉద్యోగం అతనికి దొరకలేదు. ఏదో చేస్తున్నాడు.

ఇక్కడ అందరూ అంతే. ఎవరిదారి వారిది. వారంలో, అయిదు రోజులూ బిజీగా వుంటారు. ప్రతి వారికీ 'టయిమ్‌సెన్స్' ఎక్కువ. ఆ మిగిలిన వీకెండు రెండు రోజులూ ఇల్లు సర్దుకునీ, బట్టలు ఉతుక్కునీ, రాబోయే అయిదు వర్కింగ్ రోజులకు, తయారు అవటంతోనూ ఫ్రెండ్సు ఇచ్చిన పార్టీలకు వెళ్ళటం, లేక తెలిసిన నలుగురిని పిల్చి పార్టీలు ఇవ్వటంతో సరిపోతుంది. మనిషి చేసే లేబర్‌కాస్ట్ ఎక్కువ. అందువలన ఏటూజడ్‌దాకా చాలామంది, ఎవరి పన్లు వాళ్ళు చూసుకుంటారు. పే చెయ్యలేక.

ఇక్కడి వాళ్ళు వకరిగురించి వకరు పట్టించుకోరు. ఎవరు ఏమిపని చేసి ఏవిధంగా 'గెటాన్' అవుతున్నారో మరొకరికి అనవసరం డిగ్నిటీ ఆఫ్ లేబర్ వుంది. ఎర్న్‌వైల్ యూలెర్న్—అనుకుంటారు. పనితనాన్ని బట్టే కూలీరేటు. పనినిబట్టే హైరింగులూ, ఫైరింగులూ తరచూ ఎక్కువగా జరుగుతూవుంటాయి. హైరింగు అంటే వుద్యోగం ఇవ్వటం. ఫైరింగు అంటే వుద్యోగంనుండి తీసెయ్యటం. ఎంత పెద్ద జీతాలున్న వుద్యోగాలకయినా ఇవి తప్పవు. సెక్యూరిటీలేదు జాబ్‌కి.

'వాక్' సిగ్నల్ వచ్చింది. రోడ్ క్రాస్‌చేసి. ఎదురుగా కార్నర్‌లో వున్న షాప్‌లోకి వెళ్ళాడు, రమేశ్.

'హాయ్' కవుంటర్ దగ్గరవున్న పడుచుయువతి పలకరించింది మర్యాదగా ఆహ్వానించింది.

'హాయ్' యికిలించాడు రమేష్ యాంత్రికంగానే. ఎంతో ఆదర పూర్వక మయిన విధాన - ఆమె 'కెనహెల్ప్‌యూ' అంది. ట్రీట్ మెంటు గొప్పగా వుంది. అది మామూలే. బిజినెస్ పద్ధతి.

అయిదడుగుల పదంగుళాల పొడవున్న అందగాడు రమేష్. ఆరోగ్యంతో రెపరెపలాడుతున్న ఇరవై ఒక్క సంవత్సరాలవయస్సు. చిన్నప్పటి నుండి కష్టాలు పడి ఓర్చిన శరీరం.

ఆ యువతి అతని వంకే పరిశీలనగా చూసింది. ఆ అమ్మాయికి పద్దెనిమిది సంవత్సరాల వయస్సు వుంటుంది. పోతపోసిన పాలరాతి విగ్రహంలా వుంది. అందాన్ని మలిచి చెక్కినట్లు నీలి కన్నులూ, నిగారింపుతో వున్నచంపలూ. దీర్ఘనాశికా, గవున్‌క్రింద పూర్తిఆకృతితోవున్న వక్షోసంపదా! షాపు ఖాళీగానే వుంది. కష్టమర్లు ఎక్కువగా లేరు అప్పుడు.

'ఆయూ ఫ్రం ఇండియా ?' అంది ఆయువతి అతన్ని పరిశీలనగా చూస్తూ.

'యా' అన్నాడు, రమేశ్.

'నేను మా డాడ్‌తో ఒకసారి ఇండియా వచ్చాను. బ్యూటిఫుల్ కంట్రీ, ఐ లవ్ ఇండియా. ఇండియన్స్‌అన్నా ఇండియన్ కల్చర్ అన్నా నాకు మక్కువ ఎక్కువ.' అంది. ఇదెక్కడి గోలరా బాబూ అనుకుంటూ 'యా' అని ఇకిలించాడు రెమీ, వురఫ్ రమేశ్; ఏం చెయ్యాలో తోచక 'థ్యాంక్యూ' అన్నాడు.

'అయాం నీటా. యూ ఆ...?'

'రెమీ' అన్నాడు రమేష్.

'డాడ్. డాడ్' అంటూ, వుత్సాహంగా పిల్చింది నీటా.

అది పెద్దషాపు. షాపునిండా రకరకాల 'ఈటబుల్స్ వున్నాయి కాన్‌ఫుడ్సూ, వికర్సూ ఎన్నోరకాలు వున్నాయి. మైక్రోవేవ్ ఓవెన్ వుంది. టీ. వి. మానిటరింగ్ వుంది. మినీ కంప్యూటర్‌కూడా వుంది కవుంటర్ దగ్గర. లోపల్నుంచి, టకప్ చేసుకునివున్న ఆరడుగుల వ్యక్తి వచ్చాడు. అతన్ని చూసి సంతోషంగా పువ్వులా హాయిగా నవ్వింది నీటా. 'డాడ్ హి ఈస్ రెమీ, ఫ్రం ఇండియా !' అంది వుత్సాహంగా.

'వండర్ ఫుల్!' అంటూ రేమీవైపు దూసుకువచ్చి, షేక్ హాండు యిచ్చాడు అతను.

'అయాం జాన్' అన్నాడు సంతోషంగా, వెరీగ్లాడ్ టూ మీట్యూ అన్నాడు.

రేమీ వక్రఫండుతో కలసి, అక్కడికి నాలుగు 'బ్లాకులు' అవతల, ఒక ఎపార్ట్ మెంటులో వుంటున్నాడు. జాన్ కలుపుగోలు మనిషి. రేమీతో ఎంతో ఆదరంగా మాట్లాడాడు. ఇండియాని గురించీ, ఇండియన్స్ గురించీ తను ఏర్పరుచుకున్న మంచి అభిప్రాయాల్ని గురించి చెప్పుకునివచ్చాడు. కొన్ని సంవత్సరాలు అతను ఫామిలీతో ఇండియాలో వున్నాడట. రేమీని వదిలి పెట్టలేదు. రేమీకి వాళ్ళతో అలా అయిన పరిచయం క్రమంగా ఎంతో బలపడింది.

'అమెరికా గొప్పదేశం'. ఇక్కడ సంపాదనకు అవకాశాలుఎన్నో. మొదట్లో ప్రతివారూ 'స్ట్రగుల్' అయినవాళ్ళే. తెలివితేటల్ని తెలిగ్గా సొమ్ము చేసుకొనవచ్చును.వుద్యోగమే చెయ్యాలనిలేదు.చేవవుంటే ఎన్నో వ్యాపారాలు. తనది అసలు ఐర్లాండు. పదిహేనుసంవత్సరాల క్రితం ఈ దేశం వచ్చాడు. మొదట్లో ఎంతో స్ట్రగులయ్యాడు. అపుడు తిరిగి ఐర్లాండు వెళ్ళిపోదామనీ అనిపించింది. రకరకాల వుద్యోగాలు చేసాడు. 'డిప్రెషన్లు' ఇక్కడా అప్పుడప్పుడూ వస్తుంటాయ్. ఫైరింగులు విస్తారంగా జరుగుతూ వుంటాయి. వుద్యోగాలతో విసిగిపోయాడు, వ్యాపారంలోకి దిగాడు. క్రమక్రమంగా వ్యాపారం కలిసి వచ్చింది. ఇప్పుడు తను ఆర్థికంగా ఎంతో బాగా వున్నాడు. స్వంత ఇల్లువుంది. రెండు బెంజికార్లు వున్నాయి. బ్యాంకులో మూడువందల వేల డాలర్లనిల్వ వుంది. నీవూ అంతే. ఇవాళ ఇలావున్నానని డిప్రెస్ అవకు. రేపు నీ తెలివి తేటల్తో నీవు మిలియనీర్వి అవవచ్చును.' అంటూ వుషారుగా చెప్పుకుని వచ్చాడు జాన్. దాపరికంలేని అతని మాటలలో అభిమానం వుంది. స్నేహమూ వుంది.

నీటా అతని ఏకైక కుమార్తె. లాంగ్ బీచ్లో హైస్కూల్ గ్రాడ్యుయేషన్ చేస్తూవుంది. తీరిక సమయాలలో ఇలావచ్చి, పనిచేసి సంపాదించుకుంటున్నది అని చెప్పాడు జాన్.

నీటా వీలయినప్పుడల్లా వచ్చి రేమీని తీసుకు పోయేది. పసిఫిక్ వడ్డున వున్న అందమయిన బంగళా వాళ్ళది. దాని ఖరీదు ఎంత లేదన్నా రెండువందలవేల డాలర్లు వుంటుంది.

ఆర్థికంగా తను ఇబ్బందుల్లో వున్నానని, మనుగడకోసం ఒక గాస్ స్టేషన్లో పనిచేస్తున్నాననీ చెప్పాడు ఆమెతో రేమీ. ఏమీ దాచలేదు, వాళ్ళదగ్గర. వాళ్ళూ అంతే ఓపెన్ మైండెడ్!

'ఆర్థిక ఇబ్బందులు ఎవరికి లేవు? ఇక్కడ అంతే. పుష్కలంగా డబ్బుచేతికి వచ్చినట్లే వుంటుంది. కానీ అదేవిధంగా మనకి తెలీకుండానే ఆమనీ మనచేతుల్నించి జారిపోతూ వుంటుంది. డోంట్ వరీ'– అని నవ్వుతుంది నీటా. నీటా తల్లి తనయాక్టివిటీస్తో ఎప్పుడూ బిజీగా వుండేది. చాలా నెలల తర్వాత ఒకసారి నీటా, దిగులుగా చెప్పింది.

'రేమీ అయాం మిస్సింగ్ యూ.!' అంది, విచారంగా.

'ఏమయింది, నీటా?!

'వుయార్ మువింగ్ టూ ఈస్ట్.!

'అది ఎమిటీ?! ఎందుకనీ?!'

'ఏమో, డాడ్ని అడుగు అంది. కర్చీఫుతో ముక్కు చీదుకుంది బాధగా.

జాన్ ఆ సాయంత్రం చెప్పాడు. అవును. వాళ్ళు మూవ్ అవుతున్నారు. లాస్ ఏంజిలిస్లో అంతా అమ్మేసి డిట్రాయిట్కి వెళ్ళిపోతున్నారు. అక్కడ మరొక ఇద్దరు పార్ట్నర్సుతో కలిసి ఇళ్ళ నిర్మాణానికి సంబంధించిన కంపెనీ పెడుతున్నాడట. ఆ బిజినెస్సు చాలా బాగుందట. నేను మల్టీమిలియనీరుని కావాలంటే ఈస్టుకి మూవు కాక తప్పదు. ఇలాగే వుంటే ఎన్నాళ్ళయినా నేను మిలియనీర్నన్నా కాలేను– అన్నాడు, జాన్ నవ్వుతూ.

'ఇప్పుడు మీకు ఏం తక్కువయిందని?' అడిగాడు రేమీ అమాయకంగా.

'మనిషికి 'యాంబిషన్' వుండాలి. కష్టపడి పనిచేయటం అలవాటయిన మనిషి, పైకి రావాలంటే, ప్రయత్నం అవసరం' అని నవ్వాడు జాన్. ఆ సమయంలోనే అతను ఒక విచిత్రమయిన ప్రపోజల్ చేసాడు.

'లాస్ ఏంజలిస్లో వున్న నా 'ప్రాపర్టీస్' అన్నీ డిస్పోజ్ చేసేశాను. పీ. సీ. హెచ్ (పసిఫిక్ కోస్ట్ హైవే) మీద వున్న ఈ షాపు వక్కటే మిగిలి వుంది. నీలాంటి వాడికి మంచి వ్యాపారం. కూర్చుని సంపాదించుకొనవచ్చు. 'హెల్ప్'కి అయిదారుగురు స్టూడెంట్సుని పెట్టుకుని బాగానడపవచ్చు. ప్రస్తుతం నేను అదే చేస్తున్నాను. దీన్ని నేను నీకు అమ్మేతాను, నీవు కొనుక్కో. ఈ ప్రపోజల్ నీటాది. నేనూ అదే అభిప్రాయంలో వున్నాను. చూస్తూచూస్తూ ఇంత మంచి వ్యాపారాన్ని డబ్బుకాసించి ఎవరిచేతుల్లోనో పెట్టటం ఎందుకు?' అన్నాడు.

'బేరం పెడితే వందవేల డాలర్లు వస్తుంది. నీకు యాభయివేల డాలర్లకే నేను అమ్ముతాను' అన్నాడు.

రేమీ తన పరిస్థితిని దాచకుండా చెప్పాడు. అంత డబ్బు తన దగ్గర లేదని చెప్పాడు.

'తెలిసిన వాళ్ళ దగ్గర 'బారో' చెయ్యి'! అని సలహా ఇచ్చాడు జాన్.

'అంత డబ్బు నాకెవరూ ఇవ్వరు'

'మీ ఇండియన్స్ ఇక్కడ చాలామంది వున్నారు! ఇంటరెస్టు తీసుకునయినా ఎవరూ నీకు ఆ సహాయం చెయ్యలేరా?'

రెమీ నవ్వాడు. 'మీకు మావాళ్ళ సంగతి తెలియదు. వాళ్ళు అవసరమయితే ప్రాణాలన్నయినా వదులుకుంటారుగాని, సాటివాడ్నే ఆయినా, అంత డబ్బు, నమ్మి నాచేతిలో పెట్టరు.' అన్నాడు రెమీ.

'అదేమిటి?!'

'అది అంతే'! అన్నాడు రెమీ.

'ప్రయత్నం చెయ్యి' అని సలహా ఇచ్చాడు జాన్.

ఆ మర్నాడు సీటాని తీసుకుని మళ్ళీవచ్చాడు జాన్. ఈలోగా తన ప్రయత్నం తనుచేసాడు రెమీ. బాగాతెలిసిన నలుగురు ఆంధ్రాస్‌ని ఫోనుమీద విషయంచెప్పి అప్పు అడిగాడు. కాని, ఫెయిలయాడు. అసలు అటువంటి ప్రయత్నం చెయ్యటమే తెలివితక్కువ!

సీటా దిగులుగావుంది.

'మేము ఎల్లుండే వెళ్ళిపోతున్నాము' అంది విచారంగా సీటా.

రెమీకి కూడా అదొకలాగా అన్పించింది. సీటా, మంచి స్నేహితురాలు!

'నేను చెప్పింది ఏం చేసావు? మాకు సమయంలేదు' అన్నాడు జాన్.

'ఏ సంగతి?'

'అదే ఈ షాపుని నువ్వు కొనుక్కోమన్నాను గదా!'

'అది నావల్లకాదు. నా దగ్గర అంతడబ్బులేదు.' అన్నాడు రెమీ, విచారంగా.

జాన్ ఆలోచనలో పడ్డాడు.

సీటా జాన్‌వంక సాలోచనగా చూసింది. రెమీనీ జాన్‌నీ మార్చి మార్చిచూసింది.

సీటా నీకే ఎలాగియినా సరే, ఈ షాపుని అప్పజెప్పాలని పట్టు బట్టావుంది. ఫీ టుక్ ఫాన్సీ ఇన్ యూ, సరే. అయితే ఇలాచేద్దాం. ఈ షాపునీకే అమ్ముతాము. బ్యాంక్ ఇంటరెస్టు రేటుతో ఇన్‌స్టాల్ మెంట్సులో బాకీ తీర్చెయ్యి. ఓ. కే?!' అన్నాడు జాన్.

'ఆ ప్రకారం డాక్యుమెంట్సు తయారు చేయిస్తాను. ఇవ్వాళ సంతకాలు అయిపోతే రేపేమేము వెళ్ళిపోతాము.' అని నిశ్చయించాడు జాన్.

'థాంక్యూ సీటా' అన్నాడు రెమీ ఏమనాలోతెలీక. సీటా విచారంగా శూన్యంలోకి చూసింది. 'యూ వెల్‌కమ్' అని అస్పష్టంగా గొణిగింది సమాధానంగా.

ఆరోజే కాగితాలు తయారయాయి, సంతకాలు పెట్టుకున్నారు, వ్యవహార పద్ధతిలో ఆ రాత్రికి డిన్నర్ ఇచ్చి, ఆమార్నాడే ఎయిర్ పోర్టుకి వెళ్ళి సెండాఫ్ ఇచ్చివచ్చాడు రెమీ.

సీటా రెమీని కావిలించుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. జాన్‌కూడా కళ్ళనీళ్ళనీ ముక్కునీ కర్చీఫ్‌తో తుడుచుకున్నాడు. మిసెస్ జాన్ మాత్రం మామూలుగానే వుంది. రెమీకి కూడా అదొకలాగఅన్పించింది. ఏదో వెలితి. విచారం. దిగులు.

వాళ్ళు వెళ్ళిపోయారు! అనుకోకుండా జరిగిన పరిచయం, వాళ్ళు తన మీద పెంచుకున్న ఫాన్సీ, ఆత్మబంధువుల్లా అయిపోవటం, ఏమాత్రం సెక్యూరిటీ లేకుండా- కావాలనే ఆషాపుకి తనని యజమానిని చెయ్యటం, వీలునిబట్టి అప్పుతీర్చేసుకోమని భరోసాఇచ్చి, ఆ నమ్మకంతో వెళ్ళిపోవటం-అంతా విచిత్రంగా అన్పిస్తుంది. ఎంతమంచి మనుషులు వాళ్లు.

సాన్ ఫ్రాన్సిస్కో వాళ్లు, వెస్టర్న్ అవెన్యూ వెళ్ళి పసిఫిక్ తీరాన్ని కలిసేచోట, 'సీవరల్డ్' అన్న పేరుతో ఒక 'హాలిడే రిసార్టు' కొత్తగా ఏర్పాటుచేయటంతో, ఆదారిన ట్రాఫిక్ పెరిగింది. ఆకారణంగా బిజినెస్సూ వూపునందుకుంది. లాభాలు పిచ్చిగా పెరిగాయి. ఆ వుత్సాహంతో, షాపుని రీమోడల్ చేసి ఇంప్రూవ్ చేసాడు రెమీ. కలిసివచ్చింది. జాగ్రత్త, కష్టపడి పనిచెయ్యటం వాటికి తోడయ్యాయి.

అందువలన సంవత్సరం తిరగకుండానే- అగ్రిమెంటుప్రకారం జాన్‌కి డబ్బుపంపిచివేసాడు రెమీ. మరొక సంవత్సరం గడిచేప్పటికి అతని బాంకు నిల్వబాగా పెరిగింది. ఆడబ్బుతో 'రియల్ ఎస్టేట్' బిజినెస్సుని ప్రారంభించాడు. మరొక రెండున్నర సంవత్సరాలలోనే అతని స్టేటస్ బాగా పెరిగింది. పట్టింది బంగారమయి కలసివచ్చింది. ఈదేశంలో ఇంతే. ఎవరిఅదృష్టం ఏదశలో ఏమలుపు తిరుగుతుందో ఎవరూ చెప్పలేరు.

అయిదు సంవత్సరాలలో రెమీ మల్టీమిలియనీ రయ్యాడు. 'సావరిన్ ఇన్ వెస్ట్‌మెంట్సు'అని కంపెనీపెట్టాడు. వ్యాపారం మూడు పువ్వులూ ఆరుకాయలుగా పెరిగింది. మధ్యలో ఒకసారి ఇండియా వెళ్ళి, తనకు నచ్చినఅమ్మాయిని పెళ్ళిచేసుకుని తీసుకువచ్చి కాపురం పెట్టాడు. చేపట్టిన అన్ని వ్యాపారాలు బాగా కలిసివచ్చాయ్.

ఇప్పుడు రెమీకి ఇద్దరు పిల్లలు. ఒక అబ్బాయి, అమ్మాయి. అనుకూలవతి అయిన భార్య. సకల సౌకర్యాలతో నిండి, నిముషం తీరికలేని జీవితం గిర్రున పరుగులు పెడ్తూవుంది.

ఆ రోజు రెమీ తన ఆఫీసులో 'బిజీ'గా వున్నసమయంలో ఫోను మోగింది.

'హలో'

'హాయ్. నేను జాన్‌ని. రెమీ దేర్?!'

'జాన్! రెమీ స్పీకింగ్. వేరార్యూ? వోంట్యూకంటూమీ! రెమీ మొహం వెలిగిపోయింది.

'షూర్. సాయంత్రం ఆరుకి. ఓ.కె.?' అన్నాడు జాన్. ఎన్ని సంవత్సరాల తరువాత!

'ఓ. కే. అవుల్‌బి వెయిటింగు ఫర్యూ' అన్నాడు రెమీ ఆనందంగా.

సాయంత్రం ఆరింటికి కరెక్టుగా రెమీ ఆఫీసులోకి అడుగు పెట్టాడు జాన్. రెమీ అతన్ని గుర్తుపట్టలేక పోయాడు.

జాన్‌గడ్డం బాగా పెరిగి వుంది. చిక్కిపోయాడు. లోతుకు పోయినకళ్లు. అతను వేసుకున్నదుస్తులు షాబీగావున్నాయ్. ఏమయింది జాన్‌కి? ఎంత మార్పు!

వాళ్ళిద్దరు చాలాసేపు కబుర్లు చెప్పుకున్నారు. జాన్‌ని తన యింటికి డిన్నర్‌కి ఆహ్వానించాడు రెమీ.

జాన్ చెప్పిన విషయాలు దారుణంగా వున్నాయ్.

డెట్రాయిట్‌కి వెళ్ళిన జాన్ ఆర్థికంగా క్రుంగిపోయాడు. వ్యాపారం దివాలాతీసింది. పార్ట్‌నర్స్ మోసం చేసారు. జాన్ భార్య మోసంచేసింది. మరెవరితోనో వెళ్ళిపోయింది. నీటా పెళ్ళిఅయింది. విడాకులు పుచ్చుకుంది. మళ్ళీ ఎవర్నో నమ్మి వివాహం చేసుకుంది. ఆ వివాహమూ ఫెయిలయ్యింది. నీటాకి ఇద్దరు పిల్లలు. వాళ్ళని పెట్టుకుని నీటా! స్ట్రగులవుతూవుంది'. ప్రస్తుతం నీటా న్యూయార్క్‌లో వుంది.

జాన్ పరిమితిని మించి బీర్ త్రాగాడు.

'రెమీ నేను సర్వనాశనం అయ్యాను. కెన్యూహెల్ప్ మీ' అన్నాడు.

రెమీ ఆలోచనల్లో పడ్డాడు. వెంటనే-ష్యూర్ అనలేకపోయాడు.

'ఇప్పుడు నాకు ఫైనాన్షియల్‌గా హెల్ప్ కావాలి రెమీ! ఐ వాంటూ రీ స్టార్ట్ మై కెరీర్'. అని రిక్వెస్టు చేసాడు జాన్.

రెమీ మవునంగా జాన్‌కి 'డిషెస్' సర్వ్‌చేసాడు. ఇక అక్కడ వున్నంతవరకూ- జాన్ ఆ ప్రస్తావన తేలేదు. డిన్నర్ అయినాక థాంక్స్ చెప్పి వెళ్ళిపోయాడు జాన్. గుమ్మంవరకూ వెళ్ళి వీడ్కోలు చెప్పిన రెమీ కళ్ళు శిలల్లాగావున్నాయ్. వాటిల్లో చలనం లేదు. జాన్ కనుమరుగయ్యేదాకా అలాగే చూసి వెనుదిరిగి డోర్‌వేసి లాక్‌చేసాడు రెమీ. దూరాన చర్చిలో గంటలు మ్రోగుతున్నాయి - మాన్! సంటైన్ దౌ ఆర్ట్ సో సెల్ఫిష్ అన్నట్లుగా!



## విహంగ "న్యాయమ్!"

### శ్రీ రాళ్లబండి కవితాప్రసాద్

కిరణంలా ఎగిరే హంస
ఒకనాడు
సూర్యాస్తమయాన్ని చూసి,
నాలుగు కన్నీటి బిందువులు కార్చింది—
అంతే............
"ఇంద్రధనస్సు" దానికి ఎక్కుపెట్టబడింది !
పాపం!
స్వేచ్ఛగా ఎగిరే దాని రెక్కలు
"ఏడు రంగుల సందుల్లో"
ఇరుక్కుపోయాయి!-!
విలవిలలాడుతూ,
వ్రేలాడుతోంది విహంగం-
—స్వేచ్ఛ కోరిన
పౌరుడిలా !!,

# మొటిమలు ?

## బైద్యనాథ్ సురక్తాస్ట్రాంగ్




మొటిమలు, చర్మవ్యాధులకు కారణమైన అపరిశుద్ధ రక్తమునకు కారణము అంత్రములు ఉదరము సరిగా పనిచేయకపోవటమే

సురక్తా జీర్ణక్రియ సరిగా జరుగుటకు సహాయపడి చర్మమును మృదువుగాను, సుందరముగాను చేయును.

సురక్తాస్ట్రాంగ్ మలిన రక్తమునుండి చర్మరోగములనుండి మిమ్ములను కాపాడును.

## బైద్యనాథ్ సురక్తాస్ట్రాంగ్

మొటిమలు మొదలగువాటి నివారణకు సురక్షితమైన విశ్వసనీయమైన ఆయుర్వేద ఔషధము

SKT 67 T SVR

డా॥ పురాణం రాధాకృష్ణప్రసాద్

# వినూతన బుద్ధపాద శిల్పము అమరావతి

ఈ మధ్యనే అమరేశ్వరాలయ శిథిలాలలోనుంచి ఒక చలువ రాతి బౌద్ధశిల్పం బయటపడింది. అంటే కృష్ణానది పుష్కరముల సందర్భంగా 1980లో ఆలయానికి మరామత్తులు చేసినప్పుడు వచ్చిన రాళ్ళురప్పలు నేడు రథం ఉంచే స్థానమునకు వెనుకప్రక్కగా కుప్ప పోశారు. దానిలోనుంచి ఈ శిల్పము లభించింది. ఇంతకాలంగా మరుగున పడియున్నది. అక్కడి రాళ్ళు అన్నీ క్రమక్రమంగా తరిగి పోతూ ఇప్పుడిది బయటపడ్డది.[1]

అమరావతి ఈనాడొక పెద్ద శైవక్షేత్రము. కాని ప్రాచీన కాలంలో పేరుమోసిన బౌద్ధక్షేత్రమై యావత్తు దక్షిణ భారతంలోనే "శ్రీ ధాన్యకటకము" అన్న పేరుతో బౌద్ధులకు కేంద్రస్థానంగా విస్తృత ప్రచారంలో ఉండేది. వారి గ్రంథాలలోగూడ విశేషంగా ఉదహరింపబడినది. ఇక్కడ ఆనాడు విలసిల్లిన బౌద్ధ శిల్పసంపద ప్రత్యేకతను సంతరించుకున్నది. నేడు అది "అమరావతి శిల్పశైలీ సంప్రదాయం" అన్న పేరుతో విశ్వవిఖ్యాతి గాంచినది.

ప్రస్తుతం లభించిన శిల్పం 65 × 37 × 12 సెం.మీ. పరిమాణంలో ఒకే మందంతో ఉన్న ఫలకము. దానిమీద ఒకవైపుమాత్రమే కొద్దిపాటి ఉబ్బెత్తులో ఉండేటట్లు బుద్ధుని అరికాలువలె శిల్పీకరింపబడి ఉంది. దొరికినప్పుడు ఈ శిల్పం చాలభాగం సున్నపుపొరతో కప్పబడి అస్పష్టంగా ఉన్నది. వెనుకవైపు మాత్రం చదునుగా నున్నది. బహుశ దాని ఆరాధనా స్థానంనుంచి తొలగిపోయినప్పుడు దానిని తీసుకువచ్చి ఆలయప్రాంగణంలో అవసరమైనచోట సమతలం పైకి ఉండేట్లుగా, శిల్పమున్నవైపు సున్నంతో బిగించి, ఉపయోగించుకొని ఉంటారు.

సున్నం అంతా తొలగించి శిల్పాన్ని శుభ్రం చేసేటప్పటికి దానిమీద ఉన్నది ఒక వినూతనమైన బుద్ధపాదం అని తెలిసింది. అది గూడ ఒక్క ఎడమ అరికాలు మాత్రమే. (చిత్రం-1) ఇదివరకు లభించిన బుద్ధపాద శిల్పాలలోలాగా, రెండు పాదములు ఒకే ఫలకం మీద చెక్కే విధంగా, కాకుండా ఒక్కొక్కటి విడివిడిగా వేరువేరు ఫలకములమీద చెక్కినట్లు కనపడుతుంది. ఎందువలననంటే ఈ శిల్పము ఫలకమునకు మధ్యలో చెక్కకుండా రాతికి ఒక అంచువైపునకు చెక్కటంవలన మరొక ఫలకంమీద కుడి అరికాలు చెక్కించి దీనితో జోడించి ఉంటారనుకోవచ్చు. అయితే ఆ రెండవ ఫలకం కొరకు జరిపిన అన్వేషణ మాత్రం ఫలప్రదం కాలేదు.

ఈ ఫలకంమీద శిల్పీకరించిన అరికాలు వ్రేళ్ళతోగూడ కలిపి అడ్డంగా నాలుగు అరలుగా లేక భాగాలుగా మూడు అడ్డు పట్టీలతో విభజింపబడింది. పై పట్టీలోను, క్రింది పట్టీలోనూ వరుసగా పూసలు అమర్చినట్లు చిత్రించగా మధ్య ఉన్న పట్టీ కొంచెం వెడల్పుగా ఉండి పూవుల డిజైనుతో చిత్రించబడింది. ఈ పట్టీలో రెండు చివరలలోను మూడేసి పూవుల అలంకారం జొప్పించి మధ్యలో "శ్రీదేవేన్ద్రకీర్తి" అన్న అక్షరములతో లేఖనం వ్రాయబడి ఉంది. ఈ అక్షరములు క్రీ.శ. 6, 7 శతాబ్దులలోని బ్రాహ్మీలిపికి చెందినవి. బహుశ ఈ దేవేన్ద్రకీర్తి ఈ శిల్పఫలకమును పూజాగృహమునకు దానము చేసిన దాతయై యుండవచ్చును. అరికాలులోని మూడు భాగములలో మంగళ లాంఛనములు అని పిలువబడే చిహ్నములను పొందుపరిచారు.

గతంలో ఆంధ్రదేశంలోని కొన్ని బౌద్ధ క్షేత్రాలలో[2] ముఖ్యంగా అమరావతి, నాగార్జున కొండ స్థలాలలో జరిపిన త్రవ్వకములలో బుద్ధ పాద శిల్పములు అనేకం లభించినవి. నాగార్జున కొండ వద్ద లభించిన ఇటువంటి ఒక శిల్పం మీద ఉన్న లేఖనంలో ఆ శిల్ప ఫలకమును "పతిపాద" (ప్రతిపాద)" అనియు, [3] అమరాతి వద్ద దొరికిన మరియొక దానిమీద ఉన్న లేఖనంలో "పాతుకపట" ("పాదుక-పట") అని ఉదహరించారు. [4]

శ్రీ ధాన్యకటక మహా చైతన్యమును ఆలంబనంగా చేసికొని యున్న చైత్యవాదులు ఆచరించిన చైత్యారాధన, వారు అంగీకరించిన బుద్ధుని లోకోత్తర పురుష లక్షణము క్రమంగా బుద్ధదేవుని

పూజా విధానానికి దారి తీసినవి. అయితే బుద్ధ దేవుని విగ్రహ రూపంలో ఆరాధించటం ఆనాటికి వాడుకలో లేదు. అందుచేత ఆయ నను బోధివృక్షము, వజ్రాసనము, ధర్మచక్రము. త్రిరత్న లాంఛ నము చైత్యము. పాదములు మొదలగు ప్రతీకలు లేక చిహ్నముల ద్వారా అర్చించేవారు. ఈ పైన పేర్కొన్న అన్ని లాంఛనములను బౌద్ధానుయాయులు అర్చిస్తూ ఉండటం అమరావతి శిల్పఫలకముల మీద కనపడుతుంది.

"పాదార్చన" చాల ప్రాచీనమైన భారతీయ సాంప్రదాయం. బౌద్ధ కాలానికి ముందు నుంచి ఆచరింప బడుతూ ఉండేది. యావత్తు భూనభోంతరాళములను కొలిచిన వామన - త్రివిక్రమమూర్తి పాద ములు విష్ణుపాదార్చనలో ప్రాముఖ్యతను సంతరించుకున్నవి.[5] రామ పాదుకలయొక్క అర్చనా సాంప్రదాయం రామాయణం వల్ల విదిత మవుతుంది. ఇదే విషయాన్ని బౌద్ధుల దశరథ జాతకంలో గూడ గమనించవచ్చు. భరతుడు రామపాదుకలను అర్చిస్తూ తద్వారా రాజ్య పాలనం చేస్తూ ఉంటాడు. క్రీ. పూ. రెండవ శతాబ్దికి చెందిన ఒక అమరావతి శిల్పంలో బుద్ధుడు వైశాలిలోని చాపాల చైత్యంలో బస చేయుచుండగా మారుడు ఆయనను దర్శించి దేహత్యాగము చేయ వలసినదిగా యాచించటం కనపడుతుంది. ఈ ఘట్టంలో బుద్ధదేవునికి బదులుగా బుద్ధ పాదము చూపబడి మారుడు వానిముందు సాగిల పడుచున్నట్లు చిత్రీకరించారు.[6]

ఈ విధంగా బుద్ధ పాదములను అర్చించటం ఆంధ్ర దేశం లోని ఇతర బౌద్ధ క్షేత్రాలలో గూడ పాటించేవారు. గుంటూరు జిల్లా కేసనపల్లి వద్ద లభించిన బౌద్ధారామ ప్రాంతంలో బహుశ్రుతీయ శాఖీయులకు చెందిన చైత్యం వద్ద క్రీ.శ. మూడవ శతాబ్దికి చెందిన బుద్ధ పాద శిల్పం ఒకటి లభించింది.[7] అదే కాలానికి చెందిన మరొక శిల్పం సింహళ దేశీయులైన మహా విహారవాసుల అర్చనకొరకు ఉద్దేశింపబడినట్లు చెప్పుచూ దానిమీద వ్రాయబడ్డ లేఖనంతో గూడ నాగార్జునకొండ త్రవ్వకాలలో ఒక చైత్య గృహంలో దొరికింది.[8] మరొకటి ఘంటశాల బౌద్ధక్షేత్రంలో లభించింది. అమరావతిలో యిటువంటి శిల్పాలు అనేకం. వీనిలో కొన్ని క్రీస్తు పూర్వపు శతాబ్దు లకు చెందినవిగూడ ఉన్నవి. వానిలో కొన్ని మద్రాసులోని ఎగ్మూరు ప్రభుత్వ మ్యూజియం లోను, మరికొన్ని లండనులోని బ్రిటిష్ మ్యూజియం లోను[9] ప్రదర్శించారు. అలాగే ఇప్పుడు మనకు లభ్య మైన ఈ శిల్పం గూడ ఏదియోయొక ఆరామంలోని చైత్యగృహంలో అర్చనకొరకు ఉద్దేశింపబడినదే. కాని దాన్ని తరువాత అక్కడనుంచి కదిలించినప్పుడు ప్రస్తుత ఆలయ ప్రాంగణంలోకి చేరి మరియొక విధంగా ఉపయోగింప బడ్డది.



చిత్రం:1
వినూతన బుద్ధ పాద శిల్పము
అమరావతి

బుద్ధుడు మహాపురుషుడు. లోకోత్తరుడు. ఆయన ముప్పది రెండు మహాపురుష లక్షణములు, ఎనుబది శుభచిహ్నములు కలిగిన వాడని బౌద్ధులు భావిస్తారు. వారి శాస్త్రగ్రంథము ఆచార్య నాగార్జున రచితమని చెప్పబడే ధర్మ సంగ్రహములో ఈ లక్షములు అన్ని వర్ణింపబడినవి. సాంప్రదాయానుసారం ఆయన శరీరం మీద ముప్పది రెండు లక్షణములు ముఖ్యమైనవిగా వర్ణిస్తారు.[10]

వీనిలో ఒకటి వెయ్యి ఆకులతో కూడిన చక్రచిహ్నము. తప్పని సరిగా బుద్ధుని పాదములందు (అరికాళ్ళలో) ఉన్నట్లు అన్ని

పాద శిల్పాలలోను చిత్రిస్తారు. "చక్ర లక్షణ సుకుమార సుజాత చరణేన" అని బుద్ధుని (చక్ర చిహ్నం పాదంలో ఉన్నట్లు ఒక నాగార్జున కొండవద్ద ఒక శిలా లేఖనంలో ఉదహరించారు.[11] ప్రస్తుతం మనకు లభించిన శిలాఫలకంలో గూడ ఈ చక్రలాంఛనం ప్రముఖంగా చిత్రించారు. దీనితోబాటు మరికొన్ని మంగళ లాంఛనములు క్రింద చెప్పిన విధంగా అరికాలులో పొందుపరచారు.

అయితే ఈ చిహ్నములు అన్ని శిల్పములలోను ఒకే విధంగా ఉండక మారుతూ ఉంటవి. బౌద్ధుల పాద శిల్పాలలోనివి జైనుల యొక్క వైదికుల యొక్క సాంప్రదాయిక చిహ్నముల కంటె భిన్నంగా ఉండటం గమనిస్తాము. ఒక్కొక్క సాంప్రదాయంలో ఈ చిహ్నములు వేరువేరుగా ఎన్నిక చేసుకున్నారు. కాని కొన్ని చిహ్నాలు మూడు సాంప్రదాయాలలోను కనబడుతూ ఉండటం జరిగింది. యథార్థానికి ఈ చిహ్నాలు అన్నీగూడ బౌద్ధ, జైన సాంప్రదాయాల కంటె ముందువి. ఆయాశాఖలవారు తమకు కావలసిన వానిని తీసుకున్నారు. అట్లు ఎన్నిక చేసుకున్న వానిలో చక్రలాంఛనము ప్రముఖమైనది. విష్ణు-పురుషోత్తముని చిహ్నం(చక్రవర్తిత్వానికి సంకేతం)గా భావించారు. మిగతా చిహ్నాలు ముప్పది రెండు అని గణనలోనికి తీసుకున్నా తరువాత రానురాను ఇరువదినాలుగు, పదునారు, పంన్రెండు, పది అని తగ్గించుకుంటూ చివరకు ఎనిమిదిగా మిగిల్చి వీనినే అష్ట మంగళములు అని వాడుకలోనికి తెచ్చారు. సాంచీలోని బౌద్ధ శిల్పములలో ఒకచోట రెండు కంఠహారాలు కనుపడుతవి.[12] వానిలో జతకూర్చిన పతకములన్నీ గూడ ఈ మంగళ చిహ్నాలే. వీటిసంఖ్య ఒకదానిలో పదకొండు. రెండవ దానిలో పదమూడు. జైనుల ఆయకపటములలో ఎనిమిది చిహ్నాలు లభించగలవు.[13] వైదిక సాంప్రదాయంలో[14] ఎనిమిది, పంన్రెండు చిహ్నాలు తరచుగా వాడటం జరిగింది. బౌద్ధుల పాద శిల్పాలలో ఈ సంఖ్య, చిహ్నాల ఎన్నిక గూడ మారుతూ ఉంటుంది.

ప్రస్తుతం మనకు లభించిన శిల్ప ఫలకంమీద చక్రచిహ్నంతోబాటుగా ఈక్రింది చిహ్నాలు గూడ చూడవచ్చు. పాదాన్ని వ్రేళ్ళు గాకుండా మూడు అరలుగా వేరు చేసారు గదా! వానిలో పై అర-అంటే మడమ భాగంలో ఒక అష్టదళపద్మము, దాని మధ్యలో దక్షిణావర్త శంఖము చూడగలము. దానికి రెండు ప్రక్కల ఒక్కొక్క స్వస్తికము, దాని పైభాగంలో పుష్పము శిల్పీకరించారు. అయితే స్వస్తిక యొక్క భుజములు సవ్యమార్గంలో కుడివైపునకు కాకుండా ఎడమవైపునకు తిరిగి ఉండటం గమనించదగ్గది. ఇది ఉద్దేశపూర్వకంగానే చెక్కి ఉంటారు. లేదా కుడి అరికాలులో సవ్య రూపంలో ఉండి ఉంటే, దానికి వ్యతిరేక విధంగా దీన్ని రూపొందించి ఉండటం గూడ కావచ్చు.

మధ్యనున్న రెండవ అరలో ప్రముఖంగా ఉన్న చక్ర లాంఛనమునకు ఎడమవైపున నారిబిగించిన ధనస్సును, దానిప్రక్కన క్రిందకు వ్రేలాడుతున్న పతాక సహితంగా ధ్వజ దండాన్ని చూడవచ్చు. కుడివైపున అలంకార శోభితంగా పనితనంతో మలచిన వజ్ర లాంఛనం కనపడుతుంది. దీనిని రెండువైపులగూడ మొనలు ఉన్నవి. ఆకారణంగా దీనిని విశ్వ వజ్రం అంటారు.

ఇక మూడవ అరలో, అంటే వ్రేళ్ళకు పైభాగంలో, మరొక అష్టదళ పద్మం, దాని మధ్యలో ఒక పూర్ణకలశం పద్మానికి ఎడమ వైపు ఖడ్గము, అంకుశమున్నూ, కుడివైపున మీనయుగళము అంటే రెండు చేపలు దారంతో ముక్కులు ముడివేయబడినవి-చూడగలము. ఇక్కడ పొందుపరచిన పూర్ణకలశము క్రీస్తు రెండవ శతాబ్దిలోని అమరావతి శిల్పాలలో ప్రసిద్ధరీతిలో కనుపించే నమూనాలో కాకుండా పొట్టిదిగా, విస్తరించిన పొట్టతో వెడల్పు అయిన మూతి, క్రిందమట్టు గలిగి గుమ్మడికాయ ఆకారంలో ఉంటుంది. పొట్టచుట్టూ అలంకార పట్టికతో దాని ముడికుచ్చులు రెండువైపుల వ్రేలాడుతూ కనపడుతుంది.

ఇక చివరి అరలోని వ్రేళ్ళు అయిదూ ఒకేవిధంగా కేసరములు గల అష్టదళ పుష్పాలంకారంతో రూపొందించారు. మొత్తం మీద ఈ అన్ని లాంఛనాలను వరుసగా గమనిస్తే ఇవి పంన్రెండుగా తెలుస్తుంది. చక్రము, శంఖము, పూర్ణకలశము, పద్మము, స్వస్తికము, ధనస్సు. పతాకము, వజ్రము, ఖడ్గము, అంకుశము, మీనయుగళము, పుష్పము.

ఈ చిహ్నములను అమరావతి శిల్పశైలికి చెందిన ఇటువంటి శిల్పములలోని చిహ్నములతో తులనాత్మకంగా పోల్చి పరిశీలించినట్లయితే చిహ్నములను రూపొందించిన విధములోను, వానిని ఎన్నిక చేసి జతచేసి కొనుటలోను భేదమున్నట్లు తెలియగలదు. ఇవి కాలానుగుణంగా ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క విధంగా మార్పు చెందుచున్నట్లు చూడగలము. వానిని మూడు సమయములలో మూడు విధములుగ జతపరచినట్లు, మార్పులతో పొందుపరచినట్లు గమనించగలము.

మొదటి దశలో ఈపాద శిల్పములను అతి నిరాడంబరంగా చిత్రించారు. ఒకానొక అరుదైన అమరావతి పాద శిల్పంలో ఒక్క చక్రము, వర్తులంలో ఇమడ్చబడి వంకర తిరిగిన కిరణరేఖలతో సూర్య చిహ్నము మాత్రమే అరికాలులో చూపించినారు. త్రి రత్న, శ్రీ వత్స లాంఛనములు కాలివ్రేళ్ళ మీద చూడగలము. శిల్పఫలకం మీది లేఖనాధారాన్ని అనుసరించి ఇది క్రీ. పూ. రెండవ శతాబ్దికి చెందినదిగా చెప్పవచ్చు. (చిత్రం : 2)

ఈ దశలో మొత్తముమీద నాలుగు చిహ్నములను మాత్రమే ఉపయోగించారు. వానిని గూడ రెండు జట్లుగా వాడుకున్నారు.

ఒక్కొక్క జట్టులో మూడేసి చిహ్నములు ప్రధానమైన చక్రచిహ్నమునకు పైవరుసలోను, క్రిందివరుసలోను ఇమిడ్చినారు. చక్రచిహ్నం మాత్రం అన్ని పాదశిల్పములలోనూ, అన్ని కాలములలోను తప్పక ఆవృతం అవుతుంది. ఒక పౌందికలో స్వస్తికము మధ్యలోనూ దాని కిరువైపులను శక్తి ధ్వజచిహ్నము కనుపించగలవు. రెండవ సందర్భమున ఒక త్రి రత్నముగాని లేక శ్రీవత్సముగాని మధ్యలో నిమిడ్చి యిరువైపులను ఒక్కొక్క స్వస్తికను చిత్రించారు. (చిత్రం : 2) అంటే త్రి రత్నము, స్వస్తికము, శ్రీవత్సము, శక్తిధ్వజము నాలుగు చిహ్నములు మాత్రమే ఉపయోగించారు. శక్తిధ్వజము, త్రిభుజాకార లాంఛనమన్న పేరుతో బహుళంగా గుర్తింపు పొందినది. ఈ శిల్పములు క్రీ. పూ. మొదటి, రెండు శతాబ్దులలోనివిగా చెప్పవచ్చు.[15]

రెండవ దశలో ఈ చిహ్నములను నాలుగు చొప్పున జత పరచి చక్ర చిహ్నమునకు యిరువైపుల పొందుపరచిరి. ఇవి చాల అలంకారములతో కూర్పబడి ఆడంబరముగ కనుపించును, త్రి రత్నము, శ్రీవత్సము, స్వస్తికము, పూర్ణకలశము, మీనయుగళము, భద్రాసనము, అంకుశము, మరియొక విచిత్ర లాంఛనము - దీనికి నాగద్వయమని కొందరు నామ మిడిరి-యివి రెండు జట్లుగా ప్రధానముగా కనుపించగలవు. కొన్ని సందర్భములలో వడ్లగింజ ఆకారములో యవగింజ చిహ్నము, పద్మము గూడ కనుపరచిరి (చిత్రం : 4) ఈ కాలంలో ఒక్క స్వస్తిక లాంఛనమును తప్ప మిగతా వానిని పునరావృతం చేయటం కనుపింపదు. ఈ శైలిలోనున్న పాదశిల్పములు అమరావతి, నాగార్జునకొండ, ఘంటశాల, కేసనపల్లి బౌద్ధ క్షేత్రములలో లభించినవి.[16] క్రీస్తు మొదటి మూడు శతాబ్దములకు చెందినవిగా వీనిని భావింపవచ్చు. ఈ దశలో కొన్ని సందర్భములలో చక్ర లాంచనమునకు ఉపరివర్తులాకార భాగమునకు చుట్టును చక్రపు ఆకులను అంటిపెట్టుకున్నట్లు త్రి రత్నలాంఛనములను జోడించారు. అంటే వేయి ఆకులతో నున్నట్లు వర్ణింపబడే చక్రలాంఛనం ధర్మ చక్రలాంఛనంగా రూపొందింది. ఈ సమయంలోనే ధర్మ చక్రం శీర్షంగా ఉండే స్తంభలాంఛనములు గూడ కొన్ని సందర్భములలో పాదశిల్పములలో కాలివ్రేళ్ళమీద చెక్కేవారు. కానిచో అరికాలిలోని లాంఛనములే వ్రేళ్ళమీద గూడ కనుపించేవి. ఈ సందర్భంలో మనం ఒక ముఖ్యవిషయం గుర్తుంచుకోవలసి ఉంది. బౌద్ధులకు అతి ముఖ్యమైనదిగా భావింపబడే త్రి రత్న లాంఛనం పైరెండు దశల లోను శ్రీవత్సముతోపాటు తప్పనిసరిగా పొందుపరచేవారు. ఈరెండు

## బుద్ధ పాద శిల్పములు



చిత్రం:2 అమరావతి



చిత్రం:4 కేసనపల్లి



చిత్రం:3 అమరావతి



చిత్రం:5

అష్టమంగళఫలకము-కొండాపురం

లాంఛనములను బౌద్ధులు అష్ట మంగళములలోని వానిగా పరిగణించి నట్లు తెలుస్తుంది. మరొక బౌద్ధ క్షేత్రమైన కొండాపూరు (సంగా రెడ్డికి సమీపమున-మెదక్ జిల్లా)లో జరిపిన త్రవ్వకములలో పై కాలమునకు చెందిన వస్తుజాలములో నాలుగు సెం. మీ. వ్యాసము కలిగిన ఒక రాతిమూస లభించింది. దానిలో గుండ్రని పద్మమును, దానిచుట్టునూ అష్టమంగళ చిహ్నములను చిత్రించారు. అవి త్రి రత్నము, అంకుశము, మీనయుగళము, పూర్ణఘటము, స్వస్తికము, శ్రీ వత్సము, భద్రాసనము, శక్తిధ్వజము. (చిత్రం: 5)[17]

మూడవ దశలో అంటే ప్రస్తుత శిల్పకాలంనాటికి పైన వర్ణించిన లాంఛనములు మార్పు చెందటమే కాక వానిని జట్టుగా ఏర్పరచటంలోనూ, చిత్రీకరించే విధానంలోనూ ఒక నూతనత్వం గోచరిస్తుంది. అన్నిటికన్నా చిత్రమయిన విషయం బౌద్ధులకు అతి ముఖ్యమైన త్రిరత్న లాంఛనంగాని దానితోపాటు తరచుగా కనిపించే శ్రీవత్సముగాని ఇక్కడ ఉపేక్షింపబడటమే. ఈ కారణంచేత అసలు ఈ శిల్పం బౌద్ధులకు సంబంధించినదేనా? యన్న అనుమానంగూడ కలుగక తప్పదు. "పాదపూజ" అన్నది బ్రాహ్మణ సాంప్రదాయంలో (విష్ణుపాదములు, రుద్రపాదములు) ఉన్నప్పటికి ఇది బ్రాహ్మణ మతస్థులదని చెప్పలేము. అలాగే జైనులదని గూడ చెప్పే అవకాశం లేదు. ఎందువలనంటే ఇది దొరికిన ప్రదేశము ప్రఖ్యాత బౌద్ధ క్షేత్రమయిన అమరావతి/ శ్రీ ధాన్యకటకము. ఇక్కడ తొమ్మిదవ శతాబ్దికి పూర్వము జైనమున్నట్లు ఆధారములు లభించలేదు.

ఈ ఫలకంమీది లేఖనం 'అక్షర సారూప్యత ననుసరించి క్రీ. శ. 6-7 శతాబ్దులకు చెందినదిగా భావింపవచ్చు. లేఖనాన్ని ఫలకంలో ఇమిడ్చిన ప్రదేశాన్నిబట్టి, శిల్పరచనా విధానాన్ని బట్టి లేఖనం శిల్పరచనా కాలానికి చెందినదే కాని తరువాత కాలంలో అంతకు పూర్వపు శిల్పంమీద చెక్కినట్లుగా కనుపించదు. కనుక శిల్పము లేఖనముగూడ ఒకేకాలానికి చెందినవని చెప్పవచ్చు.

ఈ కాలంనాటికి ధాన్యకటకంలో వజ్రయానం స్థిరంగా పాతుకుపోయిందన్న విషయం అందరకూ తెలిసినదే. ధారిణీలను జపించటం, ముద్రలను ఆచరించటం, దేవ, దేవతలకు అర్చనలు, పూజలు బాగుగా ప్రచారంలోనికి వచ్చినవి. హ్యుయాన్‌సాంగు ఒక చోట ఉదహరిస్తాడు: [18] ధాన్యకటకమునకు దక్షిణముగ వజ్రపాణి ఆలయం ఉందని, అలౌకికశక్తులను సాధించదలచే సన్యాసులు అక్కడఉండి వజ్రపాణిధారణిని జపించేవారని. యదార్థానికి వజ్ర యానమునకు పుట్టినిల్లు ధాన్యకటకమే. నాలుగవ శతాబ్దినాటికే ఆంధ్ర బౌద్ధులు వజ్రయాన బౌద్ధమునుగూర్చి బాగా తెలిసినవారు. అమరావతి నుంచి వజ్రయాన దేవతలకు చెందిన అనేక విగ్రహములు గూడ బయటపడినవి.

వజ్రయానంలో పరమార్థ సత్యమునకు ప్రతీక వజ్రము. ఈ సత్యమునే శూన్యమందురు. వజ్రమువలె దృఢమైనదియు, నాశరహిత మయినదియు, మార్పునకు లోనుగానిదియు, నిత్యమైనదియు నగుటచే దానికాపేరిడిరి.[20] వజ్రయాన బౌద్ధమునందు మరియొక విశ్వాస మున్నది. అందు వజ్రధరుడు లేక వజ్రపాణి లేక ఆదిబుద్ధుడు సర్వో న్నత దైవము. మూర్తీభవించిన శూన్యము. పంచధ్యాని బుద్ధుల కును గూడ ఆదిదైవము. ఆయన తన దక్షిణహస్తమున విశ్వవజ్ర మును- అనగా రెండు వైపులను మొనలుగలు వజ్రాయుధమును-, వామ హస్తమున ఘంటను ధరించియుండును. ఆయనకు శక్తి ప్రజ్ఞా పారమిత. ఈమె అజ్ఞాన నాశమును సూచించు ఖడ్గ, కపాలము లను ధరించియుండును. అట్లు బుద్ధునకు వజ్రలాంఛనము ప్రతీకయై వజ్రయానీయుల అర్చనా కలాపములందు, ముద్రధారణలయందును ప్రముఖపాత్ర కలిగియున్నది. ఈ వజ్రప్రతీక పూజనీయమగు వస్తు విశేషముగ పరిగణింపబడి మంగళలాంఛనములలో నొకటియై క్రమేపి బౌద్ధధర్మలాంఛనముగ నప్పటివరకు ప్రాముఖ్యతనందిన త్రిరత్న లాంఛనముయొక్క స్థానము నాక్రమించినది.[21]

ప్రస్తుత శిల్పఫలకముమీద పైన పేర్కొన్న విధముగా ప్రధానముగా పొందుపరచవలసిన త్రిరత్నలాంఛనమునకు మారుగా విశేషాకృతిలో వజ్రలాంఛనము చక్రమునకు కుడివైపు చూపింప బడటం గమనించదగిన విశేషం. ఈ విధంగా వజ్రపాణికి ప్రతీకగా వజ్రమును, శక్తి (ప్రజ్ఞాపారమిత)కు ప్రతీకగా ఖడ్గమును లాంఛన ములుగా ప్రవేశపెట్టినవారు ఈ కాలంలో వజ్రయానీయులు అయి ఉంటారు. ఈ దశలో లాఛనములను కనుపరచే వరుస, శైలి గూడ భిన్నంగా ఉన్నది. మొత్తం శిల్పి ఆక్రమిత ప్రదేశాన్ని చిన్న భాగాలుగా విభజించటం వానిలో వేరు వేరు లాంఛనములు వానివాని ప్రాముఖ్యతను గమనించి ఆయా భాగాలలో యిముడ్చుట కనపడుతుంది.

వజ్రయానానికి సంబంధించిన దేవతలు, మంత్రములు వాని ముద్రలు మొదలయిన భాయలు ధాన్యకటకంలోని అంధ కులయొక్క లేక చైత్యకులయొక్క మహాయానశైలీయ సాంప్ర దాయంలోనే పారమిత సాహిత్యంలో లభ్యమైనప్పటికి[22] మంజుశ్రీ మూలకల్పంలో కొంత విశేషంగాను, దాని తరువాతది క్రీ. శ. మూడవ శతాబ్ది ఉత్తరార్థానికి చెందిన గుహ్య సమాజ గ్రంథంలో విస్తృతంగాను వజ్రయాన దేవతల వర్గీకరణ విధానం రూపొందించ బడి స్థిరరూపం దాల్చినట్లు తోస్తుంది. అసంగుని కాలంలో (క్రీ. శ. 300) వజ్రయానీయుల మహాసుఖ తత్త్వవాదం ప్రచారం లోకి వచ్చింది. అయినప్పటికి తరువాత శతాబ్దాలలో దానిని రహ స్యంగా గురు శిష్య పరంపరలో ముఖతః గోప్యంగా ప్రచారం చేసు

షన్నారేగాని విస్తృతంగా బాహ్యప్రచారానికి అంగీకరించలేదు. ఏడవ శతాబ్దమధ్యభాగంలో సిద్ధులు లేక వజ్రాచార్యుల గీతాల ద్వారాను, వారి ప్రబోధాలద్వారాను ప్రథమంగా బాహ్యప్రపంచం లోనికి వచ్చింది. సరహుడు, సిద్ధనాగార్జునుడు, సబరీపుడు, రూప, పద్మవజ్ర, అనంగవజ్ర, ఇంద్రభూతి, ధర్మకీర్తి మొదలగు ఆచార్యుల వలన ఈ సాహిత్యం వృద్ధిచెంది విస్తృతంగా ప్రచారంలోనికి వచ్చింది.

శిల్పమధ్య భాగంలో కనుపించే శ్రీదేవేన్ద్రకీర్తి మనకు లభించే వజ్రాచార్యుల పట్టికలో కనుపించరు. అయినప్పటికి పై పేర్లలో నున్న చివరి రెండింటితోగల సారూప్యతనుబట్టి ఈ శిల్పఫలకకారకుడు లేక దాత అయిన శ్రీదేవేన్ద్రకీర్తిగూడ అట్టి ఆచార్యులలోనివాడే శ్రీ ధాన్యకటక పురవాసిలేక ఆంధ్రదేశానికి చెందినవాడై ఉండవచ్చు నన్న ఊహ కలుగుతుంది. జ్ఞాన సిద్ధి అన్న గ్రంధాన్ని వ్రాసినది, క్రీ. శ. 7వ శతాబ్దికి పూర్వ భాగానికి చెందినవాడైన ఆచార్యుడు ధర్మకీర్తి ఆంధ్రదేశీయుడే [23] ప్రసిద్ధ మీమాంసాచార్యుడైన కుమారిలునకు బంధువు. తిరుమలవాసి.

ఈ విధంగా ప్రస్తుత పాదపట్ట శిల్పము వజ్రయాన శాఖీయులకు చెందినది. ఇప్పటివరకు లభించిన శిల్పఫలకములలో ఇదే మొదటిది. వజ్రయాన సాంప్రదాయములు, వారుపయోగించిన ప్రతీకలాంఛనములు, వానిని పొందుపరచు విధానం, పాదుకా శిల్పములను బౌద్ధమందిరాలలో నిలిపి అర్చించే ఆచారం ఏడవ శతాబ్దిదాకా ఏ విధంగా రూపాంతరం చెందుతూ కొనసాగుతూ ఉన్నదీ ఈ పాదపట్ట శిల్పంద్వారా వెలుగులోనికి రాగలవు. వజ్రయాన సాంప్రదాయ పరిశీలనకు ఈ శిల్పము యంతయో దోహదం చేయగలదనుటలో సందేహం లేదు.

## పాదసూచికలు :

1. ఈశిల్పఫలకమును పైన పేర్కొన్న రాళ్ళగుట్టనుండి ఒక చాకలి తీసికొని వెళ్ళుచుండగా స్థానిక ఆర్. వి. వి. యన్. కళాశాలాధ్యాపకులు, యన్. యస్. యస్. ఆఫీసరు అయిన శ్రీ అల్లూరయ్యగారు దానిని గ్రహించి అమరావతి పురావస్తు సంగ్రహాలయమునకు బహుకరించిరి. వారికి మేమెంతయో కృతజ్ఞులము.
2. అమరావతి, నాగార్జునకొండ క్షేత్రములలోనే కాక కేసనపల్లి, ఘంటశాల, కొండాపురము, బావికొండ మొదలగు ఇతర క్షేత్రము లలోగూడ యిట్టి శిల్పములు లభించినవి.
3. ఎపి. ఇం. XX పు 37; పి. ఆర్. శ్రీనివాసన్ ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ ది ఇక్ష్వాకు పిరియడ్(హైదరాబాద్4979)పు 29 నెం. 12.
4. ఎపి. ఇం. 20. XXX III పు 247
5. కె. పి. జయస్వాల్ : వైష్ణవ వర్షిప్ అండ్ బుద్ధిసమ్; ఇండియన్ ఏంటిక్వరీ xLVII (బొంబాయి 1918) పు 84.
6. ఏంషంట్ ఇండియా - XXI (న్యూఢిల్లీ - 1967) చిత్రపటం XL; అమరావతి, ఎ గైడ్ (న్యూఢిల్లీ 1980) చి.ప. III ఎ.
7. ఎమ్. ఎ. వహీద్ ఖాన్: ఎ మానోగ్రాఫ్ ఆన్ ది ఎర్లీ బుద్ధిస్ట్ స్తూపా ఎట్ కేసనపల్లి (హైదరాబాద్ 1969) చి.ప V

   ఎపి. ఇం. XXXIII-పు 247; ఎ.ఇ.16. పు 69.
9. జె. బర్గెస్. (i) ది బుద్ధిస్ట్ స్తూపాస్ ఆఫ్ అమరావతి ఎండ్ జగ్గయ్యపేట (వారణాశి 1970) చి. ప. LII-6,7, LIII-I, పు 98 చిత్రం 30.

   (ii) నోటీస్ ఆన్ అమరావతి స్తూపా (వారణాశి 1972) చి. ప. XII-36 బి.

   (iii) డగ్లస్ బారెట్ : స్కల్ప్చర్స్ ఫ్రమ్ అమరావతి ఇన్ ది బ్రిటిష్ మ్యూసియమ్ (లండన్ 1954) చి. ప. XLVII, XLV.
10. విష్ణు కుండి రాజు గోవింద వర్మ యొక్క తుమ్మలగూడెం (ఇంద్రపాలనగరం) తామ్ర శాసనంలో "సమలంకృత మూర్తే ద్వాత్రింశన్మహాపురుష లక్షణ వరోపలక్షితస్య" అని బుద్ధ దేవుడు వర్ణింపబడ్డాడు.

    ఎన్. వెంకట్రామణయ్య (హైద్. 1973) విష్ణుకుండినులు పు 52 పంక్తులు 14, 15.
11. ఎ. ఇం. XX, అప్పెండిక్స్ టెంపుల్ ఇన్స్క్రిప్షన్ నె. ఎఫ్
12. జె. మార్షల్ ఎండ్ ఎ. ఫూషర్ మాన్యుమెంట్స్ ఆఫ్ సాంచీ, చి. ప XXX VII-ఎ.
13. వి.ఎ. స్మిత్ : ది జైన స్తూపా ఎండ్ అదర్ ఏంటిక్విటీస్ ఫ్రమ్ మధుర (వారణాశి 1969) చి. ప. VII.
14. (i) "చంద్రార్థం, కలశం, త్రికోణ, ధనుషీ ఖంగోష్పదం పౌష్టికమ్

    శంఖం, చక్ర, యవాం, కుశ, ధ్వజ, పవి, జంబూర్ధ్వ రేఖాం బుజమ్"

    (ii) "గదా పునశ్శంఖ రథాంగ కల్పక ధ్వజా రవిందాం కుశ వజ్ర లాంఛనమ్"

(iii) శ్రీ వత్సం పూర్ణ కుంభంచ భేరీదర్పణ మండలమ్ మత్స్య యుగ్మంచ శంఖంచ చక్రం కాళ్యపనందన"

15. అమరావతి మ్యూసియమ్ ఎసిసి. నెం. 145 (చి. 2) జె. బర్గెస్ (i) ముందు చెప్పినది పు 98, చి. 30, చి. ప. LIII-I

డి. బారెట్ : ముందు చెప్పినది చి. ప. XLVII, (చి. 3)

16. జె. బర్గెస్ (i) ముందు చెప్పినది చి.ప. LII-బి; చి. ప. XLIII-14 ఎ-ఐ : 16 చి.ప. XXXVII.

ఎ. వహీద్ ఖాన్ : ముందు వచ్చినది చి.ప. V (చి. 4)

17. ఆర్కి. మ్యూసి. కొండాపూర్ ఎసిసినెం. 6036 (చి. 5)

18. టి. డబుల్యు వాట్టర్స్ : ఆన్ యువాన్ ఛువాంగ్స్ ట్రావె ల్స్ ఇన్ ఇండియా-II పు 15.

19. బి. ఎస్. ఎల్. హనుమంతరావు : రిలిజిన్ ఇన్ ఆంధ్ర (గుంటూరు 1973)పు 177 మొ.

20. బి. భట్టాచార్య : ది ఇండియన్ బుద్ధిస్ట్ ఐకొనోగ్రఫీ (కలకత్తా 1968) పు 11, 42.

హరప్రసాద శాస్త్రి (సం.) అద్వయ వజ్ర సంగ్రహ(బరోడా 1927) పు 23.

21. పశ్చిమ కోస్తాలోని కొండగుహలలో కొన్ని బుద్ధ శిల్పము లకు ముందు పీఠ భాగములో ఈ వజ్ర లాంఛనము చెక్క బడియుండుట గమనించ దగ్గది. సమాచారం : ప్రొఫెసరు మిత్తర్ వాల్నర్ నుండి. ఆమెకు మా కృతజ్ఞతలు.

22. బి.ఎస్.ఎల్. హనుమంతరావు : ముందు చెప్పినది పు 121.

23. అదే. పు 134, పాదసూచిక 82.

# కన్నీటికి మాటలువస్తే...

## శ్రీ కొంపెల్ల రామకృష్ణమూర్తి

ఏ చింత నిప్పుల్ని గుండెగులాబీలో దాచుకున్నావో
నీ నవ్వే చెప్తోంది !
మందమందంగా జ్ఞాపకాల సారంగి
మెలికలు తిరుగుతున్నప్పుడు
ఏమై పోతున్నావు నువ్వు ?
రెండు కళ్ళలోనూ తుమ్మముల్లు విరిగినట్టు
మెదడు మీద రంపపు పళ్ళు కదులుతున్నట్టు....
అయినా....ఓర్చుకోగలిగిన శక్తి
నీ కెలా వచ్చిందబ్బా !
ఒకలి ప్తపాటు—
నాలుక మీదున్న తడిని బెండుముక్కలా పీల్చేస్తూ
చిరుతీపిగా—అలా అలా గొంతులోంచి
గుండెమీదుగా రక్తంలోకి జారిన
నిద్రమాత్రలకు తెలుసు నీ ఆలోచనల లోతు!
అక్కడొక యుద్ధం—
ధవళవస్త్రాలు ధరించిన పటాలం ఒకటి
రక్తాంబరాలతో శిరస్త్రాణాలు ధరించిన దండు ఒకటి
ఎక్కడ ఏ ప్రాణం రాలిపోయినా
గజగజలాడి పోతావు
నిరంతర పరిభ్రమణం వాస్తవమే అయినా
కదిలినట్టే కనిపించని భూగోళంలా
కనురెప్పల మీద జీవితభారాన్ని మోస్తూ
మెలకువలాంటి నిద్రతో
నిద్రలాంటి మెలకువతో
ఏ శవాన్ని కౌగలించుకొని బావురుమనాలో
ఏ కొనప్రాణాన్ని ఊపిరి ఊది బతికించుకోవాలో
ఎలా నిర్ణయించు కోగలుగుతావు?
ఓ కన్నీరూ! నీ పేరేమిటి ?
మమతవా ? మగతవా ?
గిర్రున తిరుగుతూ నువ్వు రాలి పడబోతున్నప్పుడు
ఒక స్మృతిసౌధపు పునాదులు తునాతునకలౌతున్న
చప్పుడు

# ఈ మాసం - మీ నక్షత్రఫలం

## సెప్టెంబరు - 1988

**మేషం** (అశ్విని, భరణి, కృత్తిక 1పా)

అశ్వినివారికి గతనెల నుండి ప్రారంభమైన అనుకూల గ్రహస్థితి, ఈనెలలోకూడ కొనసాగుటయేగాక గతంకంటే మంచి ఫలితము నిచ్చును. ఉద్యోగాభివృద్ధి కలుగును. శుభకార్య ప్రయత్నములు నెరవేరును. విద్యార్థులకు అనుకూలంగా ఉండును. నెలచివరలో భార్యకు అనారోగ్యంచేసి నిమ్మళించును. నెలంతా మంచి అనుకూలముగా నుండును. శరీర శ్రమ మాత్రము కలుగుచుండును.

భరణివారికి నెలంతా శారీరక శ్రమా, ఉష్ణాధిక్యమూ, త్రిప్పటా కలుగును. ధనవ్యయం హెచ్చుగా జరుగును. ఆశలు, ప్రయత్నాలు, ప్రాకులాటలు, ఉత్సాహంతో జరిగినా, అక్టోబరునాటికి కొంతకొంతగా ఫలితము చేకూరుతుంది. అయితే శారీరకంగా, మానసికంగా శ్రమ తప్పదు. విద్యార్థులకు, ఉద్యోగులకు బాగుగానే ఉండును. కార్మిక, కర్షకులకు ఆశాభంగము తప్పదు. వర్తకులకు మంచిలాభంతోపాటు, దాన్నిమించిన వ్యయం జరుగును.

కృత్తిక 1. పా. వారికి శరీరశ్రమ కలుగును. ఆర్థికంగా తొట్రుపాటు, బంధుమిత్రాదులతో విరోధభావము కలుగును. కొంత వరకు చిక్కులుతగ్గి అనుకొన్న పనులు నెరవేరును. కాని శ్రమ హెచ్చు. ఫలితము తక్కువగానే యుండును. ధనవ్యయం మాత్రం అధికంగా జరుగును. కుటుంబ సంసారసౌఖ్యం, సంతానమునకు అన్ని విధాల విద్యాభివృద్ధి కలుగును.

**వృషభం** (కృత్తిక 2, 3, 4పా. రోహిణి, మృగశిర 1, 2 పా)

కృత్తిక 2,3,4పా. వారికి ఆర్థికంగా తొట్రుపాటు, మానసికముగా ఖేదము తప్పదు. తలకు మించిన పనులు తలపెట్టుటవలన లేనిపోని ఆడంబరములకు దిగుటవలన ధనవ్యయమేజరిగి, ఫలితంతగ్గిశ్రమ పడవలసి వచ్చును. పెట్టుబడికి, శ్రమకు ఫలితం "ఇదిగో, అదిగో" అని ఇంకా అనిపించుచునే ఉండును. ఆర్థికపు ఒడుదుడుకులు తప్పవు. 17 తే, నుండి మనోవ్యాకులత్వం ఉండును. అన్ని రంగముల వారికి ఇట్లే ఉండును.

రోహిణివారికి నెలంతా చిక్కులతోనే గడచును. మానసికంగా ఆందోళన కలుగును. కాని అకారణముగా పిరికితనము, మనోవైకల్యము కలుగును. ఎదుటివారివలన ఏమిమాటలు పడవలసివచ్చునేమో అనిపించును. చాలవరకు మౌనముగా,మితంగా ప్రవర్తించుట మంచిది. బంధువులు, మిత్రులు మొదలగు వారివలన ధనవ్యయం జరుగును, నెలాఖరునాటికి భార్యకు అనారోగ్యముచేసి నిమ్మళించును.

మృగశిర 1,2,పా. వారికి శుభాశుభమిశ్రమఫలం కలుగును. చిక్కుల ఉధృతం తగ్గిపోవును. జ్వరం విడిచిన తర్వాత తిరిగి బలం పుంజుకోడానికి కొంతకాలం పట్టినట్లే చెడురోజులుపోయినా, యోగము కలసిరావడానికి ఇంకా కొన్నాళ్లు పట్టును. గృహనిర్మాణాది ప్రయత్నమునకు వాయిదా పడును. ధనవ్యయము శుభకార్యముల నిమిత్తం జరుగును. అయితే శరీరశ్రమ హెచ్చుగానుండును.

**మిథునం** (మృగశిర 3, 4పా. ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3పా)

మృగశిర 3.4, పా. వారికి 12తే. వరకు బడలిక, ఒడలినొప్పులు. శ్రమకలుగును. ఉద్యోగులకు ప్రయోజనం కలుగును. విద్యార్థులకు ఉన్నత విద్యావకాశము, ఇంకా లభించనివారికి నెలాఖరు నాటికి అవకాశం లభించును. వ్యవసాయదారులకు నీటికి కటకట అనిపించినా తర్వాత అనుకూలవర్షము కలిగి బాగుగా ఉండును.

ఆర్ద్రవారికి శ్రమ అనిపించినా, ఫలితము అనుకూలంగానే ఉండును. భార్యకు నలతచేసి నిమ్మళించును. సోదరవర్గంవారితో విరోధము కలుగును. భార్య అనారోగ్యం గురించి ధనవ్యయం కలుగును. నెలంతా యోగం బాగుగానే ఉన్ననూ మొదటివారంలో ధనలాభం కలిగి, దానిమూలంగా కుటుంబంలో కలత నలతలు జరగడానికి అవకాశము కలుగును. ఉద్యోగవృత్తి రంగాలలో ఉన్నవారికి, విద్యార్థులకు మంచిమేలు కలుగును.

పునర్వసు 1,2,3, పా. వారికి అన్నివిధాలా శుభప్రదమైన కాలము. 4 - 16 తేదీల మధ్య ధనలాభము కలుగును. కార్యసిద్ధి సంతానమునకు అన్నివిధాలా అభివృద్ధి కలుగును. సంఘంలో మంచి పేరు ప్రతిష్టలు కలుగును, సభ, పుణ్యకార్యములలో పాల్గొనుట జరుగును. బంధుమిత్ర సమాగమము కలుగును.

**కర్కాటకం** (పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష)

పునర్వసు 4 పా, వారికి అన్ని విధములబాగున్నను శరీరశ్రమ హెచ్చుగానుండును. పిరికితనం హెచ్చు, వ్యయముకూడ ఆదాయము నకుమించి ఉండును. సంతానమునకు అన్ని విధముల అభివృద్ధి కలుగును. ధనము, ఉద్యోగ, వ్యాపార వ్యవసాయ రంగాలలో బాగుగా లాభించును. శుభకార్య ప్రయత్నములు నెరవేరును.

పుష్యమివారికి శరీరశ్రమ హెచ్చుగా ఉన్ననూ, ధనసిద్ధి, కార్యవిజయం,విద్యార్థులకుఉన్నత విద్యావకాశం,ఉద్యోగులకుతాత్కాలికంగాప్రమోషనుకలుగును. జ్యేష్ఠ సోదరస్థానమూలకంగా ధనవ్యయం కలుగును. ఉన్నతాధికారుల పరిచయమూలకంగా ఇంతవరకు పరిష్కారంకాని నిరాశ చేసుకొన్న పూర్వవ్యవహారములు అనుకోకుండా కొంతరాజీమార్గంగా పరిష్కారమగును. అయితే శరీరంలో నలత జరుగుచుండును.

ఆశ్లేషవారికి ఇంకా వ్యవహారపు చిక్కులు 11తే. నుండి ప్రారంభమగును. చేజేతులా తెచ్చిపెట్టుకొన్నవి కొన్ని, ఆత్మీయులు చేసిన ద్రోహంచేత కొన్ని చిక్కులు తెచ్చిపెట్టుకొనుట జరుగును. ఎటూతేలక వాయిదా పడుచుండును. ఏపనిచేసినా, అధిక ధన వ్యయానికి, శారీరక, మానసిక శ్రమకీ దారితీయును. వ్యవసాయదార్లకు, వర్తకులకు, గతంకంటే కొంచెం మేలుగా ఉండును. అయితే భవిష్యత్తు ఆశాజనకంగా ఉంటుంది.

**సింహం** (మఘ, పుబ్బ, ఉత్తర 1 పా.)

మఘవారికి 11 తే వరకు శరీరశ్రమతోనే గడుచును. భార్య ఆరోగ్యవిషయంలో జాగ్రత్త అవసరం. పరిష్కారం కావలసిన వ్యవహారములలో, శుభకార్య వ్యవహారములలో కూడా ప్రతిష్టంభన తిరిగి ఏర్పడును. నెల ప్రారంభంలో భార్యకు స్వల్పంగా నలతచేసి నిమ్మళించును. నెలంతా సమస్యలతో సతమతమగుట జరుగును. శనికి జపం చేయించుట మంచిది.

పుబ్బవారికి శుభాశుభమిశ్ర ఫలం కలుగును. శరీరశ్రమ ఉష్ణాధిక్యం, ఆందోళనము, మనోవ్యాకులత్వం, మొదలగునవి కలుగును. శ్రమా, త్రిప్పటా కలుగును. శ్రమకు తగిన ఫలితం కలుగును. వృత్తి వ్యాపారాదుల్లో మంచి ప్రోత్సాహం ఉండును. ధన వ్యయం హెచ్చుగా నుండును.

సంఘంలో మంచి పేరు ప్రతిష్టలు కలుగును. కుజునకు జపం చేయించుట మంచిది.

ఉత్తర 1 పా. వారికి 17 - 24 తే.ల మధ్య శరీర శ్రమా, తిప్పటా, ధనవ్యయం మొదలగునవి జరుగును. శరీరంలో అతివేడిమి కలుగును. అష్టమ కుజుని వలన లగ్జరీ ఖర్చులు ఆడంబరాలతో కూడిన జీవనము, అధిక వ్యయానికి దారితీయును. వర్తకులకు సామాన్యలాభం, విద్యార్థులకు శ్రమతోకూడిన కార్యసిద్ధి, వ్యవసాయదార్లకు మేలు కలుగును. కుజునకు జపశాంతులు చేయించుట మంచిది.

**కన్య** (ఉత్తర 2, 3. 4 పా. హస్త, చిత్ర 1, 2 పా.)

ఉత్తర 2, 3, 4, పా. వారికి శ్రమ హెచ్చుగాను, సుఖం తక్కువగా నుండును. బంధువులతో అకారణ కలహం, విద్యార్థులకు తాత్కాలిక విద్యా విఘ్నము, శుభకార్యములకు ఆటంకములు కలుగును. భార్యకు స్వల్పంగా నలతచేసి నిమ్మళించును. ఉద్యోగాభివృద్ధి బాగుగా నుండును. ఇతరులకు మొగమాటం వలన ఇచ్చిన సొమ్ము తిరిగి రాబట్టుకొనుటలో కొన్ని బాధల నెదుర్కొనవలసి వచ్చును.

హస్తవారికి శనిదోషం వలన ఎన్ని విధముల కలసి వచ్చినను అసంతృప్తి మనఃఖేదం. త్రిప్పట, అలసట, ఏ రోగంలేకుండానే అస్వస్తతగా ఉండుట జరుగును. ఉద్యోగులు, వర్తకులు, వ్యవసాయదార్లు మొదలగు అన్నిరంగములవారికి కార్యసిద్ధి, ధనలాభం కలుగును. శుభకార్య ప్రయత్నములు వాయిదా పడును. భార్యకు నలతచేయును.

చిత్ర 1, 2, పా. వారికి 12 తే. వరకు శరీరశ్రమ, ఆర్థికంగా తొట్రుపాటు, మనస్సుకు ఆందోళనము కలుగును. ఆ తర్వాత వ్యవహార విజయం, శుభకార్యానుకూలత కలుగను. ధనవ్యయం జరిగినా కొన్ని ఒడుదొడుకులు తట్టుకొని నిలబడినా నెలాఖరునాటికి అన్ని శుభ పరిణామానికి అనుకూలంగా వీలును కలిగించును.

**తుల** (చిత్ర 3, 4 పా. స్వాతి, విశాఖ 1, 2, 3 పా.)

చిత్ర 3,4పా. వారికి 12తే వరకు కొన్నిచిక్కులు, వ్యవహారాల్లో ఆటంకాలు, ఉద్యోగంలో ఒడుదుడుకులు, వ్యాపారంలో పెట్టుబడికి తొట్రుపాటు మొదలయినవి జరుగును. 12 తే. దాటిన తర్వాత అన్ని పనులు, వ్యవహారాలు వాటంతటవే అనుకూలంగా పరిష్కారం కాగలవు. శుభ కార్యములలో మంచిప్రోత్సాహం, అధికారులతో మైత్రికలుగును.

స్వాతివారికి నెలంతా చిక్కులతోనే గడచును. సోదరవర్గంతో విభేదములు వచ్చును. వ్యవహారములలో ప్రతిష్టంభన ఏర్పడును. 15 తే. దాటిన తర్వాత అనుకోని చిక్కులు కలుగును. ఉద్యోగులకు, వ్యవసాయదారులకు, విద్యార్థులకు అన్ని ప్రయత్నాలూ అనుకూలంగా ఉండును. మొత్తంమీద శ్రమహెచ్చు, ఫలితం తక్కువగా నుండును.

విశాఖ 1,2,3పా గతమాసం కంటె ఈ నెలకూడ శుభఫలాను కూలంగా ఉండును. ధనవ్యయం హెచ్చుగా నుండును. వివాహాది శుభ కార్యములు నెరవేరును. కుటుంబ సంసారసౌఖ్యం బాగుగానుండును. విద్యార్థులకు, ఉద్యోగులకు, కర్షక, కార్మిక వర్గాలకు, ఇతరవృత్తులలో నున్నవారికి కూడకొంత శ్రమవున్నా, మంచిఉత్సాహం, ఆయావృత్తుల ననుసరించి కార్యసిద్ధి శుభఫలం కలుగును. అయితే శ్రమ హెచ్చుగా నుండును.

## వృశ్చికం (విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

విశాఖ 4పా. వారికి గతమాసంలో ప్రారంభమైన శుభఫలితం కొనసాగును. విద్యార్థులకు ఉన్నత విద్యావకాశం కలుగును. గృహస్థులకు ధనలాభం, సువర్ణ వస్త్రాభరణప్రాప్తి, నూతనవస్తు సంపాదనము కలుగును. వర్తకులకు, క్రయంలోను, విక్రయంలోను మంచిలాభము కలుగును. రాజకీయాలలో నున్నవారికి అధికార - అనధికార పదవులు లభించును. అనేకవిధాల కలసివచ్చినను సంతృప్తి సరిగానుండదు.

అనూరాధ వారికి 19తే. నుండి శరీరశ్రమ, అధికవేడిమి కలుగును. భార్యకు నలత చేయును. మానసికశ్రమ ఆందోళన, స్వల్పంగా అనారోగ్యం, విపరీతమైన ధనవ్యయం కొనసాగును. ఆదాయమునకు మించిన ఖర్చులు పెరుగును. అయితే సంఘంలో మాత్రం గౌరవం బాగుండును. విద్యార్థులకు విద్యారంగంలో బాగుండును.

జ్యేష్ఠ వారికి కొంత మేలుగా ఉండును. ఆదాయం పెరిగి స్థిరాస్తి సంపాదన జరుగును. ప్రయత్నాలు చిన్నవైనా, దైవబలం వలన పనులు నెరవేరి పోవుచుండును. అయితే మాతృవర్గం వారితో అభిప్రాయ భేదములు వచ్చును. 11తే. నుండి శారీరక - మానసిక శ్రమ, త్రిప్పుట కల్గును. శ్రమ హెచ్చుగాఉన్నా, తనకు తెలియకుండానే ఆటంకాలు తొలగి పోవుచుండును.

## ధనుస్సు (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

మూల వారికి ఇంకాచిక్కులు వదలలేదు. కొన్నాళ్ళు ఇంకా ఇలాగే కొనసాగును. మొదటివారంలో స్త్రీమూలక ధనవ్యయం,భార్యకు నలతకలుగును. మానసికశ్రమ, వ్యయం, ఆందోళన, స్వల్పంగా అనారోగ్యం, విపరీతమైన ధనవ్యయం, కొనసాగును. శుభకార్య ప్రయత్నములకు ఆటంకములు కలుగును. భార్యవర్గము వారితో విరోధము కలుగును. శరీరశ్రమ హెచ్చు.

పూర్వాషాఢ వారికి శరీరశ్రమ, అధికవేడిమి, ఆందోళనము, పనికిమాలిన ఆలోచనలు, ధనవ్యయం మొదలగునవి కలుగును. అప్పుడప్పుడు ఆరోగ్యం ఀగమగచుండును. శుభకార్య ప్రయత్నములకు ఆటంకాలు జరుగును. వ్యవహారాదుల్లో ప్రతిష్టంభన తొలగిపోయి క్రమంగా అనుకూల పరిస్థితులేర్పడును. కాని శారీరక-మానసికశ్రమ కొనసాగును. విద్యార్థులకు సామాన్యంగా ఉండును.

ఉత్తరాషాఢ1పా వారికి మంచి అనుకూలంగానే ఉంటుంది. గురునిశ్చక గతివలన ఎంత ప్రయత్నంచేసినా, శుభకార్యప్రయత్నాలు ఉద్యోగప్రయత్నాలు, గృహనిర్మాణ ప్రయత్నాలు అనిశ్చితంగానే ఉంటాయి. ధనలోపం లేకపోయినా అనుకూలంగా పనులు జరగడం తక్కువ. వ్యవసాయదార్లకు, వర్తక-ఉద్యోగ-విద్యారంగాలలోనున్న వారికి బాగుగా కలసివస్తుంది. 17-27తే.ల మధ్య భార్యకునలతచేసి నిమ్మళించును.

## మకరం (ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ట 1-2 పా)

ఉత్తరాషాఢ 2, 3, 4పా. వారికి శరీరశ్రమహెచ్చు. అయితే ఆర్థికంగా మంచి లాభంకలుగును. ప్రతిపనిలోను విజయం, సంఘంలో మాట పలుకుబడి, బంధువులలో గౌరవము, ప్రజలలో పేరుప్రతిష్టలు వృద్ధియగును. ధనవ్యయం హెచ్చుగానుండును. 17తే. దాటిన తర్వాత భార్యకు నలత చేయును. ఎన్నివిధాల కలసివచ్చినను, సంతృప్తి తక్కువగా నుండును. ఉద్యోగులకు వర్తకులకు బాగుగాఉండును.

శ్రవణం వారికి ఇంకా చెడురోజులు తొలగిపోలేదు. 13-15తే.ల మధ్య శరీరంలో నలతచేసి నమ్మళించును, పనికిమాలిన ఆలోచనలతో కాలంగడుపును. శ్రమహెచ్చుగా నుండును. ధనము అధికంగా ఖర్చగుచుండును. మనోవ్యాకులత్వం కలుగును. ఊరికే ఊహలని, ఆశలని పెంచుకోవడంకంటె ఏదో కొంత ప్రయత్నం చేయడంమేలు.

ధనిష్ట 1, 2పా వారికి 12తే. వరకు నలత శ్రమ కలిగినను, వ్యవహారాల్లో విజయం, బంధుమిత్రులతో అనుకూలత కలుగును. పుష్కలంగా ధనలాభం కలిగినా, శుభకార్యాల నిమిత్తం ధనవ్యయం హెచ్చుగానుండును. సంఘంలో మాటగౌరవం కలుగును. విద్యార్థులకు, వర్తకులకు, ఉద్యోగులకు మొత్తం అన్నిరంగాలవారికి మంచి ప్రోత్సాహంగా ఉండును.

## కుంభం (ధనిష్ట 3, 4 పా. శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పా)

ధనిష్ట 3, 4పా. వారికి మొదటి వారంలో భార్యకు అనారోగ్యం చేసి నిమ్మళించును. గతనెలనుండి ప్రారంభమైన శుభఫలితం ఇంకా కొనసాగును. అధికవ్యయం జరుగుచున్నా, కొంతవరకు ఆదాయం పెరుగును. ఉద్యోగులకు, వ్యవసాయ దారులకు మంచి అనుకూలమైన ... ్యార్థులకు శ్రమతో కార్యసిద్ధి, ... దాటిన తర్వాత

ఆరోగ్యవృద్ధి యగును, శుభకార్య ప్రయత్నములు నెరవేరును. పుణ్య కార్యములలో పాల్గొనుట జరుగును.

శతభిషం వారికి 13తే. నుండి క్రొత్త చిక్కులు ఏర్పడును. చిన్న చిన్న ఒడుదుడుకులతోనే గడచును. ప్రతిపనీ పేచీలకు, తగాదా లకు దారితీయును. అయితే కొంత దైవబలం కలసిరావడంతో పెద్దగా శ్రమ పడవలసిన పని ఉండదు. కాని కొన్ని చిక్కులు మరికొన్ని చిక్కులకు దారితీస్తూ ఉంటాయి. భార్యకు నలతచేయును ఆదాయము నకు మించిన వ్యయం జరుగుచుండును.

పూర్వాభాద్ర 1,2,3పా వారికి మొదటివారంలో మధ్య మధ్య ఆరోగ్యభంగమగును. మిగిలిన అన్నివ్యవహారములు బాగుగానుండును. ఇదివరకు శత్రువులుగా ఉన్నవారుకూడ ఈ నక్షత్రంవారితో స్నేహాన్ని పాటిస్తారు. అధికారుల మన్నన కలుగును. ఉద్యోగులకు, విద్యార్థులకు వర్తకులకు, వ్యవసాయదారులకు మంచి అనుకూలమైనకాలము.

### మీనం (పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి)

పూర్వాభాద్ర4పా వారికి కొంతమేలుగా ఉండును. కుటుంబంలో సుఖశాంతులు కలుగును. ధనలాభంబాగుగానే ఉండును. సంతానము వలన కొంచము వ్యథకలుగును. సంఘంలోకొన్ని ప్రతిఘటనలు ఎదుర్కోవలసి వచ్చును. అయితే శ్రమహెచ్చుగాను, సుఖము తక్కువగా నుండును. విద్యార్థులకు, ఉద్యోగులకు సామాన్యంగా నుండును.

ఉత్తరాభాద్ర వారికి నెలంతా శరీరశ్రమ, ఉష్ణాధిక్యం, ఒడుదుడు కులు, మనోవైకల్యం, శరీరంలో నలత, మొదలగునవి జరుగును. మధ్యమధ్య భార్యకు ఆరోగ్యం భంగమగు చుండును. ధనము అధికంగా ఖర్చగుచుండును. స్త్రీలగురించి, భార్య అనారోగ్యం గురించి వ్యయం జరుగును. మనస్సులో అప్పుడప్పుడు పిరికితనం కలుగుచుండును.

రేవతి వారికి 11తే నుండి కొంచెము శరీరశ్రమ కలుగును. అయితే హెచ్చుగా భాగంఆడంబరం, దర్జా, హోదా, తాహతకు మించిన పనులకు దిగుటవలన కొన్నిచిక్కులు ఎదుర్కోవలసి వచ్చును. మాటలు చెప్పినంతగా చేతలు ఉండక పోవుటవలన, సంఘంలో చాలామంది జనులలో వ్యక్తిగతంగా విలువ తగ్గిపోవును. అయినను మాటనేర్పరి తనంవల్లనే అన్నిపనులు సాధించుకొనుట జరుగును.

సిద్ధాంతి: **నిష్ఠల వేంకట సత్యసుబ్రహ్మణ్యం**

# ఆ కోపానికి అర్థం

## శ్రీ అడిగోపుల వెంకటరత్నమ్

నడుస్తున్నా....
వెలుగుతున్న వీధి దీపాలక్రింద వెలుగుకోసం
టార్చిలైటు వెలిగించుకొంటూ!
వీధి దీపం నవ్వింది
నాకు కోపం వచ్చింది!

నడుస్తున్నా....
రోడ్డుపై కాళ్ళల్లో దిగుతున్న
శూలాల్లాంటి రాళ్ళను తీసుకొంటూ!
రోడ్డు నవ్వింది
నాకు కోపం వచ్చింది!

నడుస్తున్నా....
ఆ ఇంటి ముందున్న మొక్క
పూల కుండీని మోటుగా తిడుతూంది
మాను అవ్వాల్సిన తనను మొక్కలా పెంచినందుకు!

నడుస్తున్నా....
నడుస్తూ ఆలోచిస్తున్నా
అర్థమైంది
ఇందాకటి నవ్వుల్లోని నిప్పురవ్వలు!

శ్రీ వే. వేమూరి

# తైర ఆల్కహాలీయం

**నాంది:**

ఆల్కహాలు! గుల్మామందు!! మార్చి 88 భారతిలో ఈ మందు ప్రవర గురించి కొంతవరకు ప్రస్తావించడం జరిగింది. ఈ మందు ప్రభావంవల్ల మనస్సుకి తాత్కాలికమైన ఆనందం కలిగినా, బుడ్డికి బానిసలయినవాళ్ళ ఒళ్ళు గుల్ల అవుతుందని దరిమిలా అంతా ఒప్పుకున్న విషయమే. ఒక్క ఒళ్ళేమిటి? దేశాలే గుల్లయిపోతున్నాయిట! ఆల్కహాలుకి బానిసలయిన ప్రజలవల్ల, అమెరికా దేశంలో, ప్రతి ఏటా 107 బిలియను డాలర్ల నష్టం వస్తున్నాదని అంచనా వేసేరు. అమెరికాలో బిలియను అంటే ఒకటి తర్వాత తొమ్మిది సున్నలు చుడతారు. (ఇంగ్లండులో పన్నెండు సున్నలు చుడతారు.) ఈ నష్టాన్ని రూపాయల్లో లెక్కవేస్తే లక్ష కోట్ల రూపాయల పైచిలుకు అవుతుంది. వివరంగా లెక్కలు తెలియవుకాని, బుడ్డి బానిసత్వంవల్ల రష్యా ఆర్థికస్థోమత విచ్ఛిన్నం అయిపోతున్నాదని శ్రీ గోర్బచెవ్ హెచ్చరించేరుట. భారతదేశపు పరిస్థితి నాకు తెలియదు. అంతర్జాతీయంగా ఇంత హడావిడి చేస్తూ వున్నది ఒక్క ఎతల్ ఆల్కహాలు మాత్రమే. ఆల్కహాలు జాతికి చెందిన తదితర ఒలంతాలెన్నో శరీరానికి ఎంతో ఉపకారం చేస్తాయి ('ఒలంతం' అన్నమాటని ఆల్కహాలు జాతికి నేను పెడుతూన్న తెలుగు పేరు. ఒలంతం అంటే 'ఒల్' శబ్దంతో అంతం అయ్యేవి అని అర్థం చెప్పుకోవాలి.)

## 1. పిప్పరమింట్లు, విటమినులు:

మనందరికీ సుపరిచితమైన ఆల్కహాలు ఒకటి ఉంది. దానిని ఇంగ్లీషులో 'మెంతాల్' అంటారు. లేటిన్ భాషలో 'మెంత్' అనేది పొదీనా ఆకుని సూచిస్తుంది. ఇంగ్లీషులోని 'మింట్' అన్నమాట ఈ 'మెంత్' నుండి వచ్చినదే. ఈ మింట్‌లో ఉండే ఆల్కహాలు పేరు 'మెంత్+ఒల్' వెరసి 'మెంతాల్' అయింది. ఈ మెంతాల్‌ని నోట్లో వేసికొన్నా, శరీరానికి పులుముకున్నా, చల్లగా, ఆహ్లాదకరంగా వుంటుంది. అందుకనే, ఈ మెంతాల్‌ని పిప్పరమింటు బిళ్ళలలోనే కాకుండా, మందులలోనూ, గెడ్డం గీసుకొనే సబ్బుల్లోనూ, ఆఖరికి సిగరెట్లలోనూ కూడ కలుపుతారు.

ఈ మెంతాలు మాట అటుంచి, మన శరీరానికి నిజంగా మంచి చేసే ఒలంతాల సంగతి చూద్దాం. కేరట్ దుంపలు, వగయిరా, పసుపు డాలు కల పదార్థాలలో 'కేరొటీన్' అనే మరొక పదార్థం వుంది. ఈ కేరొటీను ఎనిమిది 'ఐసోప్రీన్' బణువులని దండగా గుచ్చితే వచ్చే పదార్థం. ఒకొక్క ఐసోప్రీను బణువు ఒక్కంటికి అయిదేసి కర్బనపు టణువుల చొప్పున, ఒక కేరొటీన్ బణువులో మొత్తం నలభయి కర్బనపు టణువులు వున్నాయి. ఐసోప్రీను బణువులో జంట బంధాలున్నాయి. కనుక కేరొటీనులో కూడ జంట బంధాలున్నాయి. వీటిలో ఒక జంటబంధం ఈ కేరొటీను బణువు నడిమధ్యన ఉంది. మనం తినే ఆహారంలోని కేరొటీను, మన శరీరంలోని జీవ రసాయనిక ప్రక్రియలకి లోనయినప్పుడు, ఈ నడిమధ్యనున్న జంటబంధం తెగిపోతుంది. అంటే, ఒక దండరూపంలో ఉన్న కేరొటీన్ బణువు తెగి రెండు అర్థదండలు అయిందన్నమాట. ఇలా తయారయిన అరదండల దాపుకి రెండు 'హైడ్రాక్సిల్' గుంపులు చేరి, వాటిని రెండు ఆల్కహాలు బణువులుగా మార్చేస్తాయి. ఈ విధంగా తయారయిన ఆల్కహాలు బణువులే విటమిన్ ఎ.

అంటే, శరీరంలో విటమిన్ ఎ తయారు అవాలంటే, శరీరానికి మనం కేరొటీన్‌ని సరఫరా చెయ్యాలి. ఈ విటమిన్ ఎ సరిపడినంత మోతాదులో శరీరంలో లేకపోతే, ఆ ఆసామీకి రేచీకటివంటి కంటి జబ్బులు వస్తాయి. ఇక్కడ చిన్న మడతపేచీ ఒకటి వుంది. మన శరీరంలోని యంత్రసామగ్రి కేరొటీను బణువుని మధ్యకి విరిచి విటమిన్ ఎ ని తయారుచెయ్యగలదు కానీ, చిన్న చిన్న బణువులనీ, అణువులనీ, దండగా గుచ్చి మాత్రం చెయ్యలేదు. అంటే, మరోలా చెప్పాలంటే, శరీరానికి విటమిన్ ఎ ని సంశ్లేషణ (సింథసిస్) చేసే ప్రతిభ లేదు. కనుక, శరీరానికి విటమిన్ ఎ ని సరఫరా చెయ్యాలంటే మనం కెరొటీన్ వున్న పదార్థాలు తిని తీరాలి. పాలు, వెన్న, గుడ్లు, మొదలయిన జంతు సంబంధమయిన పదార్థాలలో విటమిన్ ఎ యథాతథంగా లభిస్తుంది. పచ్చరంగు కల కాయగూరల్లో, విటమిన్ ఎ, నిజ రూపంలో కాకుండా, కేరొటీన్ రూపంలో లభిస్తుంది. మనం కేరొటీన్ వున్న కాయగూరలు తిన్నప్పుడు, మన శరీరం ఈ కేరొటీన్‌ని మధ్యకి విరచి, విటమన్ ఎ ని తయారుచేసికొంటుంది.

మన శరీరం తనకి కావలసిన పదార్థాలెన్నిటినో తనే చేసికొంటుంది. కాని, కావలసిన వాటినన్నిటినీ తయారుచేసికోగలిగే సామర్థ్యం మాత్రం మన శరీరానికి లేదు. వీటిల్లో కెరోటీన్ ఒకటి. ఈ కేరోటీన్‌ని విరగ్గొడితే కాని విటమిన్ ఎ తయారవదు. ఈ విటమిన్ ఎ యొక్క సరఫరా దినదినం జరగకపోతే రేచీకటివంటి కంటి వ్యాధులు రావడమే కాకుండా, ముక్కులోనూ, నోట్లోనూ, కళ్ళల్లోనూ వుండే చెమ్మటి పొరలు ఎండిపోయి, పొలుసుల్లా అయి ఊడిపోతాయి. ఈ రోగ లక్షణాలన్నిటిని గుత్తగుచ్చి ఇంగ్లీషులో 'జీరోప్తాల్మియా' అంటారు. గ్రీకు భాషలో 'జీరో' అంటే పొడిగా వుండడం (తడి లేకపోవుట అనే భావం) అనిన్నీ, 'ఆప్తాల్' అంటే కంటికి సంబంధించినదనిన్నీ అర్థం. కనుక 'జీరోప్తాల్మియా' అంటే పొడిగా, ఎండిపోయిన కళ్ళు అని అర్థం. విటమిన్ ఎ కళ్ళని చెమ్మగా వుండేటట్లు చేస్తుంది గనుక, దీనికి 'అజీరోప్తాల్' అనే నామధేయం ఒకటి వుంది. 'అ' అంటే కాదు, జీరో అంటే పొడి, 'ఒల్' ఆల్కహాలుని సూచిస్తుంది. కనుక అజీరోప్తాల్ కళ్ళని తడిగా వుంచే ఆల్కహాలు అని అర్థం. ఈ మాటని తెలుగులో అశోషణాల్ అనొచ్చు. ఈ విటమిన్‌కి ఇంగ్లీషులో మరొక పేరుంది. ఇది కంటికి మంచిది కనుకనున్నూ, కంటి వెనకనున్న ఒక పొరని 'రెటీనా' అని అంటారు కనుకనున్నూ, ఇది 'ఒల్' శబ్దంతో అంతం అవాలి కనుకనున్నూ, విటమిన్ ఎ ని 'రెటినాల్' అని కూడ అంటారు. ఇన్ని మంచి వ్యుత్పత్తి అర్థాలు వున్న పేర్లు ఉండగా, ఈ 'విటమిన్' అన్న పేరెలా వచ్చిందో చూద్దాం. లేటిన్ భాషలో 'విట్' అన్న మూలానికి ప్రాణమనీ, ముఖ్యమయినదనీ నానా అర్థాలు వున్నాయి. రసాయనిక పరిభాషలో 'ఎమైన్' అన్నమాట నత్రజని వున్న పదార్థాల పేళ్ళతో వస్తూవుంటుంది. (ఈ ఎమైన్‌నుండి వచ్చినవే అమోనియా, 'ఎమైనో ఏసిడ్' మొదలైనవి.) ఈ 'విట్'ని 'ఎమైన్'తో సంధిస్తే 'విటమిన్' వచ్చింది. విటమినుల కథ, కమామీషు తెలియనిరోజుల్లో, విటమినులలో ఎమైనులు వుండకపోతాయా అన్న అజ్ఞాన అహంకారం ప్రబలంగా వున్న రోజుల్లో పెట్టిన పేరీ విటమిను. ఉత్తరోత్తరాకి నిజం తెలిసింది. పిల్ల చచ్చినా ప్రసూతి వాసన పోలేదన్నట్లు పేరు మిగిలింది.

## 2. కొలెస్టరాళ్ళు, విటమినులు :

విటమిన్-ఎ మన శరీరానికి ఉపయోగపడే ఆల్కహాలు. కాని విటమినులన్నీ ఒలంతాలు అవాలన్న నిబంధన ఏదీ లేదు. అలాగని ఒలంతాలయిన విటమినులు ఇంకా లేకపోనూ లేదు! ఉదాహరణకి, విటమిన్-డి కూడ ఈ ఆల్కహాలు జాతికి చెందినదే. ఈ విటమిను గురించి తెలిసికోవాలంటే కొంత పూర్వ వృత్తాంతము సమీక్షించాలి.

ఒలంతమయిన పదార్థాలలాగే, కొన్ని "అర్థాంతం" అయిన పదార్థాలు కూడ ఉన్నాయి. స్ఫటికాకారం గల పదార్థాలన్నిటిని గుత్తగుచ్చి "స్ఫటికార్థాలు" (క్రిస్టలాయిడ్స్) అనీ, జిగురుగా వుండే పదార్థాలని 'జిగార్థాలు' (కొల్లాయిడ్స్) అనీ, కొవ్వువంటి పదార్థాలని 'ఘృతార్థాలు' (స్టీరాయిడ్స్) అనీ అనవచ్చు. ఈ ఘృతార్థాల



నిర్మాణక్రమం చాల క్లిష్టమయినది. టూకీగా చెప్పాలంటే, ఘృతార్థా లన్నిటిలోను మూడు షడ్భుజాకారపు చక్రాలు, పంచభుజి ఆకారంలో మరొక చక్రం అమర్చబడి వుంటాయి. ఈ మూల రూపానికి రక రకాల పక్క గొలుసులు తగిలిస్తే వివిధమైన రసాయనిక పదార్థాలు లభిస్తాయి. ఉదాహరణకి, షడ్భుజాకారపు చక్రానికో మూలని 'హైడ్రాక్సిల్' గుంపు తగిలిస్తే, ఆ ఘృతార్థం ఒక ఆల్కహాలుగా మారుతుంది. ఆల్కహాలు పేరు చివర 'ఒల్' శబ్దం వుండాలి గనుక, యీ రకం ఆల్కహాలుని ఇంగ్లీషులో 'స్టిరాల్' అంటారు. వీటిని తెలుగులో 'ఘృతాల్'లు అనవచ్చు. ఈ ఘృతాల్ జాతికి చెందిన ఆల్కహాళ్ళలో పేరు మోసిన ఆల్కహాలొకటి వుంది. దాని పేరు 'కోలెస్టరాల్'. గ్రీకు భాషలో 'కోల్' అంటే పైత్యరసం అనే అర్థం వుంది. 'కోల్'ని 'స్టిరాల్'తో సంధిస్తే 'కోలెస్టరాల్' వస్తుంది. పైత్యరసం కాలేయంలో తయారవుతుంది. ఈ పైత్యరసంలో కోలెస్ట రాల్ మెండుగా వుంది గనుక, కోలెస్టరాల్‌ని తెలుగులో 'పైత్య ఘృతాల్' అనొచ్చు. పాలల్లో అంతర్గతంగా వెన్న ఎలాగుంటుందో, అదేమాదిరి పైత్యరసంలో అంతర్గతంగా పైత్యఘృతాల్ వుంటుంది. అప్పుడప్పుడు, పైత్యరసంలో ఈ పైత్యఘృతాల్ పాలు పెరిగి, చిన్న చిన్న స్ఫటికాలలా తయారవుతాయి. క్రమేపీ ఈ స్ఫటికాలు పెరిగి, చిన్న చిన్న కఠినమైన రాళ్ళలా తయారవుతాయి. ఈ రాళ్ళని ఇంగ్లీషులో 'గాల్‌స్టోన్స్' అంటారు. వీటిని తెలుగులో పైత్యపు బెడ్డలు అని అనొచ్చు! పిత్తాశయం దగ్గర కాని, పిత్తనాళం దగ్గర కాని ఇటువంటి బెడ్డలు చేరితే కడుపులో విపరీతమైన నొప్పి పుడు తుంది. శస్త్రచికిత్స చేసి తియ్యవలసిందే కాని, మందులకీ మాకులకీ లొంగే రాళ్ళు కావివి. (శస్త్రచికిత్స చెయ్యకుండా, ధ్వని తరంగాలతో ఈ రాళ్ళని చూర్ణంచేసే కొత్త పద్ధతులొచ్చేయి ఈ మధ్య.) ఈ పైత్యపు బెడ్డలు దరిదాపు పరిశుద్ధమయిన కోలెస్టరాల్‌తో తయా రయిన రాళ్ళు కనుక, వీటిని 'కొలెస్టరాళ్ళు' అనచ్చా?

కొలెస్టరాల్ రక్తంలో కూడ వుంటుంది. కాని మోతాదు మించితే, ఈ కొలెస్టరాల్ రక్తనాళాల గోడలకి అంటుకోవడం మొదలు పెడుతుంది. కాలవలో చెత్త, చెదారం చేరినప్పుడు, అవి నీటి ప్రవా హాన్ని ఎలా ఆటంకపరుస్తాయో, అలాగే రక్తనాళాల గోడలకి అంటు కున్న కోలెస్టరాలు రక్తప్రవాహానికి ఆటంకం కలుగజేస్తుంది. క్రమేపీ ఈ ఆటంకం పెరిగి రక్తప్రవాహాన్ని పూర్తిగా బందు చేస్తుంది. ఈ ప్రక్రియ ఏ రక్తనాళంలోనైనా జరగొచ్చు. ఈ వ్యవహారం అంతా గుండెకాయకే రక్తం సరఫరా చేసే ధమనిలో జరి గితే, గుండె ఆగిపోయే ప్రమాదం వుంది. ఈ పరిస్థితిని 'హార్ట్ ఎటాక్' అంటారు. కోలెస్టరాలు ఈ విధంగా పేరుకొని, మెదడుకి రక్తాన్ని అందించే నాళాలలో ప్రవాహాన్ని ఆటంకపరిస్తే వచ్చే ప్రమాద పరిస్థితిని ఇంగ్లీషులో 'స్ట్రోకు' అంటారు. ఈ విధంగా స్ట్రోకు వచ్చినవారికి పక్షవాతం రావచ్చు, ప్రాణమే పోవచ్చు. కోలెస్టరాలు ఘృతార్థం కనుక, హార్ట్ ఎటాక్ కాని, స్ట్రోక్ కాని వచ్చి, అదృష్టం బావుండి, బ్రతికి బయటపడ్డవాళ్ళు, ఆహారంలో కొవ్వు పదార్థాలు తగ్గించాలి అని వైద్యులు చెబుతారు. ఇలాంటివన్నీ తెలిసీ తెలియని మిడిమిడి జ్ఞానంతో చెయ్యకుండా నిపుణులని సంప్రదించి మరీ చెయ్యాలి.

ఈ కథనం అంతా చదివిన తర్వాత, కోలెస్టరాలు ఎల్లప్పుడూ కీడే చేస్తుందని తీర్మానించడానికి వీలులేదు. నిజానికి మోతాదు మించి నంతసేపూ, ఈ కోలెస్టరాలు మన మనుగడకే ఎంతో ముఖ్యం. ఆ మాటకొస్తే మన మెదడు అంతా దరిదాపు ఈ కోలెస్టరాల్‌తో చెయ్య బడ్డ పదార్థమే! అంటే, మెదడు అంతా పిత్తఘృతాలు అన్నమాట. పైత్యరసంనుండి ఉద్భవించిన పిత్తఘృతాలుతో చెయ్యబడ్డ పదార్థమే మన పుర్రెలో వున్న పక్షంలో, పైత్యానికీ, తెలివికీ పెద్ద తేడా లేదేమో! తెలివయిన ఘటాలు కొందరు, అప్పుడప్పుడు, పిచ్చిపిచ్చిగా ప్రవర్తించడం మనం చూస్తూనే వుంటాము.

### 3. వెలుగు విటమినులు :

ఘృతాలులకీ, సూర్యరశ్మికీ కొంత పరస్పర మైత్రి ఉందన వచ్చు. సూర్యరశ్మి తగిలినప్పుడు, ఘృతార్థాలలో వుండే షడ్భుజా కారపు చక్రాలు కొన్ని విరిగిపోతాయి. బణువులు ఇలా విరిగినప్పుడు మిగిలిన ముక్కలలో కొన్నిటిని మనము 'విటమిన్-డి' అని అంటాము. కెరోటీన్‌ని విరిపితే విటమిన్-ఎ వచ్చినట్లే, ఘృతార్థాలని విరగ్గొడితే విటమిన్-డి వస్తుంది. సూర్యరశ్మి సహాయం లేకుండా, మన శరీరం తనంతట తాను ఈ విటమిన్-డిని తయారు చెయ్యలేదు.

విటమిన్-డిలో రెండురకాలు వున్నాయి. ఒకదానిని 'కేల్సి ఫెరాల్' అనీ, మరొకదానిని 'కోలో కేల్సిఫెరాల్' అనీ అంటారు. కేల్సిఫెరాల్ అంటే 'కేల్సియం'ని మోసేది అని అర్థం. 'కేల్సియం'ని తెలుగులో ఖటికము అంటారు. కనుక కేల్సిఫెరాల్‌ని తెలుగులో 'ఖటికధరాల్' అనొచ్చు! ఈ పేర్లమాట దేముడెరుగును కానీ, ఇక్కడ ముఖ్యంగా గమనార్హమైన విషయం ఒకటి వుంది. కేల్సియం మన శరీరంలోని ఎముకల పెరుగుదలకీ, వాటి ఆరోగ్యానికీ ఎంతో అవసరం. కనుక పసిపిల్లలు ఎదిగే వయస్సులో ఈ విటమిన్-డి సరఫరా సరిగ్గా జరగకపోతే వాళ్ళ ఎముకలు ధృఢంగా పెరగవు. అప్పుడు, ఉదాహరణకి, ఎదిగే శరీరం యొక్క బరువు మొయ్యలేక కాళ్ళలోని ఎముకలు ఒంగిపోతాయి. ఇలా ఒంగిన కాళ్ళని ఇంగ్లీషులో 'బోలెన్స్' అంటారు. ఇలాగే రొమ్ము దగ్గర ఎముకలు పైకి లేచినట్లు కనబడడం (దీనిని ఇంగ్లీషులో 'ఛికెన్ బ్రెస్ట్' అంటారు.) పాలభాగం

చదునుగా ఉండకుండా కుంభాకారంగా వుండడం, మొదలయిన లక్షణాలు అప్పుడప్పుడు కనిపిస్తూ వుంటాయి. ఈ లక్షణ సముదాయాన్ని ఇంగ్లీషులో 'రికెట్స్' అంటారు. పిల్లలకి పాలు పట్టి, కొంచెం ఎండ తగలనిస్తే ఇటువంటి వ్యాధులు రావు.

ఘృతార్థాలకీ, సూర్యరశ్మికీ మధ్యనున్న సంబంధం ఇప్పుడిప్పుడే అర్థం అవుతున్నాది. ఎండ కాయకుండా, మబ్బుగా వున్న రోజులలో కొంతమంది దిగాలుగా, రోగిష్టివాళ్ళలా వుంటారు. ఎండ కాసిన రోజున ఉషారుగా వుంటారు. అంటే, ఎండకీ మన మనోస్థితికీ కొంత సంబంధం వున్నట్లే కదా! మన కపాలంలో వుండేది కొలెస్టరాలు అనే ఘృతార్థం. ఈ ఘృతార్థాలకి ఎండ తగిలినప్పుడు, విటమిన్-డి జన్మించినట్లే, మనస్సుకి ఉత్సాహాన్నిచ్చే పదార్థాలు కూడ పుట్టవచ్చు గదా! ఈ బాణీలో ఆలోచనలు ఈ మధ్యనే మొదలవుతున్నాయి. నిజం నిలకడమీద తేలుతుంది.

### 4. తియ్యదనాన్నిచ్చే ఒలంతాలు :

ఇంతవరకు, ఒకొక్క కర్బనపు టణువుకి ఒకొక్క 'హైడ్రాక్సిల్' గుంపుని తగిలించి, తద్వారా లభించే ఒలంతాలని పరిశీలించి చూసేం. కర్బనపుటణువుకి నాలుగు చేతులు వున్నాయి కదా. వీటిలో, ఇంతవరకు, ఒక్క చేతికే ఒక హైడ్రాక్సిలు గుంపు తగిలించేము. రెండు చేతులకి హైడ్రాక్సిలు (చేతికొకటి చొప్పున) తగిలిస్తే ? ఈ రకం ప్రతిపాదనలు ఎప్పుడూ ఎక్కువ ప్రాణం పుంజుకోలేకపోయాయి. ఒక కర్బనపుటణువు ఒకటి కంటె ఎక్కువ హైడ్రాక్సిలు గుంపులని భరించలేదు. ఏకపత్నీ వ్రతంలా ఏక హైడ్రాక్సీ వ్రతం పట్టేయి ఈ కర్బనపుటణువులు! కాని ఒకే బణువులో వున్న కర్బనపుటణువులకి, విడివిడిగా, ఒక్కొక్కదానికొకొక్కటి చొప్పున, హైడ్రాక్సిలు గుంపులని, ఎన్ని వీలయితే అన్నిటిని తగిలించవచ్చు. ఉదాహరణకి, ఎతేను బణువులో రెండు కర్బనపుటణువులు ఉన్నాయి. ఈ రెండింటికీ, ఒక ఉదజని స్థానంలో ఒక హైడ్రాక్సిల్ గుంపు చొప్పున తగిలిస్తే వచ్చే పదార్థం పేరు 'ఎతిలీన్ గ్లైకాల్'. అసలు ఏ పదార్థంలోనైనా సరే, రెండు పక్కపక్కనున్న కర్బనపుటణువులకి హైడ్రాక్సిలు గుంపులు తగిలించి వుంటే, ఆ పదార్థాన్ని 'గ్లైకాలు' అంటారు. అంటే గ్లైకాలు అనేది ఒక ఇంటిపేరు లాంటిది. కాని పూర్తిపేరు చెప్పకుండా, ఎవరైనా క్లుప్తంగా, బద్ధకంగా 'గ్లైకాల్' అంటే వాళ్ళ ఉద్దేశ్యం ఎతిలీన్‌గ్లైకాల్ మాత్రమేనని గ్రహించునది.

గ్లైకాలు జాతికి చెందిన పదార్థాలన్నిటికి కొంచెం తియ్యదనం వుంటుంది. అసలు గ్లైకాలులోని 'గ్ల' శబ్దం, గ్లూకోజ్‌లోని 'గ్ల' శబ్దం చక్కెరగాని, తియ్యదనాన్ని గాని సూచిస్తాయి. ఇంత కథ చెప్పిన తర్వాత ఎతిలీన్ గ్లైకాల్ తియ్యగా వుంటుందని మరోసారి మనవి చెయ్యక్కర లేదనుకుంటాను. కాని తెల్లనివన్నీ పాలనీ, విషం ఎప్పుడూ చేదుగా వుంటుందనీ, తియ్యగావున్న పదార్థాలన్నిటిని తినొచ్చనీ అనుకోకూడదు. పయోముఖ విషకుంభంలా. తియ్యగా వున్నా, ఈ 'ఎతిలీన్ గ్లైకాల్' విషపదార్థం. అలాగని, విషమయినంతమాత్రాన దీనికి ఉపయోగం లేకపోనూలేదు. మచ్చుకి దీని ఉపయోగం ఒకటి చూద్దాం. నీళ్ళు 0°సి దగ్గర గడ్డ కడతాయని మనందరికీ తెలుసు. ఎతిలీన్ గ్లైకాల్ −17°సి దగ్గర గడ్డ కడుతుంది. కాని తమాషా ఏమిటంటే, నీళ్ళనీ, ఎతిలీన్ గ్లైకాల్‌ని కలపగా వచ్చిన మిశ్రమము 0° దగ్గరా కాదు, −17° దగ్గరా కాదు, ఈ రెంటికీ మధ్యేమార్గంలోనూ కాదు, −49° దగ్గర గడ్డ కడుతుంది. ఈ లక్షణం కారు ఇంజనుని చల్లగా ఉంచడానికి ఉపయోగిస్తారు. కారు 'రేడియేటర్'లో ఉత్తనీళ్ల పోస్తే అవి ఇంజను వేడికి మరిగి ఆవిరైపోతాయి. అందుకని కండక్టరు గంట గంటకీ కారునాపి, బాల్చీతో, నీళ్లపట్టుకొచ్చి రేడియేటర్‌లో పొయ్యాలి. ఇదే విధంగా చలిదేశాలలో చలికాలంలో మరొక చిక్కు కారు ఆపి రాత్రల్లా బైట ఒదిలేస్తే, చలికి నీళ్ళు గడ్డకట్టి, రేడియేటర్ కాస్తా పగిలిపోతుంది. 'కర్ర విరగకూడదు, పాము చావకూడదు' అంటారే, అలాగ వేసవిలో నీళ్ళు మరిగిపోకూడదు. చలికాలంలో గడ్డకట్టిపోకూడదు. ఈ గొంతెలమ్మ కోరికని తీర్చాలంటే రేడియేటర్‌లో సగం నీళ్ళు, సగం ఎతిలీన్ గ్లైకాల్ పొయ్యాలి. ఈ మిశ్రమం 197°సి వచ్చే వరకు మరగదు. మన దేశంలో కార్లు తక్కువ గనుక ఈ కథ అందరికీ అర్థం కాకపోవచ్చు. కాని అమెరికావంటి దేశాలలో ఇంటింటికీ, పెంటపట్టు కెళ్ళేవాడికీ కారు వుంటుంది గనుక, ఎతిలీన్ గ్లైకాల్ నిత్యం అవసరమయ్యే వస్తువులలో ఒకటి.

### 5. ఒలంతాత్రువులు :

కట్ట తెగిన తర్వాత వరద రావడం ఎంతసేపు! అలాగే, ఇప్పుడు మూడు కర్బనపుటణువులకి మూడు హైడ్రాక్సిలు గుంపులు తగిలించి చూద్దాం. ఇప్పుడు మనకు లభించే పదార్థం పేరు 'గ్లిసరాల్' ఈ గ్లిసరాల్ నే పూర్వం 'గ్లిసరీన్' అనేవారు. జనీవా ఒప్పందం అయిన తర్వాత, దీనిపేరు చివర 'ఒల్' శబ్దం రావాలనే నిబంధనని పాటించడం కొరకు, దాని పేరుని 'గ్లిసరాల్'గా మార్చేరు. గ్లైకాల్ వలె గ్లిసరాల్ కూడ తియ్యగా వుంటుంది. కాని ఇది విషం కాదు. కావలసినంత తినొచ్చు! నిజానికి మనకు తెలియకుండా ఈ గ్లిసరాల్‌ని తింటూనే వుంటాం. మధ్యలో మెత్తగా వుండే బిళ్ళలు. చాకలెట్లు మొదలయిన వాటిల్లో మెత్తదనానికి ఈ గ్లిసరాల్‌ని వాడతారు. మెత్తదనమే కాకుండా, చెమ్మతనాన్ని కూడ ఇస్తుందీ గ్లిసరాలు. దీనిని

పుగాకుకి రాసి, చుట్టలు చుడితే, చెమ్మవల్ల చుట్ట నిలిచి కాలుతుంది. చేతులకీ, మొహానికీ రాసుకునే మేకప్ క్రీములలోనూ, లోషన్లలోను కూడ గ్లిసరాల్‌ని వాడతారు.

పైన నుడివిన నిర్వచనం ప్రకారం, గ్లిసరాల్ బణువులో కనీసం మూడు కర్బనపుటణువులు వుండాలి? కనుక దాని నిర్మాణ క్రమం ఈ దిగువ చూపిని విధంగా వుంటుంది.

గ్లిసరాల్ నిర్మాణక్రమం




దీనిని బట్టి, ప్రోపేను (త్రయేను)లో మూడు ఉదజని అణువులని తీసేసి, వాటి స్థానాల్లో మూడు 'హైడ్రాక్సిల్' గుంపులని ప్రతిక్షేపిస్తే గ్లిసరాల్ వస్తుందని గ్రహించవచ్చు. త్రయేను (ప్రోపేను కి తెలుగు పేరు) నుండి తయారయిన ఆల్కహాలు కనుక, గ్లిసరాల్‌ని తెలుగులో 'త్రయాల్' అని అనవచ్చు! ఈ త్రయాల్‌నే తెరతారల నేత్రాల్లో వేసి కన్నీళ్ల తెప్పిస్తారు.

**6. ఒలంతాస్త్రాలిలః క్రిమి సంహారం :**

ఇంతవరకు బారుగా వున్న ఉదకర్బనపు బణువులకి (హైడ్రో కార్బన్ మోలిక్యూల్స్) హైడ్రాక్సిల్ గుంపులు తగిలించి చూశాం. ఇప్పుడు చక్రీయమైన బణువుల వైపొకసారి చూద్దాం. షడ్భుజాకారపు గొగ్గి చక్రమే వుంది! (దీనిని ఇంగ్లీషులో 'బెంజిన్ రింగ్' అంటారు. దీనికొక మూలని వున్న ఉదజని అణువుని తీసేసి ఆ స్థానంలో హైడ్రాక్సిల్ గుంపుని ప్రతిక్షేపిస్తే వచ్చే పదార్థం పేరు 'ఫీనాల్'. దీనినే మనం 'ఫినైలు' అని పిలుస్తాము కూడ. ఈ ఫీనాలు సంక్షిప్త నిర్మాణక్రమం యీ దిగువ చూపుతున్నాను.

**ఫీనాలు నిర్మాణక్రమం :**

షడ్భుజి గొగ్గ చక్రానికి సంక్షిప్తమైన గురుతు. ఈ ఫీనాల్ లోని 'ఒల్' శబ్దం ఎలాగూ ఆల్కహాలుని సూచిస్తుంది. "ఫెన్" శబ్దం గ్రీకు భాషలో 'వెలిగించు' అనే అర్థాన్ని యిస్తుంది. ఈ పేరు రావడానికి కారణం ఏమిటంటే, మొదట్లో ఫీనాలుని తారు లోంచి తయారు చేసేవారు. అదే తారులోంచి వంటలకీ, దీపాలకీ వాడే 'గేస్' కూడ తీసేవారు. అందుకని, ఫీనాలు కూడ 'గేస్' మాదిరి వెలుగుతుందనుకొని ఆ పేరు పెట్టేరు.

ఫీనాలు దీపం పెట్టడానికి పనికిరాదు కాని, క్రిములనీ, సూక్ష్మ జీవులనీ చంపడానికి పనికొస్తుంది. ఫీనాలు కలిపిన నీళ్ళతో ఇళ్ళు, వాకిళ్ళు కడిగితే మంచిది. దెబ్బలని, కురుపులనీ కడిగి శుభ్రం చెయ్యడానికి కూడ యీ ఫీనాలుని వాడవచ్చు. ఒక గేలను నీళ్ళలో ఒకటిన్నర ఔన్సుల ఫీనాలు కలిపి వాడితే, అయిదు నిమిషాలలో సూక్ష్మజీవులు హరీమని పోతాయి. పేడతో రోజూ ఇల్లు అలికేకంటే, వారానికోతూరి ఫీనాల్‌తో కడగడం శ్రేయస్కరం.



ఫీనాలు జాతికి చెందిన ఒలంతం మరొకటి వుంది. దానిపేరు 'ఉరిషియోల్'. దురదగుండాకులో వుండే విషపదార్థం ఇదే.

ఫీనాలుకి మరోపేరుంది. ఫీనాలుని 'కార్బాలిక్ ఏసిడ్' అని కూడ అంటారు. ఫీనాలుని ఆల్కాహాలన్నాముకదా ? మరి ఇప్పుడు ఏసిడ్ (అంటే ఆమ్లం) ఎలాగయింది ? ఫీనాలు జాతిరీత్యా ఆల్కాహాలు అయినప్పటికీ, దీనికి బహుకొద్దిగా ఆమ్ల లక్షణంకూడ వుంది. ఈ సందర్భంలో ఆమ్ల లక్షణం అంటే ఏమిటో కొంచెం విపులీకరించి చెపుతాను. అణువులకి గ్రహమండలానికీ కొన్ని పోలికలు వున్నాయి. సూర్యుడు చుట్టూ గ్రహాలు తిరుగుతున్నట్టే. అణువు మధ్యలో నున్న కణిక (న్యూక్లియస్) చుట్టూ ఎలక్ట్రానులనే పరమాణువులు తిరుగుతూన్నట్టు ఊహించుకోవచ్చు. ఇది సాధారణ పరిస్థితులలో కథ. జబ్బుచేసిన వాడికి ఒళ్ళు వేడెక్కడమో, చల్లబడడమో జరిగినట్లు, అణువులు ఉద్రేక పరిస్థితులకి లోనయినప్పుడు, ఒకి ఎలక్ట్రానుని పోగొట్టుకోనైనా పోగొట్టుకుంటాయి, లేకపోతే ఒక ఎలక్ట్రానుని ఎక్కువగా సంపాదించనైనా సంపాదిస్తాయి. ఇటువంటి ఉద్రేక పరిస్థితిలో వున్న అణువుని 'అయాను' అంటారు. ఒక అణువు ఇలా అయానుగా మారేసరికి, ఆ అణువుయొక్క స్వలక్షణాలు చాలామట్టుకి మారిపోతాయి. మచ్చుకి - సోడియం అణురూపములో ఉన్నంతసేపూ విషపదార్థం, కాని ఒక ఎలక్ట్రానుని పోగొట్టుకొని సోడియం అయానుగా మారిన తర్వాత, అది మన మనుగడకే ముఖ్యాతి ముఖ్యమయిన పదార్థం !

అయాను అంటే అర్థం అయింది కనుక, అయానులకీ, ఆమ్లాలకీ మధ్యనున్న సంబంధం ఏమిటో చూద్దాం. ఆంగిక రసాయనిక పదార్థాలలో కర్బనపుటణువులూ, ఉదజని అణువులూ చాలా ముఖ్యమయిన పాత్ర వహిస్తున్నాయన్న విషయం మనలో చాలామందికి తెలుసు. ఈ కర్బనపుటణువులు, ఉదజని అణువులని కబంధ హస్తాలతో పట్టుకున్నట్లు చాల గట్టిగానే పట్టుకుంటాయి. కర్బనపు కబంధ హస్తాలలో చిక్కుకున్న ఉదజనికి, తప్పించుకుని పారిపోయే అవకాశం తక్కువ. కాని, అప్పుడప్పుడు, కొన్ని అనుకూలమయిన సందర్భాలలో, ఈ ఉదజని అణువులో ఒక భాగం తప్పించుకుని పారిపోవడానికి అవకాశం కలుగుతుంది. (తాడుకట్టి బంధించిన బల్లి తోక తెంపుకుని పారిపోయినట్లన్నమాట !) ఇలా తప్పించుకుని పారిపోయిన భాగం పరిపూర్ణమయిన ఉదజని అణువు కాదు; అది ఉదజని అయాను మాత్రమే ! ఇలా ఉదజని అయానులని తప్పించుకుని పోనిచ్చే పదార్థాలని ఇంగ్లీషులో 'ఏసిడ్స్' అంటారు. తెలుగులో ఆమ్లాలు అంటారు.

ఏయే పరిస్థితులలో ఉదజని అయానులు తప్పించుకోగలవు? కర్బనానివి కబంధ హస్తాలన్నాముకదా ! ఒక కర్బనం ఒక ఉదజనిని పట్టుకుందంటే అది ఉడుంపట్టు ! నఖశిఖ పర్యంతం వాటేసి పట్టుకుంటుంది. కాని కర్బనము ఆమ్లజనినీ, ఆ ఆమ్లజని ఒక ఉదజనినీ పట్టుకున్నాయనుకుందాం. రైలుబండిలా అన్నమాట. ఈరకం కట్టడిలో కర్బనం ఆమ్లజనిని గట్టిగానే పట్టుకుంటుంది. కాని ఆమ్లజని మాత్రం ఉదజనిని అంత గట్టిగా పట్టుకోలేదు. కనుక -COH వంటి నిర్మాణ క్రమం ఉన్న పదార్థాలలో ఉదజని అయాను సునాయాసంగా విడిపోయే అవకాశం ఉంది. అందుకనే ఒలంతాలు కొద్దిగా ఆమ్ల లక్షణాలని చూపిస్తాయి. ఈ కారణంవల్ల ఎతల్ ఆల్కహాలు బహుకొద్ది ఆమ్ల లక్షణం చూపిస్తుంది. గొగ్గి చక్రంలోని కర్బనానికి -OH తగిలించి వున్న సందర్భంలో ఈ ఆమ్ల లక్షణం పెరుగుతుంది. ఫీనాలులో ఈ ఆమ్ల లక్షణం కొంచెం ఘాటుగానే వుంది కనుక, ఫీనాలుని కార్బాలిక్ ఆమ్లము అనే మారుపేరుతో పిలుస్తున్నాముకూడ !

## 7. ప్రకృతి వైద్యం :

ఫీనాలులో వున్న గొగ్గిచక్రాలలాంటి చక్రాలు రెండు, మూడు కలసివున్న పదార్థాలని 'బహుఫీనాలు' లేదా 'పోలీ ఫీనాలు' అంటారు. ఈ బహుఫీనాలు జాతికి చెందినదే 'టేనిన్' అనే వృక్ష సంబంధమైన పదార్థం. దీనిని టేనిక్ ఆమ్లము అనికూడ అంటారు. ఫ్రెంచి భాషలో 'టేన్' అంటే ఓకుచెట్టుయొక్క బెరడు అని అర్థం. నిజానికి, ఈ టేనిన్‌ని అనేక రకాల చెట్లనుండి, ఆకులనుండి తియ్యవచ్చు. జంతువుల చర్మం ('హైడ్') ఈ టేనిన్ వున్న ద్రావణంలో నానబెడితే అది గట్టిపడి తోలు ('లెదరు')గా మారుతుంది.

టీ ఆకులలోకూడ ఈ టేనిన్ ఉంటుంది. శరీరం కొద్దిగా కాలితే, ఆ కాలినచోట తడిపిన టీ ఆకులతో కప్పి కట్టుకడితే అక్కడ చర్మం గట్టిపడి నొప్పి తగ్గుతుంది. మన పల్లెపట్టులలో కొందరు కురుపులమీద ఆకువేసి కట్టుకడతారు. ఈ ఆకులో వున్న టేనిన్ చర్మంమీద పనిచేసి చర్మాన్ని పగులగొట్టి, లోపల చీముని పైకి తీస్తుందనుకుంటాను. ప్రకృతి వైద్యం పుక్కిటి పురాణం కాదేమో !

టేనిన్ టీలోనేకాదు, కాఫీ గింజలలోకూడ వుంది. అందువల్లనే కాఫీ డికాక్షన్‌కీ, టీ డికాక్షన్‌కీ కొంచెం చేదు వుంటుంది. డికాక్షన్‌లో పాలు పోసేసరికి, ఈ పాలు ఆ టేనిన్‌తో కలసి కొంతవరకు చేదుని తగ్గిస్తాయి. ఇప్పుడు తెలిసిందా, కాఫీలో పాలు ఎందుకు వేస్తామో !

ప్రజాస్వామ్యం,
సామ్యవాదం, మత నిరపేక్షత,
ఐక్యత, సమైక్యతలు
శాంతి, పురోగతులకు మన
పటిష్టమైన పునాదులు.



davp 88/245 Tel.

# చీకట్నించీ చీకట్లోకి

## సౌభాగ్య

నగరమంతా కరంటు పోయింది.
వెన్నె గుప్పున వెలిగింది
కొన్ని నిముషాలు యాంత్రికత స్తంభించింది
అమ్మకాలు ఆగిపోయాయి.
స్వలాభ చింతనలకి క్షణకాలం లంకెతెగింది.
తెరమీద వేలమంది ముందు ఒళ్ళు విరుచుకుంటున్న అర్ధనగ్న సుందరి అదృశ్యమైంది.
రేడియోలో వినిపిస్తున్న పాడు గీతం
బ్లేడుతో కత్తిరించినట్లు తెగిపోయింది.
టీవీలో అమాత్య శిఖామణి అందవికార ముఖార వింద్నాన్ని,
అభివృద్ధి కార్యక్రమాల అపహాస్యోపన్యాసాన్ని అంధకారం గుటుక్కున మింగేసింది.
అలవాట్ల మీద చీకటి పిడుగుపడ్డట్లు కలకలం వెలవెలబోయింది.
పరీక్షలకు బట్టీ పడుతున్న పిల్లలు
బిల బిల మంటూ వీధుల వెన్నెట్లోకి దూకారు.
క్షణంలో ఒకడు 'ఇమ్రాన్ ఖాన్' ఇంకోడు 'గవాస్కర్' అయ్యాడు.
ఊహల్లో సృష్టించుకున్న బ్యాట్లతో
ఉత్తుత్తి 'రన్లు' కొట్టి సెంచరీ పూర్తి చేశారు.
హాలివుడ్ సినిమాలో 'సిల్వెస్టార్' సూదుల్తో చర్మం కుట్టుకోడం గురించి చర్చించుకున్నారు.
అవసరాలకి డబ్బులివ్వని 'డాడీ'లని తిట్టుకున్నారు.
ఐదు నిముషాలకే వాళ్ళలో ఒకడు
'ఫీలింగ్ బోర్ యార్' అని కాన్వెంట్ భాషలో విసుగు పడ్డాడు.
కనికరించిన కరంట్ కమ్మగా వెలిగింది
రేడియోలు, టీవీలూ, సినిమాలూ
వాడవాడలా వేడివేడి వ్యాపారాలూ
మనుషుల్ని తీర్చి దిద్దుతూ మామూలుగా పని ప్రారంభించాయి,
భావి భారత పౌరులు బ్రహ్మానందంతో అరుస్తూ
చీకట్నించీ చీకట్లోకి జారబడ్డారు.

శ్రీ బి. యస్. శాస్త్రి

# పాలకవీడు శిలా శాసనము

శాసనము :-

నల్లగొండజిల్లా, నేరేడుచర్ల మండలములోని పాలకవీడు గ్రామమతిపురాతనమైనది. కాకతి సామంతులకు రాజధానిగా వర్థిల్లిన ఈ గ్రామమునగల దుర్గము శిథిలరూపమున కనిపించుచున్నది. ఈ గ్రామమందున్న గోపీనాథదేవర ఆలయము శిథిలమైనది. గ్రామీణులు శిథిలాలయ ప్రాంతముననున్న శాసన శిలా స్తంభమును తరలించి గ్రామములోని హనుమదాలయకుడ్య సమీపమున నిలిపినారు. నేరేడుచర్లనుండి జాన్‌పాడు వెళ్ళు దారిలోనున్న పాలకవీడు గ్రామము, కాకతిరుద్రమదేవి సామంతులైన చెఱకు రెడ్డి వంశీయుల రాజ్యమందున్నట్టిది. శాసనమున రుద్రదేవమహారాజు, ప్రతాపరుద్రుల ప్రశంసయున్నది.

ఆకారాదికములు :-

శాసనము నల్లరాతి స్తంభముపై రెండువైపుల చెక్కబడినది. మూడవ ప్రక్క శాసనశిల నునుపుగా జెక్కబడియున్నది. కాని శాసనాక్షరములులేవు. శాసనము శాసనశిల రెండవ ప్రక్కతో పూర్తియైనది.

శాసన స్తంభము పొడవు '6, 2,,. వెడల్పు '1, 7''. ఇది తెలుగు శాసనము శాసనారంభమున "హరిః ఓం" తరువాత "మద్వంశజాః" అను శ్లోకమున్నది.

శాసనము మొదటిప్రక్క సూర్యచంద్రుల ప్రతిమలు, రెండవ ప్రక్క శంఖచక్రములు, చెక్కబడినవి. శాసనము మొదటి ప్రక్క 40 పంక్తులు, రెండవప్రక్క 24 పంక్తులు, మొత్తము 64 పంక్తులలోనున్నది.

లిపి :-

శాసనాక్షరములు చక్కని వరుసలో చెక్కబడి చూచుటకందముగ కనిపించుచున్నవి. ఇవి గుండ్రఖత్తు అక్షరములు. ఆంధ్ర దేశమున 13వ శతాబ్ది ఉత్తరార్థమున వాడుకలోనున్న తెలుగు లిపి ఈ శాసనమున వాడబడినది. శాసనాక్షరము లానాటి కాకతీయ శాసనాక్షరములను పోలియున్నవి. ముఖ్యముగా బొల్లేపల్లి తేరాల ఏడిండ్ల రెడ శాసనము,[1] సదర్ షాపూర్ శాసనము[2] వావిలాల రుద్రయరెడ్డి ఇర్విన్ శాసనము,[3] కందూరు సోమనాథదేవచోడుని ఆగామోతుకూరు శాసనము,[4] సత్రము బొల్లమరాజు బూరుగుగడ్డ శాసనాక్షరములను[5] పోలియున్నవి.

భాష :-

శాసనారంభమున నున్న సంస్కృత శ్లోకము తప్ప తక్కిన శాసనమంతయు తెలుగుభాషలో నున్నది. శాసనమున 'ర' కారపొల్లు వాడబడినది. 'ర' కారపొల్లునకు పూర్వాక్షరము ద్విత్వముగ నున్నది. శాసనమున పూర్ణానుస్వారములు వ్రాయబడినవి.

కార్తీక - బదులు కార్త్తింక
ఆముదుపడి — ఆంముదుపడి
పుట్టెడు — పుట్టెండు
పొనుగోటి — పొనుంగోటి
తూర్పు — తూర్ప్పుఁ
తూర్పు గొమ్మున — తూర్ప్పుఁం గొంమున
కాపులు — కాంపులు ప్రయోగింపబడినవి.

శాసన విషయము :-

కాకతి రుద్రదేవమహారాజు పృథివీ సామ్రాజ్యము నేలుకాలమున శకవర్షము 1191 శుక్లకార్తీక శుద్ధపౌర్ణమి గురువారమున, పాలకవీడు గ్రామమున సావాసి పెద్దిరాజ్యముగారు శ్రీ గోపీనాధదేవుని ఉభయపిరాట్ల సహితముగా ప్రతిష్ఠచేయుకాలమునందీ శాసనమును వేయించెను. ప్రతిష్ఠకాలమున దేవర అంగరంగ భోగములకు, ధూపదీప నైవేద్యాదులకు, ఈ క్రింది విధముగ దానము లొసగబడినవి.

1) సుండయ పెగ్గడ రుద్రయ్యకు పుణ్యముగా ఆముదుపడికి లాలికుంటను,

2) చెఱకు గణపతిదేవుడు మారయరెడ్డికి పుణ్యముగా పెదవీడు ఉత్తరకము కొమ్మున ఆముదు పడికి ఒక మఱ్తురు భూమిని,

3) గణపతిరెడ్డి మారయరెడ్డికి పుణ్యముగా భోగానకు, జాన పాడు చెఱువుక్రింద భూమియు, నల్లంగురం పొనుగోడు తూర్పు పడమరను ఠాట్లపూదోట, ఆపడుగుకు నందనవనమున బావియు,

4) బొల్లయ ప్రతాపరుద్రదేవునికి పుణ్యముగా గచరాలువ క్రింద పుట్టెడు భూమిని,

5) చెఱకు పందం జాయరెడ్డి ఆముదుపెదికి ఐరుసము చల్ల గ్రామమున నల్లంజెఱువుక్రింద ఆ అకట్టను, మఱుయ అడ్డ, పొనుగోడు మార్గనెఱుమున వపుట్టి, అమరపురమున ఒక మఱురు, పుట్టెడు, గణప వరమున పైబస కాలువక్రింద పదియమఱురను,

6) కేశవదేవుడు, పాలకవీడు పెద్ద చెఱువుక్రింద చెన్నకేశవ పెరుమాళ్ళకు, ముప్పాదిక, చెఱువు తూర్పు గొమ్మున పెతిక, పైడికుంట తూర్పుగొమ్మున అడ్డ, ప్రాలుకాలువక్రింద అడ్డ భూము లను, పాలకవీట రాజనాలు పండునట్టి భూమి మఱురు, సమర్పించ ములు.

7) మారయగణపతిదేవునికి పుణ్యముగా, దేవరభోగమునకు కాపులు, సమస్త ప్రజలు, అయగాండ్రు, రాచసిద్ధాయమునకిచ్చు ప్రతి మాడకు, వీసములెక్కను, మాడకు ప్రతివారము చిన్నము లెక్కను పెట్టినలెను.

8) మట్టపల్లి కాపులు, ఆయగాండ్రు, మాడకు వీసము చొప్పు నను, ధాన్యము పంటపైన ధాన్యమును ఇవ్వవలెను. ఇవి శాసనోద్ధృత నియమములు.

ఈశాసనమున పేర్కొనబడిన గ్రామములు నేడు హుజూర్ నగర్ తాలూకాలో నున్నవి. పాలకవీడు, పెద్దవీడు, జాన్‌పాడు, పొనుగోడు, అమరారము, గణపవరము, మట్టపల్లి గ్రామములు పూర్వనామములతో పిలువబడుచున్నవి. రావికుంట, ఉన్న ప్రాంత మున రావిపాడు గ్రామము వెలసినది.

శాసనకాలము :-

ఈ శాసనము శక సంవత్సరము 1191 శుక్ల, కార్తీకశుద్ధ పౌర్ణమి, గురువారమునాటిది. రుద్రమదేవి రాజ్యపీఠమలంకరించిన 7 సంవత్సరముల కీశాసనమీయబడినది. అప్పటికి ప్రతాపరుద్రుడు యువమహారాజుగా పదవీబాధ్యతలు చేపట్టియుండును. కావున రుద్రమ దేవితోపాటు ప్రతాపరుద్రుడు ప్రశంసింపబడినాడు. శాసనము క్రీ. శ. 1269 నాటిది.

## చెఱకు వంశీయులు :-

కాకతి రాజ్యము విస్తరించుకాలమున, మల్యాల, విరియాల, చెఱకు, రేచర్ల, కందూరిచోడ, కోట, గోన, నతవాడి, త్యాగి, కొలను పరిచ్ఛేగ, తెలుగు చోడ, వావిలాల ఆదిసామంత వంశీయులు, మాండ లిక ప్రభువులు కాకతి ప్రభువులకు విధేయులై, అనేక యుద్ధములందు పాల్గొని విజయులై కీర్తినార్జించినారు.

చెఱకు వంశీయులు రెడ్లు, మహాసామంతాధిపతులు, కాకతి రెండవ బేతరాజుకాలమునుండి సేనానులుగా ప్రసిద్ధిగాంచి, రుద్రదేవుని కాలమున మహాసామంతాధిపత్యము వహించిరి. వీరు చతుర్థ కులజులు, విష్ణువు, బ్రహ్మ, వీరి వంశప్రాశస్త్యమును తెలుపుటకు వంశపు మూలపురుషులుగా వర్ణింపబడినారు.

చెఱకు వంశీయుల చరిత్ర రచనకు శాసనములే ఆధారములు. వీరికి సంబంధించిన శాసనములు నల్లగొండ, మహబూబునగరము,



పాలకవీడు
శిలాశాసనము
మొదటి ప్రక్క



పాలకవీడు
శిలాశాసనము
రెండవ ప్రక్క

కర్నూలు మండలములందున్నవి. అందు ఈ క్రింది శాసనములు ముఖ్యమైనవి.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | జలాల్పురము శాసనము | శ. సం. 1124- | క్రీ. శ. | 1202 |
| 2. | ఓలాల్చురము శాసనము | శ. సం. 1175- | క్రీ. శ. | 1253 |
| 3. | అమరాబాదు శాసనము | 1186- | | 1264 |
| 4. | పాలకవీడు శాసనము | 1191- | " | 1269 |
| 5. | ఇర్విన్‌శాసనము | 1193- | " | 1271 |
| 6. | ఇదంపల్లి శాసనము | — | | — |
| 7. | అమరాబాదు శాసనము | 1208- | " | 1286 |
| 8. | కల్వకోలు శాసనము | 1208- | " | 1286 |
| 9. | అమరాబాదుశాసనము | 1212- | " | 1290 |
| 10. | ఉడుమళ్ళ శాసనము | — | | — |
| 11. | నందికొట్కూరు | 1212- | " | 1290 |
| 12. | నందికొట్కూరు | 1213- | " | 1291 |
| 13. | లింగాల శాసనము | 1213- | " | 1291 |
| 14. | గోరువంకపల్లి తామ్ర శాసనము " | 1215. | | 1293 |
| 15. | కూరెళ్ళ శాసనము | 1217- | | 1295 |
| 16. | కల్వకోలు శాసనము | ప్లవ సంవత్సరము | | |
| 17. | తాడువాయ శాసనము | 1222- | " | 1300 |
| 18. | తాడువాయ శాసనము | 1228- | " | 1306 |
| 19. | మేళ్ళచెరువు శాసనము | 1233- | " | 1311 |
| 20. | తాడువాయ శాసనము | 1236- | " | 1314 |
| 21. | కల్వకోల్ శాసనము | 1243- | " | 1321 |

మహాసామంతాధిపులైన చెఱకువంశీయులు చరిత్రకు రూప కల్పన మింతవరకు చేయబడలేదు. లభించిన శాసనముల ననుసరించి సంక్షిప్త చరిత్ర ఈ వ్యాసమున పొందుపరచుట జరిగినది.

బ్రహ్మపాదోద్భవులైన, ధర్మాత్ములగు చతుర్థ కులశ్రేష్ఠుల వంశమందు కాటయ జన్మించెను. అతడు కొంగొండ ధవళుడను పులిని సంహరించి ఏఱువ మండలమును విచ్ఛేదమొనర్చెను. కాకతి రెండవ బేతరాజు కాటయ శక్తిసామర్థ్యములను గమనించి అతనికి చెఱకు 12 గ్రామముల నొసంగెను. అప్పటినుండి అతని వంశీయులు చెఱకువంశజులనబడినారు.[6]

చెఱకుపల్లి పేరుగల గ్రామములు నల్లగొండమండలమున రెండున్నవి. ఒకటి నకిరేకల్లు మండలములోను రెండవది దిండి మండలమందును ఉన్నవి. చెఱకు కాటసేనాని భార్య కామాంబిక. ఆ దంపతులకు కేత, సూర, బొల్ల అను వారుదయించిరి. జ్యేష్ఠుడైన కేతసేనాని కిరువురు భార్యలు. వారు కామాంబిక, కుప్పాంబిక అనువారు. కామాంబికయందు, కాట, మార, ఎఱ్ర, ఎఱ్ర అను నలువురు తనయులు కలిగిరి కుప్పాంబికవలన కాట, మార, బొల్లయను ముగ్గురు కుమారులుదయించిరి.[7]

కేతసేనాని గొప్ప పరాక్రమవంతుడు. అతడు అతని తనయులు, కాకతి రుద్రదేవుని కండగా నిలిచి ఆతడొనర్చిన యుద్ధములందు విజయములను చేకూర్చిరి. కందూరునాడుపైనను పానుగల్లు పట్టణముపైనను కాకతిరుద్రుడు జరిపిన దండయాత్రలయందు కేతసేనాని ఆతని తనయులు పాల్గొనిరి. దానికి ప్రతిఫలముగ రుద్రదేవుడు చెఱకువంశీయులకు గుండియపూడి, చెఱపూడి, గొట్టిపల్లి. పసుల తొఱ్ఱువంటి అనేక గ్రామముల నొసంగి సత్కరించెను. గుండియపూడి=గుండేపురి. గొట్టిపల్లి=గొట్టిపర్తి గ్రామములు తుంగతుర్తి తాలూకాలో నున్నవి.

కేతసేనాని తనయులలో బొల్లసేనాని ప్రతాపవంతుడు. యుద్ధ విశారదుడు. శత్రువులను నిర్జించినవాడు. కాకతిరుద్రదేవున కాంత రంగిక మిత్రుడు. వారిద్దరికిగల స్నేహ సంబంధముల వలన చెఱకు వంశీయులకు మహాసామంతాధిపత్యము లభించినది. తుంగతుర్తి తాలూకాలోని జమ్ములూరు చామలూరు=జలాల్పురము కేంద్రముగా చెఱకు వంశీయులు మరో సామంత రాజ్యమును పాలించిరి.

బొల్లసేనాని భార్య మల్లాంబిక. ఆమె యందతనికి వివిధ విబుధరక్షణాదక్షులు, శత్రుసంహారకులు, బలపరాక్రమోపేతులైన నలువురు తనయులు కలిగిరి. వారు గణపతి, విశ్వనాథ, కేత, ఇమ్మడి విశ్వనాథ అనువారు.[8]

చెఱకు బొల్లసేనాని కాకతి రుద్రదేవ మహాదేవ, గణపతిదేవుల కాలమున సేనాపతిగను, మహాసామంతాధిపతిగను వ్యవహరించెను. అతని తనయులు కాకతి గణపతిదేవుని సామంతులు.

బొల్లయరెడ్డికి మరియొక భార్యవలన దేవయ వాహినీశుడుదయించెను[9] అతడు కందనోలు మండల ప్రాంతమును పాలించుటకు నియమింపబడెను. అతని సంతతివారు కర్నూలు ప్రాంత పాలకులుగ నున్నను వారికి జమ్ములూరు రాజ్యభాగములపై ఆధిపత్యమున్నట్లు కూరెళ్ళ శాసనము తెలుపుచున్నది.[10]

బొల్లయ కాలమునుండి చెఱకు వంశీయులు, జమ్ములూరు రాజ్యమునే కాక, అమరాబాదు కర్నూలు ప్రాంతములందు సామంత రాజ్యములను పొంది పాలింపసాగిరి.

కర్నూలు ప్రాంతమున బొల్లయతనయుడు పెద్ద దేవయ, అతని తనయుడు, మనుమబొల్ల లేక వేలూరుబొల్ల రాజ్యమును పొంది పాలించిరి. మనుమబొల్ల రుద్రమదేవి పాలించుకాలమున, కాయస్థ అంబదేవుని ప్రభావమున కాకతిరాజ్యముపై కత్తిగట్టెను. అంబదేవుడు

కర్నూలు మండలమును, ఆక్రమించి, మనుమబొల్ల శౌర్య ప్రతాపము లను గమనించి కన కుమార్తెను బొల్లయతనయుడగు రాజన్న లేక రాజరుద్రునకిచ్చి వివాహమొనర్చి అల్లునికి కొంతరాజ్యమప్పగించెను.

కాకతిరుద్రమ మరణానంతరము ప్రతాపరుద్రుడంబదేవు నోడించి అతని అనుచరులను మట్టుబెట్టెను. చెఱకు వంశీయుడగు రాజరుద్రుడు ప్రతాపరుద్రుని సామంతునిగా నుండుట కంగీకరించెను. కాకతి ప్రతాపరుద్రుడు చెఱకు వంశీయులు కాకతి సామ్రాజ్యమున కొనర్చిన సేవలను దృష్టిలో నుంచుకొని రాజరుద్రుని తప్పిదములు మన్నించెను.[12]

మొదటి బొల్లచమూపతికి మల్లాంబిక వలన ఇమ్మడి విశ్వానాథు డుదయించెను. అతడు జమ్మలూరు, అసురాబాదు ప్రాంతములను పాలించెను. అమరాబాదు, జిలాలుపురము, ప్రాంతము లందితనికి సంబంధించిన శాసనములున్నవి, ఇతని తనయుడు ఇమ్మడి దేవయ రధినశ్వరుడు : ఇతనికి ఇరువురు తనయులు. ఇమ్మడి బొల్లయరెడ్డి ప్రోలయ అనువారు. చెఱకు వంశమున రెండవ బొల్లయరెడ్డి ప్రసిద్ధుడు. ఇతనికి సంబంధించిన శాసనములమరాబాదులో లభించినవి.[1] వావిలాల రుద్రయరెడ్డి సోదరి రుద్రసాని చెఱకు ఇమ్మడి బొల్లయరెడ్డిభార్య. రుద్రయరెడ్డి, బొల్లయరెడ్డికి బావమరిది, వియ్యంకుడును అని ఇర్విన్ శాసనము[2] తెలుపుచున్నది. మొదటి బొల్లయరెడ్డి సోదరుడు మారయరెడ్డి, మారయ చిన్నతనమందే మరణించెను. అతని తనయుడు గణపతిరెడ్డి. బొల్లయరెడ్డి సోదరతనయుని తాడువాయి, ప్రాంతమును పాలించుటకు నియమించెను. అతని సంతతి వారు. ప్రకటించిన శాసనములు తాడువాయి[3] పాలకవీడు, తదితర ప్రాంతములందున్నవి. కలువకోలు ప్రాంతమున గణపతిరెడ్డి శాసనము లున్నవి. గణపతిరెడ్డి తనయుడు అన్నమరెడ్డి లేక అన్నయరెడ్డి చెఱకు వందరి జాయరెడ్డి ప్రశంసలుగల శాసనములు తాడువాయి,[4] పాలకవీడులందు లభించినవి.

కాకతి బేతరాజు2 నుండి ప్రతాపరుద్రుని వరకు చెఱకు వంశీయులు, సేనానులుగను, చమూపతులుగను, మహాసామంతాధిపతులుగను వ్యవహరించి అనేక దేవాలయములను నిర్మించి, కవులకు, పండితులకు, వేద వేదాంగవిదులకగ్రహారములను, భూములను దాన మొసంగి తమ వంశ ప్రతిష్ఠ నినుమడింపజేసినారు.

## చెఱకు రెడ్డి వంశ వృక్షము

విష్ణువ
|
బ్రహ్మ
|
కాట సేనాని - భార్య కామాంబిక
(క్రీ. శ. 1090 – 1135)
|
కేత (1135 - 1185) — మార — బొల్ల

కేత: 2 భార్య కుప్పాంబిక | - కామాంబిక
కాట — మార — ఎఱ్ఱ — ఎఱ్ఱ

కాట — మార — (బొల్ల క్రీ.శ. 1185-1209)

మార
|
గణపయ (క్రీ. శ. 1249-1307)
|
అన్నమరెడ్డి (క్రీ. శ. 1307-1314)
|
చెఱకు వందరి జాయరెడ్డి

బొల్ల — మల్లాంబిక వలన
|
ఇమ్మడి విశ్వనాథ (క్రీ.శ. 1209-1264)
|
ఇమ్మడి దేవయ (1264-1270)
|
ప్రోలయ (క్రీ.శ. 1321) — రెండవ బొల్లయరెడ్డి (భార్య రుద్రసాని) (1270 - 1295)

బొల్ల — రెండవ భార్య వలన
|
పెద దేవయ (క్రీ.శ. 1209-1250)
|
మనుమ బొల్ల లేక వేలూరు బొల్ల (క్రీ. శ. 1250-1291)
|
రాజరుద్రుడు. (క్రీ. శ. 1291-1314.)

## పాలకవీడు శాసనము

### శాసనము — మూలము

మొదటి ప్రక్క

1. హరి ఓం. మద్వ్యంశజ్యా పరమహీపతి వంశజావా
2. పాపాదపేత మనసోభువి భూమి భూపాః
3. యేపాలయంతి మమధమ్మన్ మిమం సమ
4. స్తంతేషామ్మయా విరచిరోంజలిరేషమూ
5. ర్ధ్ని ॥ స్వస్తిశ్రీ శుభశక వరుషంబులు
6. 1191 అగు నేంటి శుక్ల సంవత్సర కాత్తి ॥క
7. శు 15 గు స్వస్తిశ్రీమ్మహామండలేశ్వర కా
8. కతియ్య రుద్రదేవ మహారాజులు పృథ్వీ
9. రాజ్యము సేయుచూ నుండంగాను
10. పాలకటను సావాసి పెద్దిరాజ్యం గారు శ్రీ
11. గోపీనాధని ఉభయపిరాట్ల సహితముగా
12. ను తిరుప్రతిష్ఠ చేసిరి. ఆ పత్ర్తి కాలమునం
13. దు పాలకట గుండయ ప్రెగ్గడంగా
14. రు రుద్రయ్యకుం బుణ్యముగాను అవీడు
15. ముదుపడికిచ్చినది రావికుంట, చెఱకు
16. గణపద్దేవండు. మారయ రడ్డి వా
17. రికి పుణ్యముగాను పెద్దవీడు.
18. ఉత్తర ముం కొంమున అంముదు
19. పడి కి యిచ్చింన మఱు తురు, మారయ
20. రెడ్డి గారికి పుణ్యముగాను, గణపతిరడ్జి
21. వారు భోగానకు జానపాటి చెఱువు.
22. ద్విన్నానను ఇచ్చినది నల్లంగురిది పొ
23. నుంగోటి తూర్పు పడమఱను రాట్ల పూం
24. దోంట ఆపడుమటను వరు నందనవన
25. ము నం దడనెబాఇని, బొల్లయప్రతాప
26. రుద్ర దేవనికి పుణ్యముగాను గచకా
27. లు వను ఇచ్చిన్నద్ది పుట్టెంగ్లు ఇరుస
28. ము చల్లను చెఱవు వందరి జా
29. యరడ్డివారు ఆమురు పడికిం
30. పెట్టినది నల్లం జెఱువు అఱు కట్టను
31. మఱురు అద్ద పొనుంగోటి తెరు
32. వున నెఱువ పుట్టి అమరపురమునను ఒ
33. కమత్తురు అందు పుట్టెందు గణప వ
34. రానను పయిలపకొలవను పడియ
35. మఱురు శ్రీ చెన్నకేశవ పెరుమాళకు కే
36. శవ దేవండు పెట్టిన ప్రవిత్తి పెద్ద చెఱ్వు వెన
37. క సకేజనుముప్పాదిక ఆతూప్పు ॥ం
38. గొంమున పాతిక వ అడి కుంట తూ
39. ప్పు ॥ం గొంమున అడ్డవ్రాలు కాల్వ
40. అడ్డ.

రెండవ ప్రక్క

1. పాలక వీటను రజ
2. నాలును తమ ప్రవిత్తిబడి
3. మఱుతురు మాడబడి
4. మఱులు పెట్టువారు మారయ
5. గణపద్దేవనికి పు
6. ణ్యము గాను భోగా
7. నకు కొంపులును స
8. మస్త ప్రజను ఆయగా
9. ం ద్రూను రాచసిద్ధాయ
10. మునకు పెట్టి వ హిండ్డికల
11. ను మాడకు మాడబడి
12. వీసం లెఖ్ఖం బెట్టువారు
13. ప్రతివారమునుం జయ
14. మున మాడబడి చిన్నము
15. లెఖ్ఖం బెట్టువారు
16. మట్టపల్లి కాంపులును ఆ
17. ఆయ గాంద్రూను మా
18. దను మాడబడి వీసాలు పె
19. ట్టు వారు. ఆయూరి
20. (ర) వారమును బండునది
21. ధాన్యము పెట్టువారు ఆ మ
22. హాజనాలున్ను తమ
23. సమయాన మాడబడి ఆ
24. రు గులు పెట్టువారు.

### అధోజ్ఞాపికలు :

1. శాసనసంపుటి - పుటలు. 238-243
2. భారతి - సెప్టెంబరు 1985
3. శాసనసంపుటి - పుటలు. 232-237
4. శాసనసంపుటి - పుటలు. 171-178
5. తెలంగాణ శాసనములు. సంపుటి 1
6. తెలంగాణా శాసనములు సంపుట 2 కాకతీయ శా. నెం.5.
7. ఎ. పి. గవర్నమెంట్ ఆర్క్యాలాజికల్ సైన్స్ 32 39-47.
8. ఆం. ప్ర. ఆర్క్యాలాజికల్ సిరీస్ నెం. 32 పు. 39-47
9. మల్యాల శాసనము.
10. అప్రకటితము.
11. త్రిపురాంతక దేవాలయ శాసనములు శా. నెం. 72 పుటలు 32-136.
12. కాపర్ ప్లేట్ ఇన్‌స్క్రిప్షన్స్ ఆఫ్ ఆం.ప్ర. గవర్నమెంట్.

1. హైదరాబాద్ ఆర్కెలాజికల్ సిరీస్ నెం.19 ఎమ్.ఎన్.4,5,6.
2. శాసన సంపుటి పుటలు 232-237.
3. శాసన సంపుటి పుటలు 244-250.
4. సౌ. ఇ. ఇన్. వాల్యూం నెం. 489, 494, 508.

# వల్లభామాత్య వర్య !

సంధ్యా సమయమందు శంకరుడాడంగ
జూటమందలి ఏటిపోటులనగ
అలపమోధి మథింప నావిర్భవించిన
ఘుమ ఘుమాయిత తరంగములనంగ
హాటకగర్భ వధూటి వీడి యమున
గమగమ వలచెడు కపురమనగ
హల్లీసకంబులనాడు పల్లవహరి
వనమాలలిడు గంధవహమనంగ
కవితలో కాకతీయుల కాలవిభవ
మంతజూపితి వల్లభామాత్య వర్య
దేశభాషను లెస్సగు తెలుగుభాష
కమర సౌందర్య మొసగిన యాంధ్ర సుకవి!

# కూచిమంచి తిమ్మనార్య

బంగారు బొజ్జ దేవర యాలి కాల్గజె
కదలిక లందలి కంచుమ్రోత
క్రొందేనెపట్టులో కొసరి యూరిన తేట
చినుకు లందలి చిరు చేదు తీపి
తేటగా పారెడి తెలివాక యందలి
తోద్రోపు తరగలు తొలుకు జల్లు
తెమ్మరల్ గదలించ కమ్మమర్మరలీను
ఔజువారిన తోట, లేజివుళ్ళు
గలిపి జాళువకైతను కబ్బములను
దీర్చితివి కూచిమంచి శ్రీ తిమ్మనార్య
దేశభాషను లెస్సగు తెలుగు భాష
కమర సౌందర్యమొసగిన యాంధ్ర సుకవి

శ్రీ కపిలవాయి లింగమూర్తి

విరహాగ్ని కార్చిచ్చులా విస్తరిస్తుంది
శప్తహృదయం
తప్తభాండమై ప్రకాశిస్తుంది
అశ్రుఝురి
ఆవిరిగా మారి
జీవనాడుల్ని కలచి
వెన్నెముకను తొలిచి
కుబుసం విడచిన ఘటసర్పంలా
పరిక్రమిస్తుంది
కరగిమరగిన
కన్నీటి ఆవిరిలో
చిత్తడిలేని మెత్తని వత్తిడిలో
మూలాధారాలు కదలి
ఆశనిరాశల ఉభయధ్రువాలమధ్య
మతి భ్రమిస్తుంది!
విరహతాపం
విద్యుద్దీపమై జ్వలిస్తుంది:
ప్రణయం ప్రణవమై

కాంతిచ్ఛటలతో మెరుస్తుంది !
ఘనాఘన ఘోషతో
అమృతధారలు కురుస్తుంది!!

# జ్యోతిర్గీతాలు

మూర్ఖుడా!
జ్యోతిర్గీతాల్ని ముట్టుకుని
చేతులు కాల్చుకోకు!
అవి కలాల నుండి పారిన భావాలు కావు,
విస్ఫులింగకలాలనుండి జారిన లావాలు !
గళాలు రవళించిన సరళ స్వరాలు కావు,
అయోమయ నిగళాలు నినదించిన
స్వేచ్ఛా ప్రణవాంకురాలు!!

శ్రీ గడియారం శేషఫణి శర్మ

# ఆహార ధాన్యం రంగంలో ప్రభుత్వ జోక్యము - ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ

దేశంలో అత్యధిక ప్రజలకు జీవనాధారమైన ఆహారధాన్యం తగిన మేరకు వృద్ధిచెందనట్లయితే దానిలోని సప్లై-డిమాండ్ మార్పు ప్రభావము మార్కెట్‌లోని ఇతర రంగాలపై గణనీయంగా ఉంటుంది. అంతేకాకుండా అత్యధిక మరియు అత్యల్పంగా ఆహార ధాన్యాల నిలువ / ఉత్పత్తి కలిగి ఉన్న రాష్ట్రాల మధ్య వివాదాలు మరియు సమస్యలకు దారితీస్తుంది. కావుననే ఈ రంగంలో స్వేచ్ఛా వ్యాపార విధానాన్ని అవలంబించక తగిన మేరకు ప్రభుత్వం తన విధానాల ద్వారా జోక్యం కలుగ చేసుకోవడం తప్పని సరి. అయితే ధరల నిర్ణయంలో మాత్రం ప్రభుత్వంతో పాటుగా మార్కెట్ శక్తులు కూడా పాలుపంచుకొంటాయి.

ప్రభుత్వం ఆహార ధాన్యాల రంగంలో స్వయం సమృద్ధి, నిరుపేదల యొక్క ఆకలిని తగ్గించడం, న్యాయమైన ధరలతో విని యోగదారులకు ఆహార ధాన్యాలు లభించునట్లు చేయడం, మరియు ఉత్పత్తి దార్లయిన రైతులకు వారి ఉత్పత్తికి తగిన ఫలితాన్ని అంద చేయుటకు గాను ధరల స్థిరత్వాన్ని సాధించుట తన విధానంగా తెలియ చేసింది. అయితే దేశంలోని విధాన నిర్ణేతలు రూపొందించిన విధాన నిర్ణయాలు ముఖ్యంగా ఆహారం మరియు ఉత్పాదకాలకు అందించు రాయితీలు విషయంలో ఆయా సామాజిక ఆర్థిక వర్గాల మధ్య పోటీ ఏర్పడే విధంగా ఉన్నవి. ఆహార ధాన్యం విషయంలో విధానాలను రూపొందించుట యందు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రెండూ పాలుపంచుకొంటున్నప్పటికీ రెండింటి విషయంలో మౌలిక భేదాలున్నవి. కేంద్ర ప్రభుత్వం ఆహార నిల్వలను నిర్ణయించటం, వాని నియంత్రణ మరియు రాష్ట్రాల మధ్య అంతర మరియు బహిర్ వ్యాపారాన్ని నియంత్రించడం ఆహార నిల్వలు కొన్ని రాష్ట్రాల్లో ఎక్కువగా ఉన్నప్పటికీ వానిమధ్య వివాదాలు రాకుండా అవసరాల కంటే అధికంగా నిల్వలున్న రాష్ట్రాలకు మరియు అవసరానికి తగినన్ని ఆహార నిల్వలు లేని రాష్ట్రాల మధ్య కేంద్ర, ప్రభుత్వం కీలకమైన పాత్ర వహించి తగిన మేరకు పంపిణీ చేయడం జరుగుతుంది. అయితే కేంద్రంయొక్క విధానాన్ని దృష్టిలో ఉంచుకొని ఆయా రాష్ట్రాలు తమ స్థానికంగా ఉన్న సంసలకు ఆమేరకు స్వాతంత్ర్యాన్ని కల్గిస్తూ తమ ఆహార విధానాన్ని రూపొందించు కోవడం జరుగుతుంది. కానీ ప్రస్తుతం వివిధ రాష్ట్రాలు ప్రజా పంపిణీకి అవసరమైన ధాన్యం నిలువలను సేకరించుటలో వివిధ పద్ధతుల నవలంబించవచ్చు. ఎంత ధాన్యం అవసరమవుతుందనే విషయంలో కూడా తేడాలను కల్గిఉన్నవి. మార్కెట్‌లో జోక్యం చేసుకోవడం వల్ల వచ్చే పరిణామాలను తెలుసుకోవలెనంటే కేంద్ర, రాష్ట్ర విధానాలను మరియు ఆ విధానాలను అమలు పరుస్తున్న సంస్థా పరమైన ఏర్పాట్లను గూర్చి తెలుసుకోవడం అవసరం. ప్రస్తుత వ్యాసంలో ఆహార ధాన్యం రంగంలో ప్రభుత్వ జోక్యం, దీనివల్ల ఆంధ్ర ప్రదేశ్‌లో ధాన్యం సేకరణ, నిలువలు, ప్రజా పంపిణీ తద్వారా ఆర్థిక వ్యవస్థపైగల ప్రభావాన్ని తెలియచేయడం జరిగింది.

## పూర్వ రంగము :

క్రీ.శ. 1943 వరకు ఆహార ధాన్యం రంగంలో ప్రభుత్వ జోక్యం లేక మార్కెట్ శక్తులు మాత్రమే వీని ధరల నిర్ణయంలో కీలక పాత్ర వహించి ఇష్టానుసారం వ్యవహరించి ఆర్థిక వ్యవస్థలో సంక్లిష్ట పరిస్థితి ఏర్పడుటకు కారణభూత మయ్యేవి. సాధారణ పరిస్థితుల్లో కూడా మార్కెట్ శక్తులు కల్పించిన కృత్రిమకొరతవల్ల పేద ప్రజలకు అధిక ఇబ్బందులు ఏర్పడేవి. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో రవాణా కమ్యూనికేషన్ రంగంలో అంతరాయం ఏర్పడి బెంగాల్‌లో తీవ్రమైన కరువు 1943వ సంవత్సరంలో ఏర్పడింది. అప్పటి సంస్థానాల ప్రభుత్వాలు మిగులుగా ఉన్న ఆహార ధాన్యాలను ఇతర ప్రదేశాలకు సరఫరా చేయడం విషయంలో కఠినమైన నిబంధనలు విధించడం వల్ల పరిస్థితి ఇంకా తీవ్రతరమైంది. 1943 ఆహార ధాన్యాల విధాన నిర్ణయ సంఘం, ప్రభుత్వం ఈ రంగంలో వెంటనే జోక్యం చేసుకొని ప్రైవేట్ రంగంతో పాటు ప్రభుత్వం కూడా తన ఏజెన్సీల ద్వారా నిలువలు, మరియు పంపిణీ కార్యక్రమం చేపట్టవలె నని సూచించింది. అంతేకాక ప్రైవేట్ రంగంపై తగిన మేరకు నియంత్రణలు విధించడం మిగులు నిల్వలు కలిగిన రాష్ట్రాల నుండి ఆహార ధాన్యాలను కొరతగా ఉన్న రాష్ట్రాలకు పంపిణీ చేయడంలో ప్రభుత్వం పంటలు పండని కరువు పరిస్థితుల్లోనే కాక సాధారణ పరిస్థితులందు కూడా కీలక పాత్ర వహించవలెనని కోరింది.

1943-47 లో ప్రభుత్వం పాలనపరమైన నియంత్రణలు ఆహార ధాన్యాల రంగంలో విధించి, ఆహార ధాన్యాన్ని నిల్వచేసి ప్రజాపంపిణి వ్యవస్థద్వారా ప్రజలకు పంపిణి చేయడం మొదలిడింది.



ఉ

ప్రారంభంలో ప్రభుత్వం స్థానికంగా సప్లై అవుతున్న ఆహార ధాన్యాన్ని సేకరించకుండా ధాన్యాన్ని దిగుమతి చేసుకొని పంపిణీ చేసేది. తర్వాతి రెండు దశాబ్దాల కాలంలో తరచుగా ప్రభుత్వ విధానాలు మారుతూ సులభ మరియు కఠినమైన నిబంధనలు కాలానుగుణంగా అవలంబిస్తున్నది. కేవలం రాజకీయ కారణాల వల్ల ప్రభుత్వం సులభతరమైన విధానాన్ని అవలంబించింది.

### పెరుగుతున్న ప్రభుత్వం పాత్ర :

పట్టిక-1 ద్వారా దేశం మొత్తం మీద ఉత్పత్తి అవుతున్న ఆహారధాన్యాలు (బియ్యంతో సహా) అందులో ప్రభుత్వం సేకరించిన (ప్రజా పంపిణీ కొరకు) నిలువలను తెలియ చేయడం జరిగింది. విధాన నిర్ణయాలు ఆయా సంవత్సరాలలో మారినప్పటికీ మొత్తం ధాన్యాల లభ్యతలో ప్రభుత్వ సప్లయిల శాతంలో చెప్పుకోతగిన మార్పు లేదు. 1951-55లో 8%, 1956-60లో 5.8% ఉండగా 1981-83 వరకు 12.76% ఉన్నది. కానీ బియ్యం సప్లయిలో ధాన్యంతో పోల్చినపుడు అధికంగా పెరుగుదల కలదు.

1965 సంవత్సర నుండి ఆయా రాష్ట్రాలను జోన్‌లుగా ఏర్పర్చి వానిపై కొన్ని నిబంధనలను విధించే కొత్త విధానాన్ని రూపొందించారు. అంతేకాక ఒకే రాష్ట్రంలోని మిగులు కలిగిన జిల్లానుండి ఇంకొక జిల్లాకు సప్లయి చేయడంపై కూడా ఆంక్షలు విధించారు. కేంద్ర ప్రభుత్వం జాతి అవసరాల దృష్ట్యా ప్రతి సంవత్సరం ఆయా రాష్ట్రాలకు కొంత కోటాను నిర్ణయించి ఆ కోటా మేరకు ధాన్యం సేకరించుటకు నిర్ణయించెను. ఈ నిర్ణయం వల్ల అధిక ఉత్పత్తి కలిగిన ప్రాంతాల మార్కెట్ ధరలపై దుష్ప్రభావము కలుగ చేస్తుందనే విమర్శ కలదు. రాష్ట్రాల ప్రజాపంపిణీకి అవసరమైన బియ్యం తదితరములు కేంద్ర ప్రభుత్వం అమ్మడం ప్రారంభించింది. ఇదే సంవత్సరంలో భారత ఆహార సంస్థను నెలకొల్పి ధాన్యం సేకరణ, నిలువలు మరియు పంపిణీ మొదలైన కార్యక్రమాలను ఆ సంస్థకు అప్పగించడం జరిగింది. ఇతర దేశాల నుండి దిగుమతి చేసుకొనే ఆహారధాన్యం విషయంకూడా ఈ సంస్థకు అప్పగించారు. కాలానుగుణంగా ఈ విషయంలో ప్రభుత్వం యొక్క పాత్ర పెరిగి వార్షిక నిల్వలు 15-18 మిలియన్ టన్నుల వరకు చేయడం జరిగింది. ఇది దేశం మొత్తం ఉత్పత్తిలో 10% మార్కెట్ అవుతున్న మిగులు ధాన్యంలో 25%గా ఉంది. 1980లో దేశం మొత్తంలో ప్రజాపంపిణీ వ్యవస్థ ద్వారా 13-16 మిలియన్ టన్నులు పట్టణ ప్రాంతాల వినిమయదారులకు పంపిణీ చేస్తున్నది. (కేవలం ఆంధ్ర ప్రదేశ్, కేరళ, తదితరములైన రాష్ట్రాలలో మాత్రమే గ్రామీణ ప్రాంతాలలో పంపిణీ జరుగుచున్నది.)

పట్టిక - 1

ఆహార ధాన్యం మరియు బియ్యం స్థూల ఉత్పత్తి, ప్రభుత్వం సేకరణ, నికర లభ్యత మరియు ప్రభుత్వం సప్లయిలు - అఖిలభారత స్థాయి 1951-83.

| సం॥లు | వార్షిక స్థూల ఉత్పత్తి సగటున (మిలియన్ టన్నుల్లో) | | వార్షిక ప్రభుత్వం సేకరణ సగటున | | స్థూల ఉత్పత్తిలో ప్రభుత్వం సేకరించిన నిష్పత్తి (శాతంలో) | | వార్షిక నికర లభ్యత నగటు (మిలియన్ టన్నుల్లో) | | వార్షిక ప్రభుత్వం సప్లయి సగటున | | నికర లభ్యతలో ప్రభుత్వం సప్లయి నిష్పత్తి(శాతంలో) | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఆహార ధాన్యం | బియ్యం | ఆహార ధాన్యం | బియ్యం | ఆహార ధాన్యం | బియ్యం | ఆహార ధాన్యం | బియ్యం | ఆహార ధాన్యం | బియ్యం | ఆహార ధాన్యం | బియ్యం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| 1951-55 | 63.09 | 25.06 | 2.19 | 1.51 | 3.47 | 6.04 | 57.59 | 23.59 | 4.64 | ఎన్.ఎ. | 8.05 | ఎన్. ఎ. |
| 1956-60 | 72.87 | 29.35 | 0.79 | 0.63 | 1.08 | 2.09 | 66.82 | 28.00 | 3.84 | 1.06* | 5.75 | 3.79* |
| 1961-65 | 83.02 | 35.97 | 1.45 | 1.20 | 1.74 | 3.33 | 77.86 | 33.87 | 6.45 | 1.78 | 8.29 | 5.25 |
| 1966-70 | 87.93 | 35.77 | 5.67 | 3.18 | 6.52 | 8.88 | 81.86 | 33.24 | 11.14 | 3.38 | 13.61 | 10.16 |
| 1971-75 | 103.02 | 41.63 | 8.03 | 3.60 | 7.80 | 8.65 | 93.16 | 38.36 | 10.17 | 3.38 | 10.92 | 8.80 |
| 1976-80 | 120.04 | 47.89 | 11.79 | 5.43 | 9.82 | 11.33 | 104.27 | 43.34 | 11.55 | 4.31 | 11.07 | 9.95 |
| 1981-83(P) | 130.41 | 51.12 | 14.65 | 6.95 | 11.23 | 13.60 | 114.99 | 47.79 | 14.67 | 7.28 | 12.76 | 15.22 |

# “ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది!”

“పోయిందే!”




మేలుపరచబడిన అమృతాంజన్ వాడడంతో.

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు.

మృదువైన అమృతాంజన్‌తో చాలా సులభంగా 'మర్దనా' వేయవచ్చు.

తలనొప్పులను, వొళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే అతి త్వరితంగా వుపశమింపజేయగలదు !

## మేలుపరచబడిన
## మృతా

మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా- తిరిగి వికసింపజేయగలదు!

Amrutanjan Limited

దేశీయంగా స్వయం సమృద్ధి మరియు జాతీయ స్థాయిలో విధానాల అమలులో ఏకత్వాన్ని సాధించుటకు ప్రభుత్వం ఈ రంగంలో ధరల నియంత్రణ, పేద ప్రజలకు సరసమైన ధరలకు అందచేయుటకు ఆ మేరకు సబ్సిడీలు ఇవ్వడం జరుగుతుంది. ఈ సబ్సిడీలు ముఖ్యంగా ఆహారం, ఎరువులు, నీటి పారుదల మరియు విద్యుశ్చక్తి రంగాలపై ఎక్కువ చేయడం జరిగింది. 1985-86లో కేంద్ర ప్రభుత్వం ఆహారంపై రూ॥ 16,500 మిలియన్లు, ఎరువులపై రూ॥ 20,500 మిలియన్లు సబ్సిడీగా ఖర్చు చేసింది. ఈ రెండూకలిపి కేంద్ర ప్రభుత్వ ఖర్చులో 6.8% కాగా మొత్తం కేంద్ర ప్ర సబ్సిడీలలో 75%గా ఉంది.[1]

## ఆహార రంగంలో ఆంధ్రప్రదేశ్ :

ఆ ... ద్వారా మిగులు ధాన్యం (బియ్యం) కలిగిన రాష్ట్రాలందు ఆంధ్ర ప్రదేశ్ ఒకటి. 1985-86 ఆర్థిక సంవత్సరంలో 9.4 మిలియన్ టన్నుల బియ్యం ఉత్పత్తి అయినట్లు అంచనా వేయబడింది. ఈ రాష్ట్రం నుండి అధిక మొత్తంలో బియ్యం ప్రైవేట్ వ్యాపారస్తులు / మిల్లర్లు కేరళ. తమిళనాడు, మహారాష్ట్ర మరియు పశ్చిమ బెంగాల్ వంటి రాష్ట్రాలకు అధికంగా ఎగుమతి చేయడం జరుగుతుంది. ఆ రాష్ట్రాలలోని మార్కెట్ ధరలు ఆంధ్ర ప్రదేశ్ ధరల కంటే అధికంగా ఉండటం జరుగుతుంది.

ఉత్పత్తి మరియు ఉత్పాదక మార్కెట్‌లో ప్రభుత్వం జోక్యం కేంద్రం ఇస్తున్న ఎరువుల ధరలపై సబ్సిడీ కాకుండా రాష్ట్ర ప్రభుత్వం విద్యుశ్చక్తి, నీటిపై సబ్సిడీ (తక్కువ ధరకు) ఇవ్వడం ద్వారా ఈ ఆహార ధాన్యం రంగంలో జోక్యం చేసుకోవడం జరుగుతుంది. అంతేకాకుండా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ ఏజెన్సీలు సేకరణ, రవాణా, నిలువలు మరియు పంపిణీ కార్యక్రమాలు చేపట్టడం జరుగుతుంది. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర పౌర సరఫరా సంస్థ 1985-86 లో 0.8 మిలియను టన్నుల బియ్యాన్ని టన్నుకు రూ॥ 2433 నుండి 2559ల మధ్య రేటు చొప్పున ప్రైవేట్ మిల్లర్ల వద్ద నుండి సేకరించింది, రాష్ట్ర ప్రభుత్వం బలహీన వర్గాల కుటుంబాలకు పంపిణీ చేయుటకు సబ్సిడీ ధరలపై 2 రూపాయలకు కిలో బియ్యం పథకం ప్రారంభించింది.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం 1965-66లో ఉత్పత్తిదారులే ప్రభుత్వానికి లెవీ చెల్లించవలెననే పథకాన్ని ప్రారంభించి భారత ఆహార సంస్థకు అప్పగించింది. కానీ ఈ పథకం ద్వారా ప్రభుత్వం ఆశించిన ఫలితాలు సాధించలేక విఫలమగుట వల్ల రద్దు చేయడం జరిగింది. 1968-69లో ప్రభుత్వం అన్నిరకాల ధాన్యం ప్రైవేట్ మరియు సహకార సంఘంలోని మిల్లులు ప్రభుత్వానికి విధిగా లెవి చెల్లించవలెననే నిబంధనలను రూపొందించింది. కేవలం హల్లర్ మిల్స్ మరియు బియ్యం వ్యాపారం కొనసాగించని హల్లర్ కమ్ షెల్లర్ మిల్స్‌కు మాత్రమే ఈ నిబంధనలు వర్తించవు. చెల్లించవలసిన లెవి ఎంత ఉండవలెననేవిషయం కాలానుగుణంగా, పంట పరిస్థితుల ననుసరించి మరియు ఆ సంవత్సరం ప్రజా పంపిణీకి వలసిన ధాన్యం అవసరాలను దృష్టియందుంచుకొని నిర్ణయించడం జరుగుచున్నది.

1985-86 ఆర్థిక సంవత్సరము ధాన్య సేకరణ విధానంలో మిల్లర్లు తమ మిల్లులో మర ఆడించిన ధాన్యం 50% జాతీయ ఆహార సంస్థకు చెల్లించవలె. అందులో 1 యూనిట్ బియ్యం భా. ఆ. సం. కి చెల్లించగా 0.5 యూనిట్ బియ్యం రాష్ట్ర ప్రభుత్వ సంస్థకు చెల్లించవలె. (ప్రభుత్వం నిర్ణయించిన ధరకు) తర్వాత మిగిలిన ధాన్యం రాష్ట్రంలోని ఏ ప్రాంతంలో నైనా అమ్మకం చేయుటకు మిల్లర్లకు అనుమతి ఉంటుంది. ఇందులో 1 యూనిట్‌ని మిల్లర్లు దేశంలోని ఏ ప్రాంతంలో నైనా అమ్మడానికి అనుమతి ఉంటుంది. ఇక సహకార సంఘాల విషయంలో 25% ప్రభుత్వానికి లెవీగా చెల్లించి మిగిలిన 75% బియ్యంను బహిరంగ మార్కెట్‌లో అమ్మకం చేయవచ్చు. ఈ సౌకర్యాన్ని వినియోగించుకొనని సహకార సంఘాలు మొత్తం బియ్యాన్ని ప్రభుత్వానికి అది నిర్ణయించిన ధరకే ఇవ్వవల్సిఉంటుంది.

కేంద్ర ప్రభుత్వం నిర్ణయించిన బియ్యం సేకరణ ధరలకు సంబంధించిన కాలశ్రేణి పట్టిక-2 ను పరిశీలించినట్లయితే సేకరణ ధర టోకు ధరల సూచీలో 0.6% నుండి 0.86% తక్కువగా ఉన్నట్లు గమనించవచ్చు. సాధారణంగా ధాన్యం ఉత్పత్తి తక్కువగా ఉన్న సంవత్సరాలలో సేకరణకూడా తక్కువగా ఉన్నది. రాష్ట్ర ప్రభుత్వం ఆయాకాలములందు ఉత్పత్తిదారులకు ప్రోత్సాహకరంగా ఉండేందుకు అదనంగా బోనసు ధరను ప్రకటించడం జరిగింది. 1966-67 నుండి 1976-77 మధ్యకాలంలో రాష్ట్ర ప్రభుత్వం 3% అదనంగా సేకరణ ధర (బోనసు ధర) చెల్లించినట్లు రాజ్ కృష్ణా మరియు రాయ్ చౌదరి (1980) నిర్ధారించినారు.[2]

## రాష్ట్రంలో ప్రజాపంపిణీ వ్యవస్థ :

1977-78 వరకు రాష్ట్ర ప్రభుత్వం ద్వారా సప్లయి కాబడుతున్న బియ్యం తదితరములైనవి మొత్తం వినియోగంలో కేవలము 1.2% మాత్రమే ఉండేది. కానీ ఆ తర్వాత ప్రభుత్వం సప్లయి పెరుగుతూ 1985-86లో అత్యధిక సప్లయి 28.86%ఉండినది. ఈ

1 కేంద్ర బడ్జెట్ గణాంకాలు 1985-86, 1986-87

2 రాజ్ కృష్ణ ఎండ్ రాయ్‌చౌదరి (1980) సమ్ యాస్పెక్ట్స్ ఆఫ్ వీట్ ఎండ్ రైస్ పాలిసీ ఇన్ ఇండియా.

పెరుగుదలకు ముఖ్యకారణం రాష్ట్ర ప్రవేశ పెట్టిన 2 రూపాయలకు కిలో బియ్యం పథకం.

ఈ పథకం (2 రూ॥ కి॥ బియ్యం) క్రింద వార్షిక ఆదాయం రూ॥ 6000ల కంటే తక్కువగా ఉన్న కుటుంబాలకు "ఆకుపచ్చ కార్డులు ఇవ్వబడతాయి. మిగిలిన వారికి పసుపుపచ్చ కార్డులు" ఇవ్వబడతాయి. ఆకుపచ్చ కార్డులు కలిగిన వారికి కుటుంబంలోని వ్యక్తికి 5 కిలోల చొప్పున గరిష్ఠ స్థాయిలో 55 కిలోల వరకు ఒక కుటుంబానికి ఇవ్వడం జరుగుతుంది. ఈ పథకం 232,063 చౌకడిపోల ద్వారా 27,221 గ్రామాలు మరియు పట్టణాలకు పంపిణీ చేయబడుతుంది.

పట్టిక - 2

ఆంధ్ర ప్రదేశ్‌లో బియ్యం సేకరణ మరియు వాని ధరలు

| సంవత్సరం 1 | సేకరి[illegible] బియ్యం టన్నులు | స్థూల ఉత్ప[illegible] సేకరించి[illegible] ధాన్యం నిష్పత్తి | సేకరించిన ధాన్యం ధర | టోకు ధరలలో సేకరించిన ధాన్యం ధర నిష్పత్తి |
|---|---|---|---|---|
| 1970-71 | 0.47 | 8.81 | 940.5 | 85.76 |
| 1971-72 | 0.27 | 5.72 | 940.5 | 72.82 |
| 1972-73 | 0.33 | 7.75 | 971.0 | 63.67 |
| 1973-74 | 0.70 | 12.54 | 1199.9 | 71.00 |
| 1974-75 | 0.89 | 15.61 | 1311.1 | 61.84 |
| 1975-76 | 1.38 | 21.40 | 1360.0 | 83.01 |
| 1976-77 | 0.48 | 9.74 | 1380.0 | 79.51 |
| 1977-78 | 0.61 | 11.51 | 1380.0 | 79.10 |
| 1978-79 | 1.04 | 14.00 | 1500.0 | 90.36 |
| 1979-80 | 0.47 | 7.45 | 1562.5 | 85.32 |
| 1980-81 | 0.70 | 9.99 | 1715.0 | 78.27 |
| 1981-82 | 1.10 | 13.98 | 1968.0 | 80.52 |
| 1982-83 | 2.00 | 26.08 | 2078.5 | 79.96 |
| 1983-84 | 2.42 | 27.53 | 2236.0 | 79.82 |
| 1984-85 | 2.74 | 37.95 | 2337.0 | 84.52 |
| 1985-86 | 2.48 | 28.29 | 2416.0 | 80.86 |

సూచన 1. మొదటి రకం ధాన్యం ధర

2. టోకు ధరలు మొదటి రకం, రెండవ రకం ధాన్యం 32:68 నిష్పత్తి లోని ధరల సగటు.

1984-85లో సుమారు 13.3 మిలియను ప్రజలలో సుమారు 70% ప్రజలు ఈ పథకం ద్వారా లబ్ధి పొందుతున్నారు. అయితే మిగిలిన కుటుంబాల ప్రజలకుకూడా ఈ ప్రజాపంపిణీ వ్యవస్థద్వారా రూపాయలు 2.65కిలో చొప్పున మరియు రూపాయలు 2.70కిలో చొప్పున పంపిణీ చేయటం జరుగుతుంది. మొత్తం మీద ప్రజాపంపిణీకి రాష్ట్రానికి 2 మిలియను టన్నుల బియ్యం అవసరం కాగా (1984-85) 1 మిలియను టన్ను జాతీయ ఆహార సంస్థ పంపిణీ చేయగా మిగిలిన 1 మిలియను టన్ను రాష్ట్ర ప్రభుత్వం తమ రాష్ట్ర సరఫరా సంస్థద్వారా సేకరించవల్సి ఉంటుంది. ఈ సేకరణలో సబ్సిడీపై పంపిణీ చేయడానికి ప్రభుత్వం 1983-84లో రూ॥ 958 మిలియన్లు, 1984-85లో రూ॥ 1371 మిలియన్లు, 1985-86లో రూ॥ 1317 మిలియన్లు ఖర్చు చేయడం జరిగింది.

[రచయితలు ఉస్మానియా విశ్వ విద్యాలయంలోని సెంటర్ ఫర్ ప్లానింగ్ ఎండ్ డెవలప్‌మెంట్ స్టడీస్‌లో పరిశోధకులు.]

—జె. విద్యాసాగర్ రెడ్డి

—ఎ. కె. వాసుదేవాచారి

## వి పి

వంట చెయ్యడానికి, వ్యాపారం చెయ్యడానికి, సినిమాలు సెక్సెస్ కావడానికి, మీరు కట్టుకున్న చీర మీరే కట్టుకోవడానికి, మీరు తొడుక్కున్న చొక్కా మీదవడానికి, సర్కారు వారి సంతాన నిరోధక ప్రకటన జయించడానికి, మీరు చదువుతున్న పత్రిక మీరు కొనడానికి, మీకు పిల్లల్ని కని, పెంచి పథకటించికీ, వంటింటికీ పరిమితమై పడి ఉంటానికి, మిమ్మల్ని ఆనంద పరచడానికి - ఇదనేమిటి, అదనేమిటి ప్రతిదానికి స్త్రీయే కేంద్రబిందువై ఉంది. ఐతే-

"స్త్రీకి కూడా శరీరం వుంది, దానికి వ్యాయామం యివ్వాలి

ఆమెకి మెదడు వుంది, దానికి జ్ఞానం యివ్వాలి

ఆమెకు హృదయం వుంది, దానికి అనుభవం యివ్వాలి"

అన్న కనీస దృక్పథంతో విస్తృతంగా కవిత్వం వెలువడడం ప్రారంభమైంది ఈ మధ్య కాలంలోనే.

ఈ దృక్పథం నుంచి వివిధ పత్రికల్లో వెలువడుతున్న ఉత్తమ కవిత్వాన్ని యెంచి పుస్తక రూపంలో ప్రచురించదలిచాము. మీరు చదివిన కవిత్వం కాని, మీరు వ్రాసిన కవిత్వం కానీ, ఈ ప్రకటన వెలువడిన నెల రోజుల్లోగా ఈ క్రింది చిరునామాకు పంపి పుస్తక ప్రచురణకు మాతో సహకరించవలసినదిగా కోరుచున్నాము.

—జింబో, ఇతరులు

పొయెట్రీ ఫోరమ్

9-1-17 వేములవాడ

(కరీంనగర్) - 505 302

# ఒక చిన్న సవరణ

జూలై, 1988 'భారతి' సంచికలో 'వేదసావిత్రి - భారత సావిత్రి' అన్న శీర్షికతో శ్రీ 'తి' చక్కటి భావస్ఫోరకమైన వ్యాసం రాశారు. భారత సావిత్రి-వేదసావిత్రికి ప్రతిబింబమని నిరూపించారు. ప్రసక్తానుప్రసక్తంగా అనేక ఇతర విషయాలను కూడా ప్రస్తావించారు. అయితే ఒక సంస్కృత వాక్యాన్ని అనువదించడంలో శ్రద్ధ వహించకపోవడంవల్ల పొరపాటు జరిగింది. భారతంలో సత్యవంతుడికి వాడిన విశేషణాలను ఒక పట్టీగా ఇస్తూ (పేజీ 11) ఇలా ఉదాహరించారు :

4. సత్యవాన్ - సత్యవాదీచ శిబిరౌశీనరో యథా దీనికి అనువాదం (శిబి ఔశీనరులవలె సత్యవాది).

ఉశీనరుడి కొడుకు ఔశీనరుడు. ఉస్(శీ)నరుడికి మాధవి యందు కలిగిన సంతానం శిబి ఒక్కడే. కనుక 'ఔశీనరుడైన శిబివలె సత్యవాది' అని అనువదించాలి. శిబి, ఔశీనరులు వేర్వేరు వ్యక్తులు కారు. 'ఔశీనరః శిబిః యథా' అని అన్వయం. సమాసం కాదు. ఇది ప్రమాదం.

—డా॥ గంటి శ్రీరామమూర్తి
అనకాపల్లి.

" "

(ఉర్దూలో సూర్యమంత్రం)

భారతి (జూలై 1988)లో "వేదసావిత్రి - భారత సావిత్రి" అనే వ్యాసంలో ఇక్బాలు కవి గాయత్రి మంత్రాన్ని "అఫ్తాబ్" (సూర్యుడు) అనే శీర్షికతో ఉర్దూభాషలో వ్రాసినాడని చెప్పితిని. స్థలాభావంచేత అప్పుడు వివరాలీలేదు.

ఇప్పుడు ఉర్దూ పాఠాన్నీ, వివరణనూ ఇస్తున్నాను.

సంస్కృత మూలం :

తత్ సవితుర్వరేణియం (వరేణ్యం అని కూడా)
భర్గో దేవస్య ధీ మహి
ధియో యోనః ప్రచోదయాత్
(ఋగ్వేదం 3-62-10)

ఉర్దూ అనువాదం :

"ఓ అఫ్తాబ్ జిన్‌సే జమానేమే నూర్‌హై
దిల్‌హై, ఖిరాద్‌హై, రూహ్-ఏ-రవాన్‌హై, షయూర్‌హై."

అర్థం : "పుడమికి వెలుగునిచ్చే ఆ సూర్యుడే
హృదయం, కారణం, ఆత్మ, జ్ఞానం"

"మఖ్‌జాన్"లో ఇక్బాలు ఈలాగు వ్రాసినాడు 1902): "వైదిక సంస్కృతం క్లిష్టత వలన, ఈనాటి భాషలో అనువదించడం దుస్సాధ్యమైన పని. "సవితృ" పదాన్ని ఉర్దూలోనికి తర్జుమా చేయడం అసంభవం. జగానికంతా వెలుతురునిచ్చే సూర్యుడే "సవితృ" అని సందర్భోచితంగా అనుకొనపలయును. ఇస్లాం వేదాంతులు సైతం పరమాత్ముని జ్యోతిస్స్వరూపునిగా వర్ణించిరి. (మన వేదర్షి "వేదాహమేతం పురుషం మహాంతం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" అన్నట్లు. "తి") పవిత్ర కురాను చెప్పుతుంది "అల్లాహు నూరు స్సమావతి వా ఉలర్ది". గాయత్రి మంత్రం అచ్‌హల్లుల సంక్లిష్ట సంకలనం. ఇందలి సూక్ష్మ స్వరమాధుర్యం, శ్రవణ సుభగత్వంలు భాషాంతరీకరణానికి అందేవి కావు. ఈ పరిమితాలను మనస్సులో ఉంచుకొని, సూర్య (మహా) నారాయణోపనిషత్తు భాష్యప్రకారం తర్జుమా చేసితిని. నా పద్యాలు బాగానే ఉన్నాయి. అయితే కూడా నా కవిత గాయత్రి కాదు."

మనకున్న మూడు జాతీయ గీతాలలో ఒకటైన "సారే జహాఁసే అచ్ఛా హిందుస్తాన్ హమారా"ను వ్రాసినది ఇక్బాలు కవియే.

"తి"

# అద్భుతం

జూలై భారతిలో ప్రచురింపబడిన "తి" గారి వేదసావిత్రి-భారత సావిత్రి చాలా అద్భుతంగా వుంది. వివిధ కోణాలనుంచి 'గాయత్రి'ని తరచి చూచి చక్కని వ్యాసాన్ని వారు అందచేశారు. ఇందుకు కృతజ్ఞతలు.

ఏ గ్రంథమైనా (ఆధ్యాత్మికం) వెల్లడించేది వెలుగును కోరమని తమస్సును వీడమని మాత్రమే. "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" అంటోంది గీత. వెలుతురు అనేది భౌతిక, అంతరంగికమైన రెండు అంశాలకూ వర్తించవచ్చు. మనస్సులోని తమస్సును పారద్రోలడానికి జ్ఞానమనే వెలుతురు కావాలి. మనస్సంటే ఆలోచనలే కాబట్టి ఆ చింతనలు సన్మార్గంలో వుండి మనిషి మనుగడకు నిర్దుష్టమైన మార్గం చూపేవిగా వుండాలి.

అట్లాగే జూన్ భారతిలో వచ్చిన మన ధ్యేయము-మన గమ్యము అనే అనువాద వ్యాసం భారతి పాఠకులకు జ్ఞానసంజీవని వంటిది.

'ధారణాద్ధర్మః' - లోకాన్ని ధరించేది ధర్మము-"ధృయతి ఇతిధర్మః"-లోకాన్ని నిలిపివుంచేది ధర్మము. 'ధర్మోరక్షతి-రక్షితః' ధర్మాన్ని మనం రక్షిస్తే అది మనని రక్షిస్తుంది. ఈ మూడు వ్యుత్పత్తులని నమ్ముకున్న ధర్మరాజు దీనదయాళ్‌గారు. అందుకేనేమో వారన్నారు "లోకజీవన రూపకల్పన ధర్మ"మని, మతరాజ్యాలు బ్రాహ్మణ నడతకి, ఫాసిస్టు రాజ్యాలు క్షత్రియ నడతకి, పెట్టుబడిదారి రాజ్యాలు వైశ్య నడతకి, సోషలిస్టూ నియంతృత్వ రాజ్యాలు శూద్ర నడతకి ఉదాహరణలని విశదీకరించిన దీనదయాళ్ వీటన్నిటిలో దేనినీ సమర్థించకపోవడం ఆయనలోని సూక్ష్మగ్రాహ్య ధర్మవివేచనకు మణిదీపం. అందుకే సమాజ వికాసానికీ, వ్యక్తి వికాసానికీ భంగం కలిగించని ధర్మరాజ్యం కావాలన్నారాయన. భారత సంస్కృతి పరిరక్షణకు ధర్మరాజ్యం కావాలనీ అయితే భిన్న భిన్న ధృక్పధాలను దేశ సమగ్రత, సమైక్యత దృష్టిలో వుంచుకొని ధర్మతత్వాన్ని సమరించుకోవాలని ఆయన సూచించారు.

మంచి వ్యాసాలను అందిస్తున్న భారతికి మరోసారి కృతజ్ఞతలు తెల్పుతూ

-కుమార్
కోడూరు

# గ్రంథ విమర్శం

## తెలుగువారి ఆది చరిత్రము

"సాహితీ సుధాకర" శ్రీ తేకుమళ్ళ రామచంద్రరావుగారు నాకు చిరకాల మిత్రులు. దాదాపు అరువది సం॥లపై కాలము నుంచి వారితో నాకు పరిచయం కలదు. కొంచెమించుమించుగా నాకు సమాన వయస్కులు. మద్రాసు నగరంలోనే మా పరిచయ మారంభ మయినది. నేను మద్రాసు ప్రసిడెన్సీ కళాశాలలోనూ వారు మద్రాసు క్రిస్టియన్ కళాశాలలోనూ ఉన్నత విద్య నభ్యసించే అవకాశం కలిగింది. చరిత్రలో వారు ఎమ్. ఏ. పట్టభద్రులయిరి. కేవలం పట్టభద్రులగుట వలననే కాదు వారి వైశిష్ట్యము. తియ్యనీటికి చేప ఎక్కినట్లు చారిత్రక విషయములలో వారి మేధస్సు పనిచేసే స్వభావం కలది. చారిత్రక విషయములలో వారితో పోల్చదగినవారు ఆంధ్ర ప్రదేశములో చాలా కొద్దిమంది యని చెప్పుటలో అతిశయోక్తి ఎంత మాత్రమూ లేదు. చరిత్రాభ్యాసమునందు వారికి గల సహజశక్తితో పాటు వారికి వారసత్వమువలన కూడా కలిగినదని నా అభిప్రాయం. వారి తండ్రిగారు శ్రీ తేకుమళ్ళ గోపాలరావుగారు అనేక చారిత్రక పరిశోధనలు చేసిన మహనీయులు. సింహపు కడుపున సింహపు పిల్లయే పుట్టును కదా!

న్యాయశాస్త్ర పరీక్షలో ఉత్తీర్ణులై మచిలీపట్టణములో న్యాయవాద వృత్తిని వారు చేపట్టినారు. నేను కూడా అచ్చోటనే న్యాయవాదిగా పనిచేసినందున వారితో గల మైత్రి మరింత గాఢమైనది. న్యాయశాస్త్రములోకూడా వారు దిట్టలే. బహుకాలము వారితో పరిచయ భాగ్యము నాకు కలిగిననూ వారిలో మహత్తరమయిన కవితాశక్తి నిగూఢమయి ఉన్నదని నాకు చాల కాలము వరకు తెలియదు. సాధారణముగా చారిత్రకులుగాని, న్యాయవాదులుగాని సాహిత్య రంగములో ప్రశస్తిని గనుట అరుదు. సుకవిత్వమునకూ చారిత్రక న్యాయపరిశ్రమకు ఏకత్రావధానము కడు దుర్లభము. ఆ రెండునూ తర్కప్రధానమయినవి. మరి కవిత్వమో అందుకు భిన్నము. చీకటి వెలుగుల వలె ఇవి పరస్పర భిన్నములని చెప్పవచ్చును. పరస్పర భిన్నములయిన రెండు శక్తులయొక్క సమ్మేళనము అసాధారణము. ఇట్టి అద్భుత సమ్మేళన దృశ్యము శ్రీ రామచంద్రరావుగారిలో విదితము. మచిలీపట్టణములో బహు పురాతనమయిన దేవాలయము శ్రీ నాగేశ్వర స్వామివారిది. ఆ స్వామివారి మాహాత్మ్యమును గూర్చి వీరొక గ్రంథమును రచించిరి. దాని ఆవిష్కరణ సమయములోనో వేరొక సమయములోనో నాకు సరిగా జ్ఞాపకము లేదు, నేను పాల్గొనుట సంభవించినది. ఆనాడు వారి కవితా సౌరభమును ఆఘ్రాణించు ప్రసక్తి నాకు కలిగినది. అందులోని పద్యముల గుబాళింపు నన్ను మిక్కిలి ఆకర్షించినది. ఆ తరుణమున నేను ఉపన్యసించినట్లు కూడా నా స్మృతి పథమున కలదు. నిజముగా నేను ఆశ్చర్య చకితుడ నయితిని. ఆ పద్యములు చదువుచున్నపుడు నాకు కలిగిన ఆనందమునకు అవధి లేదు. ఆ శబ్దశయ్య కవిసార్వభౌమ శ్రీనాథ మహాకవిని గుర్తు తెచ్చినది. ఆ విషయమునే "కవిసమ్రాట్", "కళాప్రపూర్ణ" శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారున్నూ, సాహిత్య రత్నాకరుడని చెప్పదగిన శ్రీ దివాకర్ల వేంకటావధానిగారూ వెలిబుచ్చిరి. ఇట్టి శక్తి శ్రీ రామచంద్రరావుగారికి ఎట్లు కలిగినదో చెప్పజాలను. పూర్వజన్మ పుణ్యవిశేషమని ఊహించక తప్పదు. ఏలయన నాకు తెసినమట్టుకు సంస్కృతభాష యందుగాని, తెలుగుభాష యందుగాని ఏ గురువు వద్దనూ వారు అభ్యసించినట్లు లేదు. ఆ భాషలలో పాండితీ ప్రౌఢి రావలెనన్న మహనీయులయిన గురువులవద్ద అభ్యసించుటయో లేక అపారమయిన స్వయంకృషి చేయుటమో కావలసియున్నది. ఆ రెండునూ వీరు చేసినట్లు లేదు. అందువలన పుట్టుకతోనే వీరు కవి అనిపించును. ఆంగ్లములో ఒక చక్కని సూక్తి కలదు. "పొయెట్స్ ఆర్ బార్న్ బట్ నాట్ మేడ్". అనగా "పుట్టుకతోనే కవులు గాని చేస్తే కవులు కాదు". సంగీతము, సాహిత్యము, కవిత్వమూ, శిల్పకళ, చిత్రలేఖనమూ మొదలయిన కళలు జన్మతో రావలసినవే గాని అభ్యాసమాత్రము వలన వచ్చేవి కావు. బహుశః పూర్వజన్మలలో చేసిన విశేష కృషి యొక్క ఫలితముగా ఈ జన్మలో కలిగి యుండవచ్చును. "ప్రపేదిరే ప్రాక్తన జన్మ విద్యాః" ఇది మహాకవి కాళిదాస సూక్తి. ఈ సూక్తి కవిత్వాంశములో శ్రీ రామచంద్రరావుగారికి తప్పక అనువర్తించునని నా అభిప్రాయము. లేకున్న ఇంతటి మధుర మనోహరమయిన కవితా స్రవంతి వారి ముఖము నుండి వెలువడజాలదు. వీరి గ్రంథములు చదువునప్పుడు కవిసార్వభౌమ శ్రీనాథమహాకవి నిషధ చక్రవర్తిని కీర్తించుచూ వ్రాసిన పద్యమొకటి నా తలపునకు వచ్చును.

"నిఖిల విద్యానటీ నృత్త రంగస్థలాయత నాయమాన జిహ్వాంచలుండు"

అనగా "సమస్త విద్యా నటీమణుల యొక్క నాట్యమునకు రంగస్థలముగా చేయబడిన జిహ్వాంచలము కలవాడు." కవితానటీమణి శ్రీ రామచంద్రరావుగారి జిహ్వాంచలమునందు తాండవించినదంటే అతిశయోక్తి కాదు.

ఏ కవిత్వమయినా సుకవితా లక్షణ లక్షితము కావలెనంటే "ధారాశుద్ధి", "శబ్దశయ్య", "భావుకత్వము", "అర్థగాంభీర్యము", "రసాత్మకత్వము" కలిగియుండ వలయును. ఈ పంచలక్షణము లును చక్కని మోతాదులో, వీరు రచించిన "తెలుగువారి ఆది చరిత్రము" అనే గ్రంథములో ప్రతిఫలించుచున్నవి. ఎట్టి అవరోధమూ లేకుండా సాఫీగా చదువుటకు గల యోగ్యతను బట్టి ధారాశుద్ధి నిర్ణయించవలసి యున్నది. గతుకులు లేని చక్కని సిమెంటు రోడ్డుమీద మంచి స్థితిలో ఉన్న మోటారు కారు ఏవిధముగా పయనించునో పద్య గమనము ఆ విధముగా ఉండవలయును. అట్లున్నప్పుడే "ధారాశుద్ధి" కలిగి చదువ వలెననే కుతూహలము పాఠకునికి ఉద్భవించును. దీనితో పాటు "శబ్దశయ్య" ఆవసరము. "పదానాం అన్యోన్యమైత్రీ శయ్యేతి కథ్యతే" అనగా శబ్దముల యొక్క కూర్పు పొందిక సరిగా నుండ వలయును. మంచి వడ్రంగి రెండు కొయ్యలను కలుపుటలో తన శిల్ప నైపుణ్యముచే ఎట్టి సందు లేకుండా ఒక కొయ్యగా కానుపింప జేయునో అట్టి పదములయొక్క కూర్పు "శయ్య" అని చెప్పబడు చున్నది. కవిత్వధార చక్కగా నున్ననూ శబ్దముల యొక్క పరస్పర మైత్రీ సరిగా లేనిచో అట్టి కవిత్వము శోభిల్లదు. భోజన పదార్థములెట్టివైననూ భోజనపాత్ర ఆకర్షణీయముగా లేనిచో అతిథులకు ఎట్లు రుచించవో, అవయవ సౌష్ఠవమెట్లు ఉన్ననూ శరీర కాంతి లేనిచో చూపరులు ఎట్లు ఆకర్షితులు కారో ఆదేవిధముగా "ధారాశుద్ధి" "శబ్దశయ్య" అను లక్షణములు లోపించినపుడు ఇతర లక్షణములు మంచివి అయిననూ పాఠకుల మనస్సును కావ్యము వైపునకు త్రిప్ప జాలవు.

ఉ॥ కలదుకదా ప్రసిద్ధమగు కాంచనశైలము, విష్ణు భార్గవీ
నిలయము, సత్యలోక రమణీ గణసేవిత శృంగమూల ము
త్పల కమలప్రసూన రసబంధుర శైవలి నీ సహస్ర, ము
జ్వల నవరత్న కందర విశాలము, మేరునగాఖ్య మిద్ధరన్॥

మ॥ పతదుర్వీ రుహవార వాహమయి, విభ్రాంత ప్రజాస్తోమమై;
సతత స్పర్శన వీచికా భ్రమణ చంచత్పక్ష భీతాండజ
ప్రతతిధ్వాన విమిశ్ర భంగ నివహ ప్రాదుర్భవ ద్ఘోషమై
కృతఫేనావృతమైన నీలనది పొంగెన్ పాతె శంఖాబ్ధికిన్॥

ఈ లక్షణములకు పై పద్యములు నిదర్శనములు.

కేవలమూ "ధారాశుద్ధి" "శబ్దశయ్య" అను లక్షణములు మాత్రమే ఒక కావ్యమును సుకవితా యోగ్యముగా చేయజాలవు. వాటితో పాటు "భావుకత" మొదలగు లక్షణములు అత్యావశ్యకములు. "భావుకత్వము" వంటి లక్షణములున్నపుడే "కావ్యము" అనే శబ్దము సార్థకమగును. సత్కవికి "భావుకత్వము" అవసరము. భావుకత్వ మనగా ఒక సన్నివేశమును వర్ణించినపుడు అందులో సామాన్యముగా కనబడే వివిధములయిన సుందర ఘట్టములు ఉండుటయే. దీనినే ఆంగ్లములో "ఇమాజినేషన్" అంటారు. కవి తన ఊహా బలముచేత ఆయా సన్నివేశములలో సంభవించదగు నానావిధములయిన వివరములను చక్కగా చిత్రించ గలడు. ఒక వివాహసందర్భమున్నదనుకొనుడు. ఆ సందర్భమున చిన్న చిన్న విషయము లనేకములు జరుగును. వాటినన్నింటినీ ఊహా ప్రపంచమునందు సృష్టించుకొని సుకవి అయినవాడు తన కవితా స్రవంతిలో చేర్చుకొనును. వీరి గ్రంథములోని చతుర్థాశ్వాసములో ఆంధ్రవిష్ణు వివాహ మహోత్సవము వర్ణింపబడియున్నది. ఆ వర్ణనము యందు కవిగారి కవిత్వములోని భావుకత్వ లక్షణము విశదమగుచున్నది. శ్రీకాకుళ ఖండము అను చతుర్థాశ్వాసములోని ఆ వివాహ వర్ణన గమనార్హము.

ద్వితీయాశ్వాసములో ఆదిమానవుల జీవనవిధానమును గూర్చి వీరి ఊహాజనిత మయిన భావములతో బహు రమ్యముగా వర్ణించిరి. దీనికి క్రింది ఈ పద్యమును ఉదాహరణముగా పేర్కొనవచ్చును.

సీ॥ కందమూలమ్ముల, డాయలగసరుల
ఫలముల క్షుద్బాధ బాపుకొనుచు,
కహ్లార కువల కాసార నిమ్నగా
జలముల దాహోపశాంతి గనుచు
ఇసుక తిన్నియలపై వసుమతీజములపై
విపినాంతరంబుల విశ్రమించి
గుబురాకు మండల గుచ్ఛముల్ పెనుచలి
గాలుల కడ్డుగా గప్పుకొనుచు

గీ॥ బాలభానుని వే యెండ బరుగు లిడుచు
రేయి తొలిజాము వెన్నెల హాయిగనుచు
చీకటులవేల దాగుచు చెట్లమీద
బ్రతుకు సాగింప నరులలవాటుపడిరి.

ఆదికవి నన్నయభట్టారకుడు "సారమతిన్ కవీంద్రులు ప్రసన్న కథా కవితార్థయుక్తి లోనారసి మేలునాన్" అని వచించి యున్నాడు. ప్రసన్నమయిన అర్థమునుకలిగియుంటే దానిని కవీంద్రులు మెచ్చెదరు అని దాని భావము. శ్రీ రామచంద్రరావుగారి గ్రంథములో అన్ని పద్యములూ "ప్రసన్న కథా కవితార్థయుక్తి" కలిగియున్న

వని చెప్పుటకు సత్యదూరము కాదు. నన్నయభట్టు నిర్వచించిన లక్షణము వీరి కావ్యమునకు పూర్తిగా అన్వయించునని చెప్పవచ్చును.

కవిత్వముయొక్క పరమావధి "రసస్ఫూర్తి". రసాత్మకము కాని కావ్యము ఎంత గొప్పది అయిననూ కావ్యశబ్దమునకు అర్హము కాదు. రసము ఆత్మ వంటిది. శరీరము ఎంత సుందరమయిననూ జీవుడు లేనిచో అది ఎట్లు శవప్రాయమో 'రసోత్పాదన' శక్తిలేని కావ్యమును కావ్యశవము అని అనవచ్చును. రసములు నవవిధములుగా అలంకారికులు వివరించియున్నారు. కావ్యమునకు ఒకటిగాని అంతకు ఎక్కువగాని రసములు ప్రధానములయి ఉండవలయును. వీరి కావ్యము చారిత్రక విషయముల గూర్చి చెప్పుచున్ననూ కరుణరసము, వీరరసము, శాంతరసము ప్రధానములుగా కనిపించును. మానవుల యొక్క వలసలగూర్చి చెప్పుటలో వారనుభవించిన కష్టములు కరుణ రసస్ఫోరకములుగా ఉన్నవి. యుద్ధముల యొక్క వర్ణనలు వీర రసమును కురిపించుచున్నవి. ఆంధ్ర విష్ణువు తన సామ్రాజ్య స్థాపన చేసిన పిదప చేయబడిన వర్ణనలలో శాంతరస ముట్టిపడుచున్నది. ఈ ప్రకారముగా పైన వివరింపబడిన పంచలక్షణ కలితమయిన ఈ 'గ్రంథరాజము' ఉత్తమ ప్రబంధ శ్రేణిలో చేరియున్నది. ఇందు అనేక వర్ణనలు చేయబడియున్నవి. ప్రబంధ యోగ్యతను సంపాదించుటకు వర్ణనలు చాలా అవసరము. మనుచరిత్ర, వసుచరిత్రాది ప్రబంధములలో ప్రముఖములయిన వర్ణనలు కలవు. ఆ పోకడలనే కవిగారు కూడా అనుసరించిరి.

ఆంధ్రవిష్ణు సామ్రాజ్య రాజధాని అయిన శ్రీకాకుళ నగర వర్ణన అతి రమణీయముగా ఉన్నది.

సీ॥ ఒకదానిప్రక్క నింకొకటిగా నరదంబు
లై దుసాగు విశాలమైన వీధు
లంతకు మూడింతలై, మహాపగలట్లు
రంజిల్లు చక్కని రాజపథము;
లావణ్యుల బహుజనానీక యుతములౌ
వర్తక వ్యాపార భవనచయము;
ధాన్యాది వస్తు వితానముల్ పురికి
పుష్కలముగా గూర్చు నగార వితతి
గీ॥ అళిగణము కూర్చు మధుకోశ మట్టులలరు
న్యాయసభ, కచేరులు సచివాలయంబు
ముచ్చటగ నొప్పు భవనసముచ్చయంబు
కలిగి పురిపొల్చు కెరటాల కడలివోలె.

అదే విధముగా ఋతువర్ణన ప్రబంధములలో ఎక్కువగా కానవచ్చును. ఈ కవిగారు వసంత ఋతువును చతుర్థాశ్వాసమునందు బహు మనోహరముగ వర్ణించిరి. ఉదాహరణముగా క్రింది పద్యమును పేర్కొనుచున్నాను.

సీ॥ తీగలన్, తరులను, తీయవై, దోరవై
కెరలు పండ్లను మెక్కు కీరచయము
తావులు వెదజల్లు పూవులపై వ్రాలి
మకరందములు దోచు మధుకరములు
లలిత చూతాది పల్లవ సక్త కంఠమై
యింపుగా పాడు కోయిలలపిండ్లు
ప్రకృతి చిత్ర రచనా ప్రావీణ్య ముకురమై
చెలగు సీతాకోకచిలుక గణము
గీ॥ గోరువంకలు, తూనిగల్, గొల్లభామ
లెల్ల హృత్కోశముల నిండు చెలిమి నింప
నెసగె వసుధాతలము పెండ్లి ఇల్లువోలె
చాల సందడితో నా వసంతవేళ

అలంకారములలో కవులు ఎక్కువగా వాడునది, చదువరుల మనస్సునకు హత్తుకొనునది ఉపమాలంకారము. "ఉపమా కాళిదాసస్య" అన్న సూక్తి కలదు. కాళిదాస మహాకవి రఘువంశ, కుమార సంభవ మహా కావ్యములలో అతివిస్తారముగా చక్కని ఉపమానముల నిచ్చియున్నాడు. అందువలననే ఆ కావ్యములు కవి పండిత ఆదరణమును మిక్కిలిగా అందుకొనినవి. ఈ అలంకారమును వినియోగించుటలో శ్రీ రామచంద్రరావుగారు సిద్ధహస్తులు. తృతీయాశ్వాసములో "విశ్వామిత్రుని సంకల్పములు ఫలించుట" అను శీర్షిక క్రింద వ్రాసిన ఈ పద్యము, ఉపమాలంకారమునకు ఉదాహరణ.

తే॥ తరుణ బహువర్ణ పుష్ప కదంబమట్లు
తన సుతులతోడి కృత్తిక తారయట్లు
లుపనదులతోడి ధుని యట్టులుజ్వరించె
నటులగాధేయ సంతాన మాంధ్రజాతి

చతుర్థాశ్వాసములోని ఆంధ్రవిష్ణువు వివాహ సందర్భమున వ్రాసిన మరొక పద్యము ఉపమాలంకారమున కింకొక ఉదాహరణ.

సీ॥ పెండ్లివారలపైన వృక్షాళి పర్ణముల్
చిలికె సంతత శుభాశీస్సులట్లు;
పరిపక్వ తింత్రిణీ ఫలములు వ్రేలాడె
స్వాగతాలంకార పంక్తులట్లు;
ఉసిరిక పెనుగుత్తు లుర్వీరుహమ్ముల
గ్రాలె విద్యుద్దీప కళికలట్లు;
నగ్న భూరుహ రాజి నయనమ్ములకు దోచె
బారులు తీర్చిన భటుల యట్లు

గీ॥ అడుగడుగునకు తమకు నాహ్లాదమొసగ
నలరి, వియ్యంకుడిల నిట్లు మలచినట్లు
చిత్తసీమల దోచె నా శిశిరవేళ
ఆంధ్రవిష్ణుని కల్యాణ యాత్రికులకు

తెలుగు వాఙ్మయములోనూ, తెలుగు సమాజములోనూ చిక్కని సామెత లనేకము లున్నవి. ఈ కవి మనోహరములయిన కొన్ని సామెతలను ఈ కావ్యమున చేర్చియున్నారు.

"మొగముపై కోపమును చెంది ముక్కు కోసికొన్నటులు"; "బొడ్డు మల్లెలేల బోడితలకు" వంటి సామెతలు అనేకములు ఈ కావ్యమున కానవచ్చును.

పూర్వకవులు సామాన్యముగా సీసములు, తేటగీతులు, ఆటవెలదులు, ఉత్పలమాలలు, చంపకమాలలు, శార్దూల విక్రీడితములు, మత్తేభ విక్రీడితములు, కందములు మొదలగు వృత్తములను ఎక్కువగా ఉపయోగించిరి. అటులనే ఈ కవిగారు కూడా ప్రధానముగా ఈ వృత్తములనే అవలంబించి వీటికితోడు మంజరి, మత్తకోకిల, ద్విపద, మధ్యాక్కర మొదలగు వృత్తములు కూడ అక్కడక్కడ బహు ధారాళముగా వినియోగించిరి. ఈ కావ్యవస్తువు చరిత్ర అయిననూ కమనీయ కావ్యముగా వీరు రూపొందించిరి. ఈ కావ్యము ఆంధ్ర వాఙ్మయమున్నంతవరకూ కావ్యాకాశములో ఒక నక్షత్రముగా భాసించ గలదని నా విశ్వాసము. నేను కవిని కానుగాని కవిత్వాభిలాష కలవాడను. ఆ కారణమున ఒక చిన్న పద్యమును అల్లి ఇందు పొందుపరచినాను.

ఆ.వె॥ పలుకు సొబగు తేనె లొలుకజేయుచునుండు
భావసరళి యామవల మనోజ్ఞ
రుచుల నీనుచుండు రోచిష్ణువగు నీదు
కవిత ప్రౌఢయైన గరితవోలె.

—కాశీనాథుని పూర్ణ మల్లి కార్జునుడు

## సామాజిక సాహిత్య వ్యాసాలు

[డా॥ ముదిగొండ వీరభద్రయ్య, క్రౌన్ పుటలు 178. వెల: సాదా ప్రతి రూ. 25/- లైబ్రరీప్రతి రూ. 30/-, ప్రతులకు- శ్రీమతి యం. యన్. హైమవతి. కేర్ ఒచయిత 6-6-14ఒ, శ్రీసాయి నికుంజం రవీంద్రనగర్, నల్లగొండ-508 001]

ఆధునిక విమర్శకులలో డా॥ వీరభద్రయ్యగారు ఒక ప్రత్యేక కోవకు చెందినవారు. ఆధ్యాత్మిక భౌతిక తత్త్వదృష్టితో సాహిత్యం సామాజిక సాంస్కృతిక విలువలను బేరీజు వేయడంలో వీరు సిద్ధహస్తులు. అటు జి. కె, అరవింద, సత్యసాయిబాబాలనూ, ఇటు శ్రీశ్రీ, గోపీచంద్, విశ్వనాథ, శేషేంద్ర, రావిశాస్త్రి, చలం మొదలైనవారినీ ఒకే త్రాటికి కట్టగల దిట్ట వీరు.

ఈ సంకలనంలో మొత్తం పన్నెండు వ్యాసాలున్నాయి. వీటిల్లో చాలావరకు 'భారతి'లో ప్రచురితాలే! పేరుకు తగ్గట్టుగా సమాజానికీ సాహిత్యానికీ సంబంధించిన రెండు తరహాల వ్యాసాలున్నాయి ఈ సంపుటంలో.

మొదటిది - మానవతా విలువలు - శ్రీ సత్యసాయి సేవాయోగం అనేది. సత్యశివ సుందరాకారుడైన స్వామి మానవసేవనే ఒక యోగంగా మార్చి నిష్కామకర్మ ద్వారా ఆధ్యాత్మికతను ఏ విధంగా చాటిచెప్పారో ఈ వ్యాసం వివరిస్తుంది. రెండోది - ఆదర్శ సమాజం- జగన్నాథుని రథం-శ్రీ అరవిందుల సిద్ధాంతం. 'జగన్నాథేర్‌రథ్' అనే పేరన అరవిందులు వంగభాషలో రచించిన ఆదర్శ సమాజాన్ని 'జగన్నాథుని యాత్రా రథం'తో ఉపమించి, ఐక్యత - స్వాధీనత- జ్ఞానం-శక్తి అనే నాల్గింటినీ ఆ రథచక్రాలుగా దర్శించిన తీరుతెన్నులను ఇందులో వివరించడం జరిగింది. మానవాభ్యున్నతికి తత్త్వశాస్త్రం తోడ్పడేవిధంగా అరవిందులొనర్చిన కృషి నిరూపించబడింది. మూడో వ్యాసంతో గోపీచంద్‌గారి పోస్టు చెయ్యని ఉత్తరాల ద్వారా ఆధ్యాత్మిక భౌతికవాదాల సమన్వయ సిద్ధాంతం ఏ విధంగా ప్రకటితమయిందీ వ్యాసకర్త వివరించాడు. మార్క్సిస్టు దృక్పథంతో గోపీచంద్ భౌతికవాదులను ఖండించిన విధానాన్ని సోదాహరణంగా తెలిపాడు.

'కవిత్వ రచనలో కవి పాత్ర ఏమిటి?' అనే నాలుగో వ్యాసం డా॥ ముదిగొండ ప్రతిభను పట్టిచూపుతుంది. సాహిత్యావలోకనంలో ఆయనకున్న అవగాహనకు ఇది ఒక మచ్చుతునక.

'కొడవటిగంటి కుటుంబరావుగారి బుద్ధికొలత వాదం' అనే అయిదో వ్యాసానికి "బుద్ధికొలత - అసాధారణ అనుభవాలు" అనే కొడవటిగంటి వ్యాసం ఆధారం. ఆర్థిక భౌతిక పునాదిమీద భావ నిర్మాణం ఆధారపడి వుంటుందని మార్క్సిజం చెపుతుంది. అయితే దానిని మరికొంత విస్తరించి 'బుద్ధి'కి ప్రాధాన్యమిచ్చారు శ్రీ కొడవటిగంటి. జగత్తు అస్తిత్వానికున్న స్థలం, కాలం అనేవాటితోపాటు బుద్ధి అనే మూడో కొలత కూడా పనిచేస్తున్నదని ఆయన ప్రతిపాదించ

డాన్ని ఈ వ్యాసం నిరూపిస్తుంది. దానిపై వచ్చిన వ్యతిరేక విమర్శ లను కూడా వ్యాసకర్త ప్రస్తావించడం విశేషం.

తరవాతది 'భావకవిత్వం' అనే వ్యాసం. 22 పుటలలో సాగిన ఈ వ్యాసం భావకవిత్వం పుట్టు పూర్వోత్తరాలూ-దాని మౌలికత-ప్రభావం మొదలైన విషయాలను వివరిస్తుంది.

వ్యాసారంభంలోనే 'భావకవిత్వాన్ని ఆంగ్ల సాహిత్యంలో రొమాంటిక్ పొయెట్రీ అని పిలుస్తారు (పు 58) అంటూ విశ్వనాథవారు (పు 65), వేలూరివారు (పు 76) 'లిరికల్ పొయిట్రీ' అనడం గూర్చి పేర్కొన్నారు వ్యాసకర్త.

నిజానికి భావకవిత్వమనేది 'లిరికల్ పొయిట్రీ'కే సమానార్థకం కాని రొమాంటిక్ పొయెట్రీకి "కాల్పనిక కవిత్వ" మనేదే ప్రసిద్ధ అనువాదం. దాని మానసపుత్రిక భావకవిత్వం.

అలాగే 'మంచి కవిత్వానికేది నిర్వచనమో - భావ కవిత్వం అన్నదానికి కూడా అదే నిర్వచనం' (పు 80) అని వ్యాసకర్త అనడం చూస్తే అచ్చ కవిత్వానికీ భావ కవిత్వానికీ భేదం పాటించలేదనిపిస్తుంది. కాని అచ్చకవిత్వమంతా భావకవిత్వం కాదు. భావకవిత్వమంతా అచ్చ కవిత్వం కాదు. మౌలికంగా ఉన్న తేడాను పరిశీలించడం అవసరం. (చూ. వివరాలకు - నాచే ప్రచురించబడ్డ 'భావకవులు - ప్రతిభా విస్ఫూర్తి' అనే సిద్ధాంత గ్రంథం (ఫిబ్ర 1987)

ఆ తరవాతది అన్నింటికన్నా పెద్ద వ్యాసం 'అధివాస్తవిక కవిత్వం' అనేది (పు 81-108) శ్రీశ్రీ - కాడ్‌వెల్ మొదలైనవారు చెప్పిన విషయాలను ప్రస్తావించి వాస్తవికత - కల అనే రెంటినీ ఒక్కటిగా మేళవింపజేసేదే అధివాస్తవికత అంటూ సోపపత్తికంగా నిరూపించిన ఈ వ్యాసం రచయిత విశ్లేషణాశక్తిని ప్రకటిస్తుంది. తరవాత ఉన్న 'ప్రతీక కవిత్వం' కూడా ఇంచుమించు అలాంటిదే. అయితే 'నవ్య అలంకార శాస్త్రం మార్క్సిస్ట్ దృక్పథం' అనేది మొత్తం సంపుటిలో హైలైట్. మార్క్సిస్ట్ మార్గంలో సాహిత్య వేత్తలూ-రాజకీయ ప్రముఖులూ సాహిత్య కళలను గూర్చి ప్రకటించిన అభిప్రాయాలు ఇందులో చక్కగా విశ్లేషించబడ్డాయి.

ఈ సంపుటంలో రావిశాస్త్రిగారి 'మూడుకథల బంగారం' గూర్చి రెండు వ్యాసాలున్నాయి. మొదటిది వారి ధర్మదృష్టినీ, రెండోది అలంకార రచననూ సోదాహరణంగా వివరిస్తాయి. చిట్టచివరిది చలంగారి సుధ కావ్యాన్ని వివరిస్తుంది.

భిన్న దృక్కోణాలను ప్రకటించే ఈ వ్యాస సంకలనం అవశ్య పఠనీయం అనడంలో ఎలాంటి సందేహం లేదు.

## శ్రీ శేషేంద్రుని కవిత్వంపై కవిత్వం

[డా॥ ముదిగొండ వీరభద్రయ్య, క్రౌన్ పుటలు 87, వెల: ఉచితం. ప్రతులకు: రచయిత-ఎడ్రసు పైదే.]

శేషేంద్ర శర్మగారు గొప్ప కవి, పండితుడు, విమర్శకుడు. ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య ధోరణులను క్షుణ్ణంగా అవగాహన చేసుకున్న వ్యక్తి. తన కవిత్వాన్ని గూర్చి ఆయనే కొన్ని వ్యాఖ్యాన గ్రంథాలు వెలువరించడం ఒక విశేషం.

'ఆధునిక మహాభారతం' అనే పేరన వెలువడిన అలాంటి ఒక గ్రంథాన్ని పరిచయం చేసే ప్రయత్నమే ఈ చిరుపొత్తం.

కవిత్వ వస్తువు, ప్రయోజనం, శబ్దం, శిల్పం, అలంకారం, ప్రతీక మొదలైన విషయాలు ఇందులో ప్రస్తావించబడినా కవిత్వ ఉత్పత్తి స్థానంగూర్చి ముఖ్యంగా చర్చించబడింది. శబ్దానికి ప్రాణమూ, శక్తీ, ప్రభావం అనే మూడు లక్షణాలున్నప్పుడే కవిత్వభాష అవుతుందనడం ఈ చర్చలోని ఒక విశేషం.

ఈ చిన్న పుస్తకాన్ని శర్మగారికే అంకితమిచ్చి డా॥ ముదిగొండ వారిపై తనకున్న గౌరవాన్ని చాటుకున్నారు.

## నా దేశం-నా ప్రజలు (విప్లవకావ్య విమర్శ)

[డా॥ ముదిగొండ వీరభద్రయ్య, డెమ్మీ పుటలు 90, వెల: రూ. 16/- చిరునామా పైదే.]

శేషేంద్ర శర్మగారి అభ్యుదయ పంథాకు అద్దంపట్టే ఒక 'నా దేశం - నా ప్రజలు' దీనిమీద సాహితీలోకాన ఇప్పటికెంతో విమర్శ వెలువడింది. అలాగే వీరభద్రయ్యగారు తన విశ్లేషణాశక్తిని ప్రకటించే విధంగా వివిధ దృక్కోణాలనుంచి ఆ కావ్యాన్ని పరిశీలించారు.

ఈ కావ్యం విప్లవకావ్యం అనడం ఎందుకో నిరూపించారు వ్యాసకర్త. కవిత్వం కానిదాన్తో రాజీపడక పోవడం, తన కావ్యాలకు మార్క్సిస్టు దృక్పథాన్ని పునాదిగా ఉంచడం అనే రెండు సిద్ధాంతాలు శర్మగారి కవిత్వానికి ఆధారాలు అని చెప్పడం ఒక విశేషం.

'అక్షరాక్షరం కవిత్వపు నీలి సముద్రంలో ముంచి రాశాడు' (పు 82) అని శ్రీ శేషేంద్రను గూర్చి వ్యాసకర్త ఇచ్చింది ఒక చక్కని కితాబు.

అంతేకాదు. ఈ కావ్యం 'రానున్న విప్లవ కావ్యాలకు దారిని వేసిందనీ, చచ్చిపోయిన అభ్యుదయ కవిత్వానికి పునః ప్రాణప్రతిష్ఠ చేసిం'దనీ (పు 6) కావ్యంలో కవే నాయకుడూ శ్రామికుడూ అనీ (పు 12), కార్మిక కర్షక సోదరులలో రేఖలాగా ఉదయించిన వర్గ చైతన్యాన్ని వృద్ధి' చేయడమే కవి సంకల్పమనీ, (పు 16) వ్యాసకర్త నిరూపించాడు సోదాహరణంగా.

'ఆధునిక కవుల్లో ఇంతగా ఉక్తివైచిత్ర్యాన్ని సాధించిన కవులు అరుదు (పు 88) 'అభ్యుదయ కవిత్వం చేరిన ముఖ్యమైన మజిలీని ఈ కావ్యం నిరూపిస్తుంది' (పు 89) అనే స్టేట్‌మెంట్స్ శేషేంద్ర శర్మగారిని వివాదాస్పద దృష్టితో చూచేవారికి రుచించక పోయినా అవి యదార్థాలు.

ఆ విషయం తెలుసుకోదలచినా ఈ విమర్శ గ్రంథం తప్పక పరిశీలించవలసిందే.

—డా॥ శివలెంక ప్రకాశరావు

Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247